# గాలివాటం



వాతావరణానికి, పరిసరాలకు అనుకూలంగా మానవులు, జంతువుల మాదిరే వృక్షాలు కూడా తమ పద్ధతులు, అలవాట్లు మార్చుకుంటాయనడానికి ఈ చిత్రమే నిదర్శనం. మనుగడకు ఏమాత్రం ఆలవాలం కాని ప్రాంతాల్లో పెరిగే వృక్షాల్లో ఈ గుణం ఎక్కువ. నిలువుగా పెరిగే చెట్లు ఉధృతంగా వీచే గాలుల తాకిడికి కూకటి వేళ్ళతో కుప్పకూలిపోతుంటాయి. గాలి తాకిడి అమితంగా ఉండే ప్రాంతాలలో పెరిగే చెట్లు తమని తాము రక్షించుకోవడం కోసం ఇలా గాలివాటంగా పెరుగుతాయి. ఇలాంటి వృక్షాలు బలీయమైన వేళ్లను కలిగి ఉంటాయి. ఆ వేళ్లు చెట్టు మొదలు, కాండం ఒత్తిడికి విరిగి పోకుండా కాపాడుతాయి.

నవ నవలా వేదిక

# చతుర

సంపుటి : 28 సంచిక : 10

నవంబరు: 2005 334 వ సంచిక

ఈ నెల నవల

ఆద్యంతం మానవతా పరిమళాన్ని గుబాళింపచేసిన
**సంగమం**
సి. జయాబాలకృష్ణ 14

ఇతర శీర్షికలు


- **రచయితలకు ప్రత్యేకం:** కథలు-కబుర్లు
  ముక్తవరం పార్థసారథి.................................... 4
- **కథ వెనుక కథ:** 'వెలుగు నీడ' నేపథ్యం గురించి
  గోవిందరాజు సీతాదేవి వివరణ............................ 6
- నవంబరు 'చతుర' నవల సమీక్ష కూపన్.................... 8
- **కాలాతీతం:** ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక
  వోల్టేర్– కాండైడ్ - నిర్వహణ: ఎం. వసంత.................. 9
- **చతుర భాషితాలు** ........................................ 54
- **వావ్:** వింతలు-విశేషాలు .................................. 78
- **చతుర కతలు** .............................................. 114
- **ప్రేమగానం:** ఇందిర కాలమ్ .............................. 121
- **ఫ్లాష్‌బ్యాక్:** నాటి చతుర, నాటి నవల .................... 124
- సెప్టెంబరు చతుర నవల **'ఒంటరి మేఘం'** పై
  పాఠకుల సమీక్షలు............................................ 128


ఇంకా హెల్త్ బిట్స్, ఫొటో వ్యాఖ్యలు

బొమ్మలు: వాసు




# రచనల్ని బూడిద చేయమన్న కాఫ్కా

పశుపక్ష్యాదులనేకం పాటలు పాడతాయనీ, ఆటలాడతాయనీ, నాట్యం కూడా చెయ్యగలవనీ అందరికీ తెలుసు. కథలల్లే జంతువుల్ని మాత్రం ఇంతవరకెవరూ చూడలేదు.

కెనడియన్ ఆర్కిటెక్ తీరంలోని ఇగ్లూలిక్ ఎస్కిమోలు 'ప్రతి మనిషీ ఒక కవి' అని నమ్ముతారట. మనమేం తక్కువ తిన్నామని? ఇది చదువుతున్న వాళ్ళు కనీసం ఒక్క కథయినా రాసే ఉంటారు.

అయితే కథలు చెప్పటం మనిషి సహజ స్వభావమని అంగీకరించినప్పటికీ, సాహిత్య పరంగా చూసినప్పుడు కొందరు మరికొందరికన్నా బాగా కథలు రాస్తారనీ, ప్రపంచ సాహిత్యాన్ని ప్రభావితం చేసిన మహానుభావులు కొందరే ఉన్నారనే విషయం అంగీకరించక తప్పదు.


ఫ్రాంజ్ కాఫ్కా

అలాంటివాళ్ళలో ఒక ప్రముఖుడు ఫ్రాంజ్ కాఫ్కా (1883-1924). ప్రాగ్ (పోలండ్)లో, ఒక యూదు కుటుంబంలో జన్మించాడు. న్యాయశాస్త్రంలో పట్టభద్రుడే కానీ, ఎప్పుడూ ప్రాక్టీస్ చెయ్యలేదు. గవర్నమెంటాఫీసుల్లో పనిచేసి అవినీతి అంటే ఏమిటో, ఎలా ఉంటుందో కళ్ళారా చూశాడు.

కాఫ్కా రచనలన్నీ ప్రతీకాత్మకం (అలెగొరీ). అయితే ఏ వాస్తవానికి అవి ప్రతీకలో మాత్రం స్పష్టంగా తెలియదు. అతడి మూడు అసంపూర్తి నవలల్లోనూ కథానాయకుల పేర్లు కె. 'ది ట్రయల్'లో జోసెఫ్ కె.; 'ది క్లాసిక్'లో కె.; 'అమెరికా'లో కార్ల్ రాస్మన్.

కాఫ్కా అప్పుడప్పుడూ ప్రేమలో పడ్డాడు. కానీ, పెళ్ళి చేసుకోలేదు. ఇందుకు రెండు కారణాలు. పెళ్ళితో స్వేచ్ఛ పోతుందనే అభిప్రాయం ఒకటైతే, క్షీణిస్తున్న ఆరోగ్యం మరొకటి. అతడు క్షయ వ్యాధి పీడితుడు.

రాయకుండా వుండలేని పరిస్థితుల్లో రాశాడు. కొన్ని కథలకు ప్రైజులు కూడా వచ్చాయి. కాని రాసింది అచ్చుకావటం ఇష్టం లేదు. ఎక్కువ భాగం చించేశాడు. అటక మీద పెట్టాడు. జూన్‌లో మరణం తప్పదని తెలిసినప్పుడు, తన బాల్యమిత్రుడు మాక్స్ బ్రాడ్‌కు రాత ప్రతులన్నీ అప్పగించి, తరువాత తీరిగ్గా తగలె

య్యమని అభ్యర్థించాడు.

స్నేహితుడికిచ్చిన వాగ్దానం నిలబెట్టలేదు బ్రాడ్. ఫలితంగా తరతరాల సాహిత్యాన్ని ప్రభావితం చేసిన కాఫ్కా రచనలు నేటికీ మనకు లభ్యమవుతున్నాయి. "రచనల ద్వారా నా నుంచి నేను పారిపోవాలని ప్రయత్నిస్తాను. కాని ఇది అసాధ్యమని తెలుసు" అంటూ బాధపడతాడు. ఈ కల్లోల ప్రపంచంలో కొట్టుకుపోకుండా ఉండటానికి సాహిత్యమనే రాతిబండను కరచిపట్టుకున్నాడు కాఫ్కా. "నాది స్వాప్నికలోకం. అందువల్ల వాస్తవ జీవితానికి దూరం కాక తప్పదు" అంటూ రాసుకున్నాడు డైరీలో.

ఆణిముత్యాల్లాంటి కథలనేకం రాశాడు కాఫ్కా. ముఖ్యంగా 'ఎ హంగర్ ఆర్టిస్ట్', 'జాకాల్స్ అండ్ అరబ్స్', 'ది జడ్జిమెంట్' వగైరా. అయితే కాఫ్కా పేరు చెప్పగానే అందరికీ గుర్తొచ్చే కథ 'ది మెటమార్ఫసిస్' -గ్రెగర్ జమ్జా అనబడే యువకుడు తెల్లారేసరికి తను ఒక 'కీటకం'గా మారిపోయానని తెలుసుకుంటాడు. హాస్యమూ, వ్యంగ్యమూ, అధివాస్తవికతా, తాత్వికతా మేళవించిన అద్భుత రచన.

కథల్లోని నైరాశ్యం కాఫ్కా జీవితానికే విస్తరించింది. ఆ రోజుల్లో ది మెటామార్ఫసిస్, మరో రెండు తాజాగా అచ్చయిన కథలు కలిపి గస్టాఫ్ జానూక్ అనబడే సాహిత్యప్రియుడు లెదర్ బైండింగ్ చేయించి, పుస్తకం మీద బంగారు అక్షరాలతో 'ఫ్రాంజ్ కాఫ్కా' అని ముద్రించి రచయితకు చూపాడు.

"ఇలా డబ్బు వృధా చెయ్యకు" అంటూ సలహా ఇచ్చాడు కాఫ్కా. దగ్గుతెర వచ్చింది. జేబురుమాలు నోటికడ్డం పెట్టుకుని,"నా కంత అర్హత లేదు. కథల్లో ఫైర్ లేదు" అన్నాడు.

"నా ఉద్దేశంలో ఇవి నిప్పుకణికలు. బాధాగ్ని జ్వాలలు. దారి చూపించే దివిటీలు" అన్నాడు జానూస్.

"అసలు వాటిని అచ్చు వెయ్యటమే పొరబాటు. ఇలాంటి కథల్ని తక్షణం తగలేసి బూడిద చెయ్యాలి"

జానూస్‌కు నోట మాట రాలేదు.

"మీ ఉద్దేశంతో నాకు సంబంధం లేదు. నా



మట్టుకు ఇవి నూతన సాహిత్య లోకాలకు ద్వారాలు తెరుస్తున్నాయి" అంటూ గొణిగాడు. "కళ అంటే లోకానికి అద్దం పట్టడమేనని చెప్పలేదూ పికాసో! ఫాస్టుగా తిరిగే గడియారం ముల్లులా సాహిత్యం మనకు భవిష్యత్తుని దర్శింపచేస్తుంది.

బాధతో, దుఃఖంతో కాఫ్కా మొహం ముడుచుకుపోయింది.

"ఏమో సత్యం రాయటమంటే భయం. కాని మరోలా రాయలేం గదా. అందువల్ల నిశ్శబ్దమే శ్రేయస్కరం. లోకానికి జబ్బు పట్టుకుంది. దీన్ని నయం చెయ్యటం ఎవరి తరమూ కాదు. నిజం చెప్పి మరింత నిరాశ పరచటమెందుకు? నేను రాసింది అచ్చు కాకూడదు" అన్నాడు కాఫ్కా.

(జానూస్ జ్ఞాపకాల ఆధారంగా)

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు)

✦

## ముగింపుకోసం ఆరునెలలు ఆగిన నవల

# వెలుగునీడ

### కథ వెనుక కథ

**రాయడానికన్నా, చదవటానికి ఇష్టపడతాననే గోవిందరాజు సీతాదేవి రచయిత్రుల్లో తనకంటూ ఓ విశిష్ట స్థానాన్ని ఏర్పరచుకోవడమే కాక దాన్నెప్పుడో సుస్థిరం చేసుకున్నారు. మూడొందలకు పైగా కథలు, పాతికవరకు నవలలు రాశారు. చుట్టూ ఉండే వారిని, వారి పరిస్థితులను మనస్తత్వాలని పరిశీలిస్తున్నపుడు తనలో ప్రబలే అశాంతి తోటే కలం పట్టే వారు ఆమె. వెలుగు నీడ నవల వెనక పెద్ద కథేమీ లేదని అంటున్నా అంతఃసౌందర్యాన్ని చాటి చెప్పిన ఈ నవల సీతాదేవికి ఎంతో పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టింది.**




ఉన్నత చదువులు చదవకపోయినా కుటుంబంలో వెల్లివిరిసిన సాహితీ వాతావరణం ప్రభావంతో రచయిత్రి అయ్యారు గోవిందరాజు సీతాదేవి. 'నేనెక్కువగా కథలే రాశాను. మొదట్లో అందరూ మా చెల్లెలే (యద్దనపూడి సులోచనారాణి) మరో పేరు పెట్టుకుని రాస్తోందనుకునేవారు. నేను రాస్తానంటే ఎవరూ నమ్మేవారు కాదు' అన్నారు సీతాదేవి నవ్వుతూ. ఆమె పుట్టిందీ పెరిగిందీ కృష్ణాజిల్లా కాజ గ్రామంలో. కథలు రాయడం ఇష్టమనే ఆమె దాదాపు మూడువందల దాకా కథలూ, ఓ పాతికవరకూ నవలలూ రాశారు.

గోవిందరాజు సీతాదేవి నవలలు ఆంగ్లంలోకి, కన్నడంలోకి అనువాదమయ్యాయి. గృహలక్ష్మి పురస్కారం, తెలుగు యూనివర్సిటీ ఉత్తమరచయిత్రి అవార్డులాంటి ప్రతిష్ఠాత్మక గౌరవాలెన్నో పొందారామె. ఆమె రాసిన తాతయ్య గర్ల్ ఫ్రెండ్ నవల చలనచిత్రంగా రూపొంది ప్రేక్షకాదరణ పొందింది.

చతుర కోసం, ఆమె తానురాసిన మొదటి నవల



గోవిందరాజు సీతాదేవి

'వెలుగునీడ' కథ వెనక కథ చెప్పారు.

**అసలు కథ ...**

జయపాలరావు అనే శ్రీమంతుడికి రాజ్యలక్ష్మి అనే ఉత్తమ ఇల్లాలు ఉంటుంది. ఆ దంపతులకు కవల పిల్లలు. వారిద్దరూ ఒడ్డూపొడుగూ ఒకేలా ఉన్నా రూపంలో పూర్తి విరుద్ధంగా ఉంటారు. ఇలాంటి కవలలు వారి వంశంలో పుట్టడం కొన్ని తరాలుగా వస్తోంది. పితృస్వామ్య భావజాలం కల జయపాలరావు అందమైన కొడుకుని అక్కున చేర్చుకుని అనాకారి అయిన కొడుకుని విదేశీయులకు ఇచ్చేయబోతాడు. భర్తకు అడ్డుపడి దెబ్బలు తిని బిడ్డను దక్కించుకుని సొంత ఇంటిలోనే జైలులాంటి నివాసంలో ఉంటున్న మరిది దగ్గర ఉంచుతుంది రాజ్యలక్ష్మి. అతనిదీ అలాంటి రూపమే. మరిది తదనంతరం తల్లే బిడ్డ బాధ్యత తీసుకుని తనకు చిన్ననాడు విద్యాబుద్ధులు నేర్పిన గురువుని రప్పించి బిడ్డను అప్పచెప్తుంది. కన్నతండ్రితో పాటు సమాజం అంతా తన పట్ల చూపుతున్న వివక్షను గ్రహించి కసి పెంచుకున్న రాజశేఖరాన్ని ఓపిగ్గా తన అదుపులోకి తెచ్చుకుని అతన్ని మంచి వ్యక్తిగా తీర్చిదిద్దుతాడు గురువు.




మరోపక్క చంద్రశేఖర్ ఐ.ఎ.ఎస్. అధికారై నిరుపమ అనే ఓ అందమైన అమ్మాయిని కోరి వరిస్తాడు. పెళ్లై అత్తారింటికి వచ్చిన నిరుపమకు ఓ వృద్ధమహిళ ఏదో చెప్పాలని ప్రయత్నించి సగమే చెప్తుంది. దాంతో తెలిసీ తెలియని విషయం, తెలుసుకుని తీరాలన్న పట్టుదల, మెట్టినింటి తీరుపై అనుమానం... నిరుపమ దాంపత్య జీవితంలో అశాంతికి ఆలవాలమవుతుంది. ఆమె కారణంగానే రాజశేఖర్‌ని అనుమానించి జయపాలరావు తుపాకీ ఎక్కుపెట్టడం, రాజశేఖర్‌తో స్నేహంగా మెలిగే ఏకైక వ్యక్తి అయిన రోహిణి ఆ తుపాకీ గుళ్లకు బలికావడం జరుగుతుంది. ఈ సంఘటనలతో విరక్తిచెందిన రాజశేఖర్ తన జీవితకథను నిరుపమ పేర పెద్ద ఉత్తరంగా రాసి హిమాలయాలకు వెళ్లిపోతాడు. హంతకుడిగా జయపాలరావు పోలీసులకు లొంగిపోవడం, చంద్రశేఖర్ నిరుపమల మధ్య అపార్థాలు తొలగడంతో నవల పూర్తవుతుంది. నవలలో తొలి సగం చంద్రశేఖర్ నాయకుడిగా కన్పిస్తే మలిసగం రాజశేఖర్ ప్రధానంగా సాగుతుంది.

**నేపథ్యం...**

రాజశేఖర్ వ్యక్తిత్వ ఔన్నత్యాన్ని చిత్రీకరించడంలో తాను చాలా కష్టపడాల్సి వచ్చిందంటారు సీతాదేవి. మొదట్లో చాలా మామూలుగా మొదలైన పాత్రను చివరికి వచ్చేసరికి తన అదుపులోకి తెచ్చుకోవడం ఇబ్బంది అయిందంటూ ఆమె ఇలా చెప్పుకొచ్చారు... "నేను రాయడంకన్నా చదవడానికే ఎక్కువ ఇష్టపడతాను. అలా ఎందరో మహా రచయితల రచనలు చదివేటప్పుడు అక్కడక్కడా కొన్నివాక్యాలు ముందుకు పోకుండా నిలబెట్టేస్తాయి. ఆలోచింపచేస్తాయి. మానవ అంతరంగాలలో గూడుకట్టుకున్న ఆవేదనలు, ఆలోచనలు, ఆనందాలను, సందిగ్ధాలను రచయిత తన అంతరంగంలోకి చూసుకుంటూ విశ్లేషించి ప్రదర్శిస్తే ఆ రచనకు సార్వజనీనత దానంతటదే వస్తుంది.... అనే ఈ వాక్యాలు ఎప్పుడు ఎక్కడ చదివానో గుర్తు లేదు కానీ నా మనసులో అప్పుడప్పుడు కదులుతూనే

ఉండేవి. నా చుట్టూ ఉండే సమాజంలోని వ్యక్తుల్ని, వారి పరిస్థితుల్ని, మనస్తత్వాల్ని పరిశీలిస్తున్నపుడు నాలో అశాంతి ప్రబలుతుండేది. మనిషి మనిషిగా బతక్కుండా అక్రమాలు, ఈర్ష్య, క్రోధంలాంటి గుణాలతో సాటివారిపట్ల రాక్షసత్వం ఎందుకు ప్రదర్శిస్తుంటాడు? మనిషి ఆలోచనా విధానం మంచివైపు కాక చెడువైపు ఎందుకు సాగుతోంది? లోపమెక్కడ? తల్లిదండ్రుల పెంపకంలో లోపమా? విద్యావిధానంలో లోపమా? సమాజంలోని పరిస్థితులు కారణమా? ఈ రకమైన ఆలోచనలు నన్ను వేధించేవి. తల్లి పెంపకం, ఉత్తమ గురువు వద్ద విద్యార్జన మనిషిని ఉత్తమ పౌరుడిగా తీర్చిదిద్దగలవని నాకనిపించేది. అలాంటి ఆలోచనల్లోంచి రూపుదిద్దుకున్నదే ఈ వెలుగునీడ.

అనాకారి అయిన రాజశేఖర్ తల్లి ప్రేమ, గురువు శిక్షణలతో చక్కటి వ్యక్తిత్వాన్ని అలవరచుకుంటాడు. బాల్యంలో అమాయకత్వంతో తండ్రిని నిలదీసిన రాజశేఖరే పెద్దవాడయ్యాక తండ్రికి ఎదురుతిరగాల్సిన, తిరగగల పరిస్థితి వచ్చినా ఎంతో పరిణతి చూపించి తండ్రిని అక్కడి నుంచి వెళ్లిపొమ్మంటాడు. కొడుకు ఔన్నత్యం ముందు తాను మరుగుజ్జునై పోయాననుకుంటాడు జయపాలరావు. రాజశేఖర్ రూపాన్ని చూడలేని నందిని వేణుగానం మాత్రమే విని ప్రేమించి, తనకు చూపు రాగానే రాజశేఖర్ దగ్గరికి వస్తానంటుంది. ఆమెకు అంతా మంచి జరగాలని కోరుకుంటూ ఆమె వచ్చి తన రూపం చూసి అందరిలా భయపడక ముందే తానే అక్కడ్నుంచీ వెళ్లిపోతాడు.

ఈ ముగింపు కోసం దాదాపు ఆరునెలలు నవలని ఆపేశాను. ఒకదశలో రాజశేఖర్ పాత్ర నా కలానికి లొంగలేదు. ఎన్నో రచనలు చేశాను కానీ ఏదీ నన్ను ఇంత ఇబ్బంది పెట్టలేదు. అందుకే ఈ పాత్ర అన్నా నవల అన్నా నాకు చాలా ఇష్టం. తొలుత 'పొలికేక' వారపత్రికలో సీరియల్‌గా వచ్చిందీనవల. లైట్ అండ్ షేడ్ పేరుతో ఆంగ్లంలోనూ ప్రచురించారు. పాతికేళ్లపైనే అయింది ఇది రాసి. సాధారణ పాఠకులకూ నచ్చింది కానీ ఎక్కువగా మేధావివర్గం నన్ను ప్రశంసించింది. సైకాలజీ, సోషియాలజీల మిశ్రమ అధ్యయనంగా పేర్కొన్నారు ఇంగ్లిషు పుస్తకానికి ముందుమాట రాసిన ఐ.వి. చలపతిరావు. బాహ్య సౌందర్యం కన్నా హృదయ సౌందర్యం మిన్న అని మీరు చెప్పిన తీరు చాలా నచ్చిందంటూ చాలామంది ఉత్తరాలు రాసేవారు నాకు. అందుకే ఈ కథ వెనక పెద్ద కథేమీ లేకపోయినా రచయిత అంతస్సంఘర్షణ ఎలా ఉంటుందో చెప్పడానికే నేనీ నవల గురించి చెప్పాను" అంటూ ముగించారామె.

– విస్మయ

---

**చతుర సమీక్ష** — నవంబరు 'చతుర' నవల సంగమం

సమీక్షకుని పేరు: ______________________

చిరునామా: ______________________

______________________

______________________

కాలాతీతం

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

ఫ్రెంచి నవల

# కాండైడ్

వోల్టేర్

1694 – 1778

వోల్టేర్ నవల కాండైడ్ సునిశితమైన వ్యంగ్య రచన. జెనీవాలో తొలిసారిగా అచ్చయినప్పుడు సిటీ కౌన్సిల్‌లోని పెద్ద లకు ఎంతో కోపం తెప్పించింది. పారిస్ లోనూ, ఇతర యూరోపియన్ నగరాలలో మాత్రం వేలం వెర్రిగా కొని చదివారు. విమర్శలు పెరిగినప్పుడు, "ఎవరో తుంటరి కుర్రాడు రాసుంటాడు. నేను కాదు" అంటూ తప్పించుకున్నాడు వోల్టేర్. మొత్తం మీద రచయిత జీవిత కాలంలోనే కనీసం నలభై సార్లు ప్రచురించారీ వ్యంగ్య ప్రహసనాన్ని.

అప్పుడు ప్రచారంలో ఉన్న తాత్విక ధోరణులను ఎద్దేవా చెయ్యటం వోల్టేర్ లక్ష్యం. నవల మొత్తం పేరు 'కాండైడ్ ఆర్ ఆప్టిమిజం'.

ఈ కథలోని హీరో పేరు కాండైడ్. యువకుడు, వెస్ట్ ఫాలియాలోని థండర్ టెన్ ట్రాంక్ బేరన్‌గారి కోటలో నివాసం. పేదవాడు. బేరన్‌గారి అక్రమ సంతా నంలో ఒకడేమోనని కొందరి సందేహం.

బేరన్‌గారి భార్య బరువు మూడు వందల యాభై పౌండ్లు. అందువల్ల సహ జంగానే అందరూ ఆమెను గౌరవించక తప్పదు. ఆమె కూతురు కునెగండ్. పది హేడేళ్ళ సుందరి. బేరన్‌గారికో కొడుకు కూడా ఉన్నాడు. అంతా తండ్రి పోలికే. డాక్టర్ పాన్‌గ్లాస్ అనే తత్వాచార్యుడు వీళ్ళకు పాఠాలు చెబుతుంటాడు. ఆయన జ్ఞానమంతా రెండు వాక్యాల్లో నిక్షిప్త మైంది. "నిప్పు లేక పొగ రాదు (కార్యకా రణ సంబంధం అనివార్యం). లోకాలన్నిం టిలోకీ మనదే ఉత్తమం. అందువల్ల జరి గేదంతా మన మంచికే"

కాండైడ్‌కు కునెగండ్ అంటే ప్రేమ. కాని చెప్పాలంటే ధైర్యం చాలదు. డాక్టర్ పాన్‌గ్లాస్ ఫిజిక్సు పాఠాలు చెప్పే క్రమంలో ఒక పడుచు పని పిల్ల మీద ముద్దులు కురిపించటం చూస్తుంది కునె గండ్. ఇదేదో కొత్త పాఠం కాబోలునను కుని తను కూడా కాండైడ్‌తో అదే ప్రయోగం చేస్తుంది. బేరన్‌గారు కూడా కార్యకారణ సంబంధాన్ని నమ్ముతాడు గనక కాండైడ్‌ని తన్ని ఇంటినుండి తరిమే స్తాడు.

వీధిన పడిన కాండైడ్‌ని ఇద్దరు దుండ గులు బల్గేరియా రాజుగారి కప్పగిస్తారు. అప్పుడు అల్బేనియాతో యుద్ధం చేస్తు న్నాడు. సైనికుల అవసరం చాలా ఉంది. పరస్పరం నరుక్కుని ఇద్దరు రాజులూ విజయం ప్రకటిస్తారు. కాండైడ్ హాలెండ్ పారిపోయి, ఒక ప్రీస్టు వద్ద ఆశ్రయమడు గుతాడు. ఈ సంభాషణ జరుగుతున్న క్రమంలో పై అంతస్తునుండి ప్రీస్టుగారి

ప్రజాస్వామ్య స్ఫూర్తికి, భావ ప్రకటన స్వేచ్ఛకు పర్యాయపదం వోల్టేర్. అసలు పేరు ఫ్రాంస్వా మారీ ఆరూ (1694-1778). కురూపి. అనారోగ్య పీడితుడు. అయినా 83 ఏళ్ల తన సుదీర్ఘ జీవితంలో ఎన్నో పోరాటాలు చేశాడు. చివరి దాకా కుశాగ్ర బుద్ధి. చేతికర్ర సాయంతో దేశదేశాలు తిరిగి తన సాంప్రదాయ వ్యతిరేక భావాలతో వివాదాలలో చిక్కుకుని, నిర్విరామంగా రాజకీయ, మతాధికారులతో తగాదాలు పెట్టుకుని జనంలో ప్రశ్నించే లక్షణాన్ని జాగృతం చేశాడు. మేధావి అన్నవాడు 'విశ్వాసి' కాడు. 'ఎందుకు?' అని అడగటం వాడి జాతి లక్షణం. అహంభావులను తొడగొట్టి సవాలు చెయ్యటం వాడికి నిత్య వినోదం.

పేరు రావటం గొప్ప కాదు. ఇరవయ్యేళ్లప్పుడే వోల్టేరును తిరుగుబాటు మేధావిగా, తాత్వికుడిగా యూరోపు గుర్తించింది. సమకాలీన జీవిత సంక్లిష్టతను ప్రజలకు తెలియచెప్పటంలో అతడు నిర్వహించిన పాత్ర అపూర్వం. వోల్టేర్ అభిప్రాయాలను నిరసించిన రాజులు, చక్రవర్తులు కూడా అతడి వాదనాపటిమ ముందు తలొంచక తప్ప లేదు.



రచయితగా అతడిది విలక్షణమైన శైలి. ఫ్రెంచి భాషలో అంత అందంగా రాసిన వాళ్లు అరుదుగా వున్నారంటారు. "కుండెడు తేనెలో నీటి బొట్టు లాగ ఒక అనవసరమైన మాట మంచి పుస్తకాన్ని నేలబారు రచనగా మారుస్తుంది" వోల్టేర్ అభిప్రాయాలతో

భార్య ఛేంబర్ పాట్ (మలమూత్ర విసర్జనకుపయోగించే పాత్ర) కుమ్మరిస్తుంది.

చివరికి జేమ్స్ అనబడే అనాబాప్టిస్ట్ (బాప్టిజం పొందనివాడు) చేరదీస్తాడు.

కాండైడ్‌కు ఒకనాడు ముష్టివాడు కనిపిస్తాడు. చిరుగు పాతలు. రోగిష్టి. అతడు డాక్టర్ పాన్‌గ్లాస్ అని తెలుస్తుంది. కాండైడ్‌కు కన్నీళ్ళాగవు.

"ఎందుకిలా జరిగింది? జగదేక సుందరి కునెగండ్ ఎలాగుంది?"

"బల్గేరియన్ సైనికులామెను మానభంగం చేసి, పొట్ట కోసి చంపేశారు. బేరన్, ఆయన భార్యా, కొడుకు కూడా హతమయ్యారు. కోట నేలమట్టమైంది. నాకీ గతి పట్టింది" అంటూ భోరుమంటాడు పాన్‌గ్లాస్.

దీనివెనక ఉన్న కార్యకారణ సంబంధం కాండైడ్‌కు అర్థం కాలేదు. సంపన్నులకు, అంతటి సుందరికిలా జరగటానికేమి హేతువు?

"నా అనారోగ్యానికి కారణమంటావా? ఆ పనిమనిషితో సంబంధం పెట్టుకున్నాను. తన రోగాలన్నీ నాకంటించింది"

జేమ్స్, పాన్‌గ్లాస్‌కు కూడా ఆశ్రయమిస్తాడు. ఇద్దర్నీ వెంట పెట్టుకుని లిస్బన్‌కు ప్రయాణమవుతాడు.

"చూశావా, అంతా మన మంచికే"

అంగీకరించని వాళ్లు ఇప్పటికీ వుండవచ్చు. కాని అతడి రచనలు 'డల్'గా వుంటాయని మాత్రం ఎవరూ అనలేదు. అతడు చేపట్టని సాహిత్య ప్రక్రియలేదు. కవిత్వం సరే. విషాదాంత నాటకాలు రాయటంలో తనకు తనే సాటి అనిపించుకున్నాడు.

విమర్శను సహించవచ్చుగానీ, వ్యంగ్యోక్తుల్ని భరించటం కష్టం. వోల్టేర్ 'సూటీపోటీ' మాటల్ని తట్టుకోలేని డ్యూక్ ఆఫ్ రోహన్ అతణ్ణి ఒకసారి తన్నించి జైల్లో వేశాడు. దీనికి మన రచయితగారి వ్యాఖ్య.

"ఘనత వహించిన రోహన్‌గారి ఆర్గురు వీరాధివీరులు నా మీదపడి కుమ్మారు. పరువు బజారున పడిందని చింతిస్తున్నాను. నా పరువు గాదు. రోహన్‌గారిది."

ప్రతీకారంగా వోల్టేర్‌కు మూడేళ్ళ దేశబహిష్కరణ శిక్ష పడింది. దాంతో ఇంగ్లండుకు వెళ్లాడు. అక్కడ ఇంగ్లిష్ నేర్చుకుని ప్రముఖ తాత్వికులు లాక్, హ్యూమ్‌లతో పరిచయం పెంచుకున్నాడు. ఫ్రెంచివాళ్లకన్నా, ఇంగ్లిష్ ప్రభుత్వ పద్ధతులు మెరుగైనవని గ్రహించాడు. ఇంగ్లిష్ శాస్త్ర, సాహిత్య గ్రంథాలను అధ్యయనం చేశాడు. "ఫిలసాఫిక్ లెటర్స్ ఆన్ ది ఇంగ్లిష్" ప్రచురించాడు. ఫ్రెంచివాళ్లకిది అవమానంగా తోచింది. పుస్తకాన్ని తగలపెట్టారు. మరోసారి ఫ్రెంచి జైళ్లనుంచి తప్పించుకున్నాడు.

ప్రభుత్వాలనెంత అసహ్యించుకున్నా స్వదేశంమీద ప్రేమ చావదు. స్విట్జర్లాండు సరిహద్దులోని ఫ్రెంచి గ్రామం ఫెర్రీలో స్థిరపడ్డాడు. అనేక కలం పేర్లతో అధికారుల మీద వ్యంగ్యాస్త్రాలు సంధించాడు. 1764లో 'ఫిలసాఫికల్ డిక్షనరీ' ప్రచురించాడు.

తత్కాలీన జనజీవితాన్ని చిత్రించేదే నిజమైన చరిత్ర అని వోల్టేర్ విశ్వాసం. ఈ దిశలో చేసిన తొలి ప్రయత్నం 'ఎస్సే ఆన్ మానర్స్' (1756). జీవితకాలంలో మొత్తం డెబ్బై సంపుటాల సాహిత్య సృష్టి చేశాడు వోల్టేర్. ఇతని తాత్విక రచనల్లో జాడిగ్ (1748); కాండైడ్ (1759) ముఖ్యమైనవి.

వోల్టేర్ మానవ హక్కుల ఉద్యమకారులకు స్ఫూర్తి ప్రదాత.

అంటాడు పాన్‌గ్లాస్.

లిస్బన్ తీరంలో పడవ ప్రమాదానికి గురవుతుంది. పాన్‌గ్లాస్, కాండైడ్ ఒడ్డుకు చేరుకుంటారు. భూకంపం వస్తుంది. లిస్బన్ ధ్వంసమవుతుంది. "రాబోయే ప్రమాదాల్నించి భూకంపం మనల్ని కాపాడింది" అని తత్వీకరిస్తాడు పాన్‌గ్లాస్.

మనుషులను బలి ఇస్తే భూకంపాలు రావని అక్కడివాళ్ళ విశ్వాసం. పాన్‌గ్లాస్‌ను ఉరి తీస్తారు. కాండైడ్‌కు కొరడా దెబ్బలు. ఆ రోజే మరోసారి భూమి కంపిస్తుంది.

కాండైడ్ పడుతూ, లేస్తూ అడుగులేస్తున్నప్పుడో వృద్ధురాలు కనిపించి ఓ బంగళాకు తీసికెడుతుంది. అక్కడ కునెగండ్ దర్శనమిస్తుంది. పాన్‌గ్లాస్ చెప్పింది నిజమే గానీ, ఆమె చావలేదు. ఆమెను అనుభవించిన బల్గేరియన్ ప్రేమతో చేరదీశాడు. భూకంపాలు రాకుండా శిక్షలు వేస్తున్న అధికారికి ఆమె అంటే ప్రేమ. ఆ సమయంలో కునెగండ్ అక్కడే ఉన్నందువల్లే కాండైడ్ మరణశిక్ష తప్పించుకోగలిగాడు. (ప్రస్తుతం కునెగండ్ ఒక యూదు (మరో ప్రేమికుడు) ప్రాపకంలో ఉంటోంది).

ఆ యూదును సౌమ్యుడైన కాండైడ్ వృద్ధురాలిచ్చిన ఖడ్గంతో హతమారు

స్తాడు. శిక్షలు వేసిన అధికారికీ అదే గతి పడుతుంది. కాండైడ్, కునెగండ్, వృద్ధురాలు పలాయనం చిత్తగిస్తారు. దారిలో, బ్యూనోస్ ఎయిర్స్‌కు యుద్ధానికి పోతున్న ఒక పటాలం కనిపిస్తుంది. అక్కడి గవర్నర్ కాండైడ్‌ను బంధించి, కునెగండ్ అందాలు సొంతం చేసుకోవాలనుకుంటాడు.

శత్రువుల కమాండెంట్‌గా వున్నది కునెగండ్ సోదరుడే. కాండైడ్‌కు తన సోదరిని పెళ్లాడే అర్హత లేదని నిందిస్తాడు. దాంతో ఇద్దరి మధ్య జరిగిన కత్తి యుద్ధంలో అతడు హతమవుతాడు.

"చీమకైనా పాపం తలపెట్టని నేను ముగ్గుర్ని చంపాను. అందులో ఇద్దరు ప్రీస్టులు" అని వాపోతాడు కాండైడ్.

అరణ్యంలో ఒకనాడు రెండు కోతులు (చింపాజీలు? ) ఇద్దరు యువతుల్ని తరుముకుంటూ రావటం చూసి వాటిని చంపేస్తాడు కాండైడ్. రక్షించినందుకు యువతులు తనకు కృతజ్ఞతలు చెబుతారనుకుంటాడు. కాని వాళ్లు కోతుల మృతదేహాల మీద పడి భోరున విలపిస్తారు. ఆశ్చర్యం!

"అలా ప్రతిదానికీ ఆశ్చర్యపడకు. అవి ఆ యువతుల ప్రేమికులు. మనుషులకూ కోతులకూ దగ్గరి సంబంధముందని కూడా తెలియదా!" అని విసుక్కుంటాడు సహచరుడు.

ఎల్డొరాడో దేశానికి వెడతాడు కాండైడ్. అక్కడ పిల్లలు రత్నాలు, వజ్రవైఢూర్యాలతో గోళీకాయలాడుకుంటుంటారు. అన్నీ ఇంద్ర భవనాలే! పేదవాళ్లక్కూడా సిల్కు బట్టలు.

"ఇక్కడి గులకరాళ్లు (రత్నాలు) ఒక డజను గొర్రెల మీద వేసుకుని వెడదాం. ప్రపంచంలో ఎక్కడైనా, ఏదైనా కొనొచ్చు" అంటాడు కాండైడ్.

కునెగండ్ బ్యూనోస్ ఎయిర్స్ గవర్నర్ ఉంపుడుకత్తెగా వుంటోందని తెలిసి, కాండైడ్ తన సహచరుణ్ణి బేరానికి పంపిస్తాడు. ఎల్డొరాడో నుండి తెచ్చిన వజ్రాలతో ఆమెను కొనుక్కోవాలి.

పారిస్‌లో, కాండైడ్ సంపద చూసి మిత్రులు చుట్టూ మూగుతారు.



సచిత్రంగా అలనాడెప్పుడో ప్రచురించబడిన వోల్టేర్ పుస్తకం

"లోకంలో అంతటా ఉన్నట్టే ఇక్కడా ప్రజలక్కావలసింది సెక్సు, పరనింద, ఉబుసుపోక కబుర్లు" అని తత్వీకరిస్తాడు మార్టిన్ అనబడే మిత్రుడు.

"కానీ మనుషులెప్పుడూ ఇలాగే ఉన్నారా? అబద్ధాలు, ద్రోహం, కృతఘ్నత, దొంగతనం, హిపోక్రసీ మొదటినుండీ ఉన్నాయా? తిండి పోతులు, పిరికి పందలుగానే మనుషులు బతికారా? " అని సందేహం.

"డేగలెప్పుడూ పావురాలనే తిన్నాయా అని అడిగినట్టుగా ఉంది" అని మార్టిన్ సమాధానం.

ఏదో మిషతో కొత్త మిత్రులు వచ్చి వజ్రాలు జేబులో వేసుకుని పోతుంటారు.

కునెగండ్ తనకోసం నిరీక్షిస్తోందనుకుని కాండైడ్, వెనిస్ నగరానికి ప్రయాణమవుతాడు. కాని అక్కడో దుర్వార్త తెలుస్తుంది.

"కునెగండ్ ఇప్పుడు బానిస. అంట్లు తోమటం, బట్టలుతకటం ఆమె పని. అందం ఎప్పుడో పోయింది" అని చెబుతాడు సహచరుడు.

"ఎలా ఉన్నా ఆమె నాది" అంటాడు కాండైడ్. దొంగలు వజ్రాలు దోచుకున్నారు. గవర్నర్ అతణ్ణి, అతడి సహచరుణ్ణి, కునెగండ్‌నూ బానిసలుగా అమ్ముకున్నాడు.

మరణించారనుకున్న పాన్‌గ్లాస్, బేరన్ కూడా బానిసలుగా వున్నారని తెలుస్తుంది. తన సంపదతో కాండైడ్ అందరికీ 'స్వేచ్ఛ' కొంటాడు.

పాన్‌గ్లాస్ ఉరికంబమెక్కినమాట నిజమే గాని, ఉరితాడు సరిగా బిగుసుకోలేదు. అలాగే, బేరన్‌కు కత్తిపోట్లు తగిలాయిగానీ, తర్వాత కోలుకున్నాడు.

బేరన్‌కు యింకా కాండైడ్‌మీద కోపం పోలేదు. కాండైడ్ అతణ్ణి తిరిగి బానిసగా అమ్మేస్తాడు.

చిన్న పొలం కొనుక్కుని స్థిరపడతాడు.

"అంతా మన మంచికే చెప్పానా!" అంటూ సమర్థించుకుంటాడు పాన్‌గ్లాస్.

"సరే! పొలం మీద శ్రద్ధపెట్టి సాగు చేసుకోకపోతే పంట పండదు."అంటాడు కాండైడ్.

* * *

ఆనాటి మత ఛాందస, మౌఢ్యాన్నీ, అలసత్వాన్ని సమర్థించే మూర్ఖ తాత్విక ధోరణులనూ (వీటిని ప్రతిపాదించిన వాడు లీబ్ నిట్జ్) నిశితంగా విమర్శించిన రచన కాండైడ్. 'ఎస్సే ఆన్ మానర్స్' రాస్తున్న క్రమంలో వోల్టేర్ అనేక శాస్త్రతాత్విక విషయాలనూ, మనుషుల ప్రవర్తననూ, వాటి మూలాలనూ, రాజుల నిరంకుశ ధోరణులనూ, అన్యాయాలను నిశ్శబ్దంగా సహించే ప్రజల పిరికి తనాన్నీ లోతుగా అధ్యయనం చేశాడు వోల్టేర్.

జీవితంలో యాక్సిడెంట్లు జరుగుతాయి. కాని అంతా మన మంచికే అనుకోవడం ఎంత అర్థరహితం. 1755లో లిస్బన్‌లో నిజంగానే భూకంపం వచ్చింది. ఇలాంటి విపత్తులు సంభవించినప్పుడు 'భగవంతుడు దయాళువు' అని నమ్మటం కష్టం. ఈ లోక రీతిలో ఏదో తిరకాసున్నది. అందుకే నిత్య సంఘర్షణలు, యుద్ధాలు. కాండైడ్ చిన్న పుస్తకం. నవల కాదు. ఏమైతేనేం, ప్రపంచ సాహిత్యంలో ఒక మైలురాయి. ✦



## సి. జయాబాలకృష్ణ

దురలవాట్లకు బానిసలై బంగారు భవిష్యత్తును
అంధకార బంధురం చేసుకునే కొందరు
విద్యార్థులకు హితబోధ చేసి సన్మార్గంలో
నడిపించిన ఆ ఆదర్శమూర్తి...
ఒక భూకంపం జనావళిని శోక సంద్రాన
ముంచినా, సునామీ విలయతాండవం
చేసినా నేనున్నానంటూ ముందుకు
సాగి చేయూతనిచ్చిన
ఆ మానవతావాది...

ఇక తమ జీవితం శూన్యమేనని
నిరాశా నిస్పృహలతో
బతుకీడుస్తున్న వారి కళ్లల్లో
కోటి కాంతులు నింపిన
వైనానికి సాక్షరరూపం
**సి.జయా బాలకృష్ణ**
నవల **'సంగమం'**
ఈ నెల 'చతుర' సమర్పణ.

తూర్పున ఉషఃకాంతులు ప్రసరిస్తు న్నాయి. శంకరంగారు ఉషోదయానికి పూర్వమే లేచారు. దంత ధావనం చేసుకుని, కాస్త శుభ్రత కోసం, నిద్రమత్తు వదలటం కోసం, ముఖం కడుక్కుని, బట్టలు మార్చుకుని నడకకి వెళ్తారు. ఆయన దినచర్య దీనితో ప్రారంభం అవుతుంది.

ఆరోజు ఉదయం నడక పూర్తిచేసుకుని ఇంటికి వచ్చారు. పేపరు చూస్తూ కూర్చున్నారు. ఉష కాఫీ తీసుకువచ్చి శంకరంగారికి యిచ్చి తనూ ఓ కప్పు తెచ్చుకుని కూర్చుంది.

శంకరంగారి పక్క ఫ్లాటులోనే ఉంటోంది ఉష. ఆయనకి ప్రతిరోజూ ఉదయం కాఫీ తనే యిస్తుంది. తరువాత, తన ఇంట్లోకి వెళ్లి వంటపనిలో మునిగిపోతుంది.

శంకరంగారి పనిమనిషి యాదమ్మ అన్ని పనులూ చేసిపెడుతుంది. ఆయన జీవితం సాఫీగానే జరిగిపోతోంది.

పేపరు చూసి పక్కన పెట్టారు శంకరంగారు. ఎనిమిది గంటలవుతుండటంతో టి.వి. పెట్టారు.

టి.వి.లో వార్తల ఛానెల్ చూస్తున్న ఆయనకి ఆశ్చర్యం వేస్తోంది. సముద్రం పొంగింది. ఉధృతమైన అలల తాకిడికి, సముద్రపు ఒడ్డున నివసించే జాలరుల కుటుంబాలకి కుటుంబాలు కొట్టుకుపోయాయి. వాళ్ల ఇళ్లూ, ఆస్తులూ, పడవలూ- ఆ భయంకరమైన అలలు సమస్తాన్నీ మింగేశాయి. , పిల్లలూ, పెద్దలూ మరణించారు. భయంకరమైన అలల తాకిడికి ఒడ్డుకు చేరిన మృతదేహాలు ఎన్నో. కొట్టుకుపోయి, జాడ తెలియకుండా పోయినవారు ఎందరో!

ఆ సముద్రపు అలల ఉధృతం కొద్దినిమిషాలే వున్నా - ఆ బీభత్సానికి జరిగిన, జరుగుతున్న ప్రాణనష్టం, ఆస్తినష్టం, క్షణ క్షణానికీ పెరుగుతున్నట్లు వార్తలు వస్తుంటే ఆయనకి విపరీతమైన బాధా, ఆశ్చర్యమూ కలుగుతున్నాయి. చెన్నై నగరంలో ఉదయం పూట ఫుట్‌పాత్ మీద నడుస్తున్న వారిని ఆ భయంకరమైన రాకాసి అలలు అంతదూరం వచ్చి లాక్కుపోయాయి. ఒక్కరూ ప్రాణాలతో బ్రతికి వున్న నమ్మకం లేదు.

దూరదర్శన్, ఇతర ఛానెల్స్ వారు, పత్రికల వారు, ఆకాశవాణి బృందాలు వార్తల్ని సేకరించటం కోసం పరుగులు పెట్టారు.

యాంత్రికంగానే ఆయన దినచర్య ముగించుకుని టి.వి. ముందు కూర్చున్నారు. టి.వి.లో వస్తున్న వార్తలు అంతకంతకీ భయంకరంగా ఉంటున్నాయి. ఆ దృశ్యాల్ని చూస్తూ వుంటే ఆయనకి బాధగా వుంది. హృదయవిదారకమైన దృశ్యాలు, సంఘటనలూ.

ఎక్కడ చూసినా నీరు! విరిగి పడిపోయిన చెట్లూ, చేమలూ, అలలకి కొట్టుకుపోయిన కార్లూ, లారీలూ. జాలరులిళ్లూ, వాకిళ్లూ, వాళ్ల పడవలూ, వలలూ, పిల్లలూ, పెద్దలూ ఎంతమంది! ఎన్ని వేల మంది కొట్టుకుపోయారో.. లెక్క తెలియటం లేదు.

సాయంకాలం అయింది. శంకరంగారు టి.వి.ముందు కూర్చుని వార్తలు చూస్తున్నారు. ఆ భయంకరమైన అలల రాకాసిని 'సునామి' అని పిలుస్తున్నారు.

ఎంతటి ఘోరం! ఎంతటి భయంకరమైన విలయతాండవం! సృష్టిలోని అందాల్నీ, సుందరమైన వాటిని చూస్తూ, అనుభవిస్తూ ప్రాణి సుఖపడటంతోపాటు, వాటిని తన అవసరాలను తగ్గట్టుగా మలచుకుని ఆనందంగా బతుకుతున్నాం. కానీ, ఆ సృష్టే ఎదురు తిరిగి, విజృంభించి లోకం మీదికి విరుచుకుపడితే ఏమీ చెయ్యలేడు వెర్రి మానవుడు.

ప్రళయం వచ్చిన తరువాత దిక్కుతోచక, అశక్తుడై, అయోమయంలో పడే మానవుడు... ప్రళయం రాకుండా ఆపగలిగే శక్తి లేని అర్భకుడు! అనుకుంటూ బాధపడుతు

## రచయిత్రి పరిచయం

అసలు పేరు జయలక్ష్మి. పుట్టింది, పెరిగింది, చదువుకున్నది విజయవాడలో. టీనేజ్‌లోనే వివాహం జరిగింది. మెట్టినిల్లు గుంటూరు. ఇద్దరు పిల్లలు, ప్రస్తుతం హైదరాబాద్‌లో నివాసం.

సంగీతమన్నా, సాహిత్యమన్నా ఇష్టం.

భర్త బాలకృష్ణ ప్రోత్సాహంతో రచనలు ప్రారంభించారు. 1970 నుంచి వివిధ వార మాసపత్రికలలో అనేక కథలు, సీరియల్ నవలలు, ప్రచురితమయ్యాయి. కొన్ని డైరెక్ట్ నవలలు కూడా ప్రచురించారు. భర్త మరణానంతరం చాలా కాలం రచనా వ్యాసంగానికి దూరంగా ఉన్నారు. పిల్లల ప్రోత్సాహంతో మళ్లీ 1997లో కలం చేతబట్టారు. ఆ తర్వాత రాసిన రెండు నవలలు ఒక మాసపత్రికలో అనుబంధ నవలలుగా ప్రచురితమయ్యాయి. ఆ రెండు నవలలు కన్నడ భాషలోకి అనువాదమై అక్కడి మాసపత్రికలలో సీరియల్స్‌గా వచ్చాయి. 2005 జనవరిలో జరిగిన 'ఆటా' కథల పోటీలో 'మల్లి నవ్వింది' అనే కథకు బహుమతి లభించింది.

చిరునామా : సి. జయాబాలకృష్ణ, 2-2-647/77/బి-5,
ఫ్లాట్ నెం. 104, నెడుమూరి మేన్షన్, ఎస్‌బిఐ కాలనీ,
బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్ – 13.

న్నారు శంకరంగారు.

"మాష్టారూ! చూస్తున్నారా? ఎన్నెన్ని ఘోరాలు జరుగుతున్నాయో! ఇంకా ఆ ఉధృతం ఆగలేదు. ఘోరాలు జరుగుతూనే ఉన్నాయి" ఆఫీసు నుంచి వచ్చిన కిశోర్ శంకరంగారి దగ్గర కూర్చుని అన్నాడు.

"అవునయ్యా! కిశోర్! చాలా భయంకరంగా జరుగుతున్నాయి. ఎంతమంది ప్రాణాలు పోగొట్టుకుంటున్నారో...! అక్కడికి వెళ్లాలని వుంది వాళ్ళకి. ఏదో సహాయం చెయ్యాలని వుంది..." ఆరాటపడ్డారు శంకరంగారు.

శంకరంగారి మాటలకి ఆలోచనలకీ ఆనందమూ, ఆశ్చర్యమూ రెండు కలిగాయి కిశోర్‌కి. ఇప్పుడు కూడా ఆపదలో ఉన్నవారికి, ఏదో చెయ్యాలన్న ఆయన తాపత్రయానికి ఆనందం వేసింది అతడికి.

"మీ తాపత్రయం నేను అర్థం చేసుకోగలను. కానీ వద్దు మాష్టారూ! నేను తమిళనాడుకి వెళ్తున్నా. మీకు ఆ విషయం చెబుదామనే వచ్చాను. మా ఆఫీసుకు సెలవు పెట్టి, మా సీనియర్లు ఇద్దరూ, మా కొలీగ్ ఒకరు, నేనూ అందరం కలిసి బయలుదేరుతున్నాం"

"నేను కూడా వస్తానయ్యా!"

"మాష్టారూ! ఆ నాటి భూకంపం నాటి కంటే ఇప్పుడు మీ వయసు పెరిగింది. ఎక్కువగా శ్రమపడటం కష్టం. అక్కడి పరిస్థితులూ నానా బీభత్సంగా వున్నాయి. మీ వంతు సహాయం కూడా నేను చేస్తాను మాష్టారూ! ప్లీజ్! బాధపడకండి. మాకు పదిరోజులు శలవు మంజూరయింది. అవసరమైతే మరో నాలుగు, అయిదు రోజులు పొడిగించవచ్చు" అన్నాడు కిశోర్.

మౌనంగా కూర్చున్నారు శంకరంగారు.

ఆఫీసువాళ్లు ఇచ్చిన సహాయనిధి ఉద్యోగస్తుల ఒకరోజు జీతం మొత్తమే కాకుండా, ఇంట్లో ఉన్న కొన్ని దుప్పట్లూ, స్త్రీలవీ, పురుషులవీ, పిల్లలవీ, చిన్నపిల్ల లక్ష్మివి కొన్ని బట్టలూ అన్నీ అట్టపెట్టెలో సర్దుకుని ప్యాక్

చేస్తున్నారు. మరికొన్ని అవసరం అనిపించినవి సర్దుకు న్నారు. రెండురోజుల తరువాత కిశోర్ తన ఆఫీసు వాళ్లతో కలిసి తమిళనాడులోని నాగపట్టణం ప్రాంతానికి వెళ్లాడు.

* * *

రాత్రి పడుకున్నా శంకరంగారికి నిద్ర రావటం లేదు. అరవై ఎనిమిది సంవత్సరాల వయసు ఆయన్ని ఆరోగ్యం గానే ఉంచింది. ఆయన దైనందిన జీవితంలో కూడా కొంత క్రమశిక్షణ అనుసరించే గడుపుతారు.

లేచి బాల్కనీలోకి వచ్చి కూర్చున్నారు. ఆకాశం నిర్మ లంగా వుంది. ఒంటరి చందమామ ప్రశాం తంగా ప్రయాణం చేస్తు న్నాడు.

సినిమా రీలులాగా ఆయనకు గతం కళ్ల ముందు తిరిగింది. ఆనాటి సంఘటనలూ కళ్లముందు తిరుగుతు న్నాయి. ఎలాంటి గతం! ఎలాంటి సంఘటనలు! మరిచిపోదామన్నా మరు వలేని గతం, మరిచిపో లేని జ్ఞాపకాలు కొన్ని సంవత్సరాలు వెనక్కి తీసుకువెళ్లాయి.

ఆరోజు తూర్పున భాస్కరుడు ఇంకా లోకం మీదికి రాలేదు. శంకరం గారు ఉషోదయానికి మునుపే లే చి మార్నింగ్‌వాక్‌కి బయలుదేరారు.

నడక ముగించుకుని తిరిగివచ్చి, తాళం తీసుకుని, గుమ్మం ముందున్న పాల ప్యాకెట్టూ, పేపరూ లోపలికి తీసుకువెళ్లారు. స్టౌ వెలిగించి పాలు పొయ్యి మీద పెట్టారు. పాలు కాగేసరికి, ఫిల్టర్‌లో డికాక్షన్ దిగింది. కాఫీ చేసుకుని, కాఫీ గ్లాసు చేతిలో పట్టుకుని హాల్లోకి వచ్చి కూర్చున్నారు. కాఫీ తాగి పేపరు చేతిలో పుచ్చుకుని కేను సోఫాలో చతికిలపడ్డారు. పేపరు ఇంకా మడత విప్పలేదు.

ఇంతలో పనిమనిషి యాదమ్మ వచ్చింది. గిన్నెలు కడిగి, ఇల్లు

ఊడ్చి, తుడిచి, ఆయన బట్టలు ఉతికి ఆరేసి వచ్చింది. మళ్లీ ఓ కప్పు కాఫీ కలిపి, ఆయనకి ఇచ్చి, తనూ ఓ గ్లాసు తాగింది.

తర్వాత ఆయన దగ్గరికి వచ్చి, "ఏం కూర కొయ్యాలయ్యా? " అని అడిగింది. ఆయన చెప్పిన కూర తరిగి, వంటచేసి, వంట ఇల్లూ, స్టౌ తుడిచి వెళ్లిపోతుంది. మళ్లీ సాయంత్రం వస్తుంది.

ఇదీ శంకరంగారి దినచర్య.

శంకరంగారు స్కూలు మాష్టారు. ఒక గవర్నమెంటు స్కూల్లో టీచరుగా పని చేసి పదవీ విరమణ చేశారు. ఆయనకి ఉపాధ్యాయ వృత్తి అంటే ఇష్టం. ఎమ్.ఎ. బి.ఇడి చేశారు. ఆ చదువే ఆయనకి గొప్పగా అనిపించింది. కొన్నాళ్లు మిషనరీ స్కూల్లో టీచరు ఉద్యోగం చేశారు. ఆ తరువాత, ఆయనకి గవర్నమెంటు స్కూల్లో ఉద్యోగం వచ్చింది.

'బతకలేక బడిపంతులు' అన్న సామెత వున్నా ఆయన మాత్రం బడిపంతులు ఉద్యోగంతోనే బతికారు. శంకరంగారు లెక్కల మాష్టారు అయినందుకే ఆనందపడిపోయారు. ఆయన కల నిజమైంది.

ఇంజనీర్లూ, డాక్టర్లూ, సైంటిస్టులూ, లాయర్లూ అవాలనీ ఇంకేవో సాధించాలనే కోరికలు వున్నవాళ్లలాగే- అవి వాళ్లకి గొప్ప కోరికలు లాగానే - శంకరంగారికి గవర్నమెంటు స్కూల్లో లెక్కల మాష్టారి ఉద్యోగం అంతకంటే గొప్పగా అనిపించింది. ఒక రకంగా ఆయన అల్పసంతోషి.

అసలు, ఎందరో గొప్ప గొప్ప వాళ్లకి చిన్నప్పుడు పునాదులు వేసి, చదువులు చెప్పే గురువుగా తన ఉపాధ్యాయుడి ఉద్యోగం గొప్పగా అనిపించేది ఆయనకి.

గురువు అనే వ్యక్తి లేకుండా ఏ వ్యక్తీ చదువు సంపాదించుకోలేడు. మనిషికి ఆది గురువు తల్లి అయితే తరువాత గురువు ఉపాధ్యాయుడు. ఏ వ్యక్తి గొప్పవాడిగా ఎదిగినా అతని గురువు ప్రోత్సాహం, శ్రమ కూడా వుంటాయని ఆయన భావన.

నిజానికి శంకరంగారు చదువుకుని, ఒక మంచి ఉపాధ్యాయుడు కావటానికి కారణం ఆయన చిన్ననాటి రామనాథం మేష్టారు. ఆయన శంకరంగారికి ఆదర్శం!

శంకరంగారికి ఆయన తండ్రి రెండున్నర ఎకరాల పొలం ఇచ్చారు.

భార్య శ్రీలక్ష్మి అనుకూలవతి. వాళ్ళకి ఇద్దరు అమ్మాయిలు. ఇద్దరు కూతుళ్లనీ పోస్టుగ్రాడ్యుయేషన్ వరకూ చదివించారు. తండ్రి ఇచ్చిన రెండు ఎకరాలూ అమ్మి వాళ్లకి పెళ్లిళ్లు చేశారు. ఆయన అల్లుళ్లు మంచి వాళ్లు. ఇద్దరు కూతుళ్లలో ఒకరు ఢిల్లీలోనూ, ఒకరు బెంగుళూరులోనూ ఉంటున్నారు.

మిగిలిన అర ఎకరం అమ్మి మరికొంత డబ్బువేసి, ఒక ఫ్లాటు కొన్నారు. రెండు సంవత్సరాల క్రితం ఆయన భార్య శ్రీలక్ష్మి గుండెపోటు వచ్చి మరణించింది.

శంకరంగారిని ఒంటరితనం బాధిస్తూ వుంటుంది. అనుకూలవతి అయిన భార్య మరణించేసరికి తోడులేని ఒంటరి బతుకు అయిపోయింది. భార్యా, భర్తల చివరిదశలో ఈ ఎడబాటు ఇద్దరిలో ఎవరికో ఒకరికి తప్పదని తెలిసినా ఎవరికి వారికి అనుభవంలోకి వచ్చేసరికి ముందు బాధ, ఆ తరువాత వేదాంతం, విరక్తీ కలుగుతాయి. అప్పుడప్పుడూ గతకాలపు జ్ఞాపకాలతో బతుకుతూ వుంటారు. 'గురుబ్రహ్మ', 'ఉత్తమ ఉపాధ్యాయుడు' అని ఎన్నో బిరుదులు ఆయన్ని వరించాయి. ఎన్ని బిరుదులు సంపాదించినా శిష్యులు బాగా చదువుకుని, పైకి వచ్చారని తెలిసినప్పుడు ఆయన మనసు ఎక్కువ ఉప్పొంగిపోతుంది.

అప్పుడప్పుడూ శంకరంగారి కూతుళ్లూ, అల్లుళ్లూ, వాళ్లపిల్లలూ వస్తూ వుంటారు, సందడి చేస్తూ వుంటారు.

"మా దగ్గరికి వచ్చెయ్యి నాన్నా! ఒంటరిగా ఎందుకు నువ్వు ఇక్కడ ఉండటం? " అని అడుగుతారు కూతుళ్లు.

"తప్పకుండా వస్తానమ్మా! నాకు మీరు తప్ప ఎవరున్నారు? కానీ నా ఒంట్లో శక్తి వున్నంతవరకూ ఎవరిమీదా ఆధారపడ కుండా బతకాలని నా కోరిక. అంతవరకూ నా గురించి మీరు ఎటువంటి బాధ పడ కండి" అని సున్నితంగానే చెబుతారు.

శంకరంగారు దాచుకున్న డబ్బు మీద వడ్డీ, నెలనెలా వచ్చే పెన్షన్ డబ్బులతో ఆయన జీవితం సాఫీగానే గడిచిపోతోంది.

ఎవరైనా విద్యార్థులు వస్తే ఉచితంగానే ప్రయివేటు చెప్పి పంపుతారు. 'తనకి ఉన్నది చాలు! ఇంక ఎవరికోసం తను సంపాదించాలి కనుక!' అనుకుంటారు.




పేపరు చూస్తున్నారు శంకరంగారు. ముఖ్యవార్తల్లో పెద్దపెద్ద అక్షరాలతో 'గుజరాత్‌లో భీకరమైన భూకంపం' అని, 'ఇంత వరకూ కనీ, వినీ ఎరుగని భయంకరమైన భూకంపం!' అని వుంది. గుజరాత్‌లో 'భుజి' అనే పట్టణంలో దారుణంగా భూకంపం వచ్చింది. ఆ చుట్టుపక్కల ఊళ్లలో భూప్రకంపనాలు, ఆస్తినష్టం, ప్రాణ నష్టం చాలా ఎక్కువస్థాయిలో జరిగివుంటుందని అధికారులూ, అక్కడ వున్న ప్రజలూ భయపడుతున్నారంటూ- పేపరు నిండా భూకంపం, దానివల్ల కలిగిన కష్ట, నష్టాల గురించిన వార్తలే. అవి చదివి చాలా బాధపడ్డారు. పేపరంతా వరుసగా తిరగేశారు. లోపలి పేజీల్లో కూడా భూకంపం జరిగిన సంఘటనల గురించి, వాటిని గురించిన ఫొటోలూ, వివరాలూ వున్నాయి. 'ఎంత ఘోరం, జరిగిపోయింది! ఎంత మంది ప్రజలు చనిపోయారో! ఎంత మంది తమవాళ్లని, ఆస్తుల్ని, నిలువ నీడని పోగొట్టుకుని నిస్సహాయులయ్యారోనని శంకరంగారు బాధపడ్డారు. క్రితం రోజు ఆయన టి.వి. చూడలేదు. అందుకే ఆ బీభత్సం గురించి తెలియలేదు.

తన స్నేహితుడు భాస్కర్రావు తనకంటే రెండేళ్ల ముందర రిటైరైనాడు. ఆయన ఆ 'భుజి' పట్టణంలోనే తన కొడుకు దగ్గర ఉంటున్నాడు. వాళ్ల కుటుంబం ఏమైందో?

టి.వి. ఆన్‌చేసి న్యూస్ ఛానెల్ పెట్టారు. విషాదకరమైన వార్తలు! భయంకరమైన సంఘటనలు! ఆర్తనాదాలు! తమ వాళ్ల కోసం ఏడుపులూ, పెడబొబ్బలు. చాలమంది బతికి వున్నారో, చనిపోయారో తెలియని సందిగ్ధస్థితి! మిగిలిన బతికివున్నవాళ్ల గురించి ఆలోచన. ప్రకృతి విలయతాండవం గురించి, జరిగిన ఘోరమైన భూకంపం గురించి టి.వి.లో వార్తలు వస్తూనే వున్నాయి. చూస్తున్నకొద్దీ శంకరంగారి మనసు వికలమైపోతోంది.

శంకరంగారు యాంత్రికంగానే దినచర్య ముగించుకుని ఇంట్లో నుంచి బయటపడ్డారు. ఇంట్లో ఉండగా ఫోన్ చేసిన స్నేహితులూ, బంధువులూ ఈ సంగతులే మాట్లాడారు. ఎక్కడ ఎవరినోట విన్నా భూకంపం గురించిన చర్చే! మరణించిన వారిని గురించి సానుభూతి, ఇళ్లూ, వాకిళ్లూ, ఆస్తులూ పోగొట్టుకుని, బతికి బయటపడిన వారిని గురించిన బాధ, ఆలోచన...! వాళ్ల బతుకులేమిటి...! ఎలా బతుకుతారు వాళ్లు...!

సున్నితమైన శంకరంగారి హృదయం బాధపడిపోతోంది. తన స్నేహితుడు భాస్కరరావు కుటుంబం ఏమైందో...! తలచుకుంటే బాధగా వుంది. పగలు ఎంతసేపు స్నేహితులతో గడిపినా ఇంటికి చేరిన తరువాత భూకంపం బాధితుల బాధలే మన

సుని కోసేస్తున్నాయి.

రేడియో, దూరదర్శన్, పత్రికలు సహాయక చర్యల వివరాలూ, ఫోన్ నంబర్లూ, ఫొటోలూ, తెలిసినంతవరకూ పోయినవారి పేర్లూ, బతికి వున్నవారి వివరాలూ తెలియ చేస్తున్నాయి.

సహాయానికి ముందుకు రావాలి, ఆర్థిక సహాయం కావాలి, తినటానికి కావాలి. డాక్టర్లూ, నర్సులూ, మందులూ కావాలి. స్వచ్ఛంద సంస్థలు ముందుకు రావాలి. బట్టలూ, వంట సామానులూ, తినుబండారాలూ ఎవరు ఏ రూపంలో ఇచ్చినా తీసుకుంటామని ప్రకటనలు.

కేంద్రప్రభుత్వం సైనిక బృందాన్ని పంపింది సహాయానికి. స్థానిక పోలీసులూ, ఇన్‌స్పెక్టర్లూ, సబ్ ఇన్‌స్పెక్టర్లూ, స్థానిక ఎమ్మెల్యేలూ, ఛైర్‌పర్సన్లూ, రెడ్‌క్రాస్‌వారూ, ఎన్.సి.సి. సిబ్బంది, స్కౌట్లూ అందరూ అవసరమే. ఎవరు ఏ చిన్న చేయూతనిచ్చినా అక్కడి వారికి అది మహాభాగ్యమే!

రెండు రోజులు వార్తలు వింటూ, చూస్తూ మానసికంగా బాధతో సతమతమయ్యారు శంకరం. బయటికి ఎక్కడికైనా వెళ్లి రావాలన్పించింది. మిత్రుడు సారధి ఇంటికి వెళ్లారు. సారధికూడా షుమారుగా శంకరంతోపాటే రిటైర య్యారు.

ఆయన వెళ్లేసరికి హాల్లో కూర్చుని పేపరు చూస్తున్నారు సారథి.

"ఏం సారధీ! పేపర్లో వార్తలూ, ఫొటోలూ బాధపెడుతున్నాయి కదూ!" వచ్చి కూర్చుని అన్నారు.

"అవును శంకరం! చదువుతున్నకొద్దీ మనసు కలతపడుతోంది. అలా అని చదవకుండా ఉండలేకపోతున్నాను. చదివి బాధపడకుండా ఉండటమూ కష్టమే. మనం ఏమీ చెయ్యలేని స్థితి!" అన్నారు సారథి.

'అవున'న్నట్టుగా తల ఊపారు.

"రాజ్యం! మా శంకరం వచ్చాడు. కాస్త కాఫీ ఇస్తావా? " లోపలున్న భార్యకి వినపడేలా గట్టిగా అన్నారు సారథి.

"అలాగే!" అందావిడ లోపలినుంచే.

రెండు నిమిషాల్లో రెండు కప్పుల కాఫీ ట్రేలో పట్టుకుని వచ్చింది సారథిగారి భార్య రాజ్యలక్ష్మి.

"నమస్కారం అన్నయ్యగారూ!" అంటూ పలకరించి, కాఫీ అందించింది. కాఫీ తాగుతూ అడిగారు "అమ్మాయి పెళ్లిపనులు ఎంతవరకు వచ్చాయమ్మా? వచ్చే వారమేగా పెళ్లి? ".

"అవును. అన్నీ అయిపోయాయిలెండి. పిలుపులు కూడా అయిపోయాయి. కేటరింగుకి



ఇచ్చాం కదా! అంత శ్రమ అనిపించటం లేదు" ఖాళీ కప్పులు లోపలికి తీసుకువెళ్తూ "అన్నయ్యగారూ! ఈ పూట ఇక్కడ భోజనం చెయ్యండి" అంది

"వద్దమ్మా! మా యాదమ్మ నాకు వంట చేసి వెళ్లిపోయింది. మరొకసారి వస్తాను" అన్నారు.

మారు మాట్లాడలేదు రాజ్యలక్ష్మి. కాసేపు కూర్చుని లోపలికి వెళ్లిపోయింది.

"ఇంతకీ నేను ఇక్కడికి ఎందుకు వచ్చాను చెప్పలేదుకదూ. రేపు గుజరాత్ వెళ్దామను కుంటున్నాను" అన్నారు శంకరం.

"ఎందుకు? "

"ఎందుకు అంటే ఏం చెప్పను! అక్కడి వాళ్ల బాధలూ, గాథలూ, ఇబ్బందులూ, ఇక్కట్లూ వెళ్లి చూడాలని, వాళ్లకి సాయపడా లని ఉంది"

"వాళ్లకి కష్టం వచ్చింది. నిజమే కానీ నువ్వూ నేనూ వెళ్లి ఏం చేస్తాం శంకరం? "

"ఏమో సారథీ! 'ఏం చేస్తాం? ' అంటే చెప్పలేను. నా స్నేహితుడు భాస్కరరావు అని నాకంటే రెండు సంవత్సరాల ముందు రిటైరయ్యాడు. ఆ భుజ్ పట్టణంలో, కొడుకు దగ్గర ఉంటున్నాడు భార్యతో. ఒక్కడే కొడుకు. వాళ్ల కుటుంబం ఎలా వుందో తెలియదు. చూడాలని వుంది, వాళ్లని పలకరించా లని ఉంది. జరి గిన సంఘటన మూలంగా నష్ట పోయిన వారికి, కష్టపడు తున్న



వారికీ ఏదో చెయ్యాలని ఉంది. సహాయం చేస్తున్న ఎన్నో చేతుల తోపాటు, నా చెయ్యి కూడా కలపాలని వుంది, 'ఉడుతాభక్తి' అంటారు చూడు! అది..."

"ఈ వయసులో అనవసరంగా రిస్కులో పడతావేమో! నీకెందుకొచ్చిన గొడవ? నీకు చేతనైతే 'ప్రధానమంత్రి విరాళం ఫండ్'కి డబ్బు పంపు".

"సారధీ! ఇప్పుడు నాకు ఏమైందనీ? యాభై ఎనిమిదేళ్లు. ఈ మధ్యనే కదా నువ్వూ, నేనూ రిటైర్ అయ్యాము. నాకు షుగర్‌గానీ, బి.పి.గానీ లేవు. భగవంతుడి దయవలన ఆరోగ్యంగానే వున్నాను. 'అయామ్ యంగ్ ఇన్ స్పిరిట్!" నవ్వారు.

సారథి కూడ నవ్వారు.

"డబ్బు నాకు చేతనైంది ఇస్తాననుకో. అది కాదు. నాకు అక్కడికి వెళ్లాలనిపిస్తోంది. ఆ దారుణంతో బాధపడుతున్న వారికి ఏ చిన్న సహాయమైనా చేయాలనీ, కనీసం మాట సాయమైనా చేయాలనీ ఎందుకు అనిపిస్తోందో నాకు తెలియదు. నా మిత్రుడు భాస్కరరావు ఎలా ఉన్నాడో తెలుసుకోవాలని మనసు తహతహలాడుతోంది."

**ఆ దారుణంతో బాధపడుతున్న వారికి ఏ చిన్న సహాయమైనా చేయాలనీ, కనీసం మాట సాయమైనా చేయాలనీ ఎందుకు అనిపిస్తోందో నాకు తెలియదు.**

"ఉత్తమ ఉపాధ్యాయుడూ, 'గురుబ్రహ్మ'లాంటి బిరుదులూ, అవార్డులూ అందుకున్నావు. ఇప్పుడు 'ఉచిత సేవా సంస్కర్త'లాంటి బిరుదులు కూడా సంపాదించుకుంటావేమో!"

"నోరు ముయ్యవోయ్! బిరుదుల కోసమా నా తాపత్రయం!"

"ఊరికే జోకు చేశానులే. నీ సంగతి నాకు తెలియదా? "

"నిన్ను నాకు తోడుగా రమ్మని అడుగుదామంటే నాకు నోరు రావటం లేదు. నీ కూతురి పెళ్లి, బాధ్యతలూ"

"అవును. లేకపోతే వచ్చే వాడిని".

"పోనీలే ఏం చేస్తాం! అయిదు వేల రూపాయలకు చెక్కు తీసుకున్నాను. ప్రధానమంత్రి ఫండ్‌కి ఇవ్వటానికి. అంతకంటే ఎక్కువ ఇవ్వగలిగే గొప్పవాడిని కాదు. నా భార్య చీరెలు నాలుగు మాత్రం వుంచి, మిగిలినవి తీసికెళుతున్నాను."

"మరి నీ కూతుళ్లు ఊరుకుంటారా? "

"ఊరుకుంటారులే... అయినా ఉంచానుగా నాలుగు చీరెలు. నావి ఓ నాలుగు పాత ప్యాంట్లూ, చొక్కాలూ, పంచెలూ, కొన్ని దుప్పట్లూ, రెండు, మూడు స్వెట్టర్లూ, లాల్చీలూ... ఇవన్నీ ఒక అట్ట పెట్టెలో పెట్టి ప్యాక్ చేశాను. ఇంక నా బట్టలు నా సూటుకేసులో సర్దుకున్నాను"

"చలిగా వుంటుందట!"

"అందుకు తగిన జాగ్రత్తలు తీసుకునే వెళ్తున్నాను."

"మళ్లీ ఎప్పుడొస్తావు? "

"చెప్పలేను. అక్కడి పరిస్థితిని బట్టి".

"అయితే శంకరం, నా కూతురి పెళ్లికి వుండకుండా వెళ్లిపోతు

న్నావా? "

"సారథీ! నేను నీకు శత్రువుని కాదురా! నాకూ ఉండాలని ఉంది. నేను వెళ్లటం అంత అవసరమా అంటే చెప్పలేను. నేను తిరిగివచ్చి నీ కూతురినీ, అల్లుడినీ ఆశీర్వ దించి, మీ ఇంట్లో భోజనం చేస్తాను. వాళ్లకి నా ఆశీస్సులు ఎప్పుడూ వుంటాయి" అన్నారు.

"సరే వెళ్లిరా! ఒక మంచి పని కోసం వెళ్తున్నావు. ఎవరో తెలియని వాళ్ల కోసం, వాళ్లకి ఏదో సహాయం చెయ్యటం కోసం, నీ స్నేహితుడి కుటుంబాన్ని చూడడం కోసం తపించి వెళుతున్న నిన్ను ఒద్దని ఒత్తిడి చేయడం భావ్యం కాదు."

మాట్లాడలేదు శంకరంగారు.

"నీ ఆరోగ్యం జాగ్రత్త! అశ్రద్ధ చెయ్యకు. ఏమైనా ఇబ్బంది అనిపిస్తే వెంటనే తిరిగి వచ్చెయ్యి" జాగ్రత్తలు చెప్పారు సారథి.

"అలాగే! రేపు సాయంత్రం వెళ్తున్నాను. వీలైతే నీకు ఫోన్ చేస్తాను. నా ఫోన్ రావటం వెంటనే జరగదు. అక్కడ కమ్యూ నికేషన్స్ కూడా తెగిపోయాయట. మా అమ్మాయిలకి కూడా నా ప్రయాణం గురించి ఫోన్ చేసి చెప్పాను. వెళ్తాను మరి" లేచారు శంకరంగారు.




'భుజ్' పట్టణం చేరుకున్నారు శంకరం గారు. అక్కడికి కొద్ది దూరంలో బాగున్న ఒక చిన్న హోటల్‌లో గది తీసుకున్నారు. కాలకృత్యాలు తీర్చుకుని, కాస్త కాఫీ, ఫల హారం చేసి, భూకంపం జరిగిన ప్రదేశానికి వెళ్లారు.

అక్కడి దృశ్యాల్ని చూసేసరికి ఆయన మనసు వికలమైపోయింది. ఎంత భయం కరమైన దృశ్యాలు! ఎంతటి ఘోరమైన పరి స్థితి! ఏనాడూ కనీ, వినీ ఎరుగని ఘటన! హృదయ విదారకమైన దృశ్యాలు. భరించ లేని దుర్వాసన!

ఎంతటి శక్తివంతుడైన మానవుడైనా, ఎంతటి గొప్ప మేధావి అయినా ప్రకృతి శక్తి ముందు ఓడిపోతాడంటే ఇదే కాబోలు! అందుకు ప్రకృతి ఇంత భయంకరంగా ఉద హరించాలా!

రకరకాలుగా సహాయక చర్యలు ముమ్మ రంగా సాగుతున్నాయి. విదేశాల నుంచి వచ్చి స్వచ్ఛందంగా సేవ చేస్తున్న గొప్ప మనసున్న విదేశీయులూ, మన దేశస్థులూ, సైనిక సిబ్బంది, పోలీసు సిబ్బందీ, స్వయం సేవా సంస్కర్తలూ, ఎన్.సి.సి. వారూ, స్కౌట్లూ, హోమ్ గార్డ్సు అందరూ సహా యక పనుల్లో నిమగ్నమై ఉన్నారు.

తాత్కాలికంగా వేసిన గుడారాల్లో డాక్టర్లూ, నర్సులూ గాయపడిన వారికి చికి త్సలు చేస్తున్నారు. అంబులెన్స్‌లు అందుబా టులో వున్నాయి. హెలికాప్టర్ల నుంచి ఆహా రపు పొట్లాలూ, మందులూ, తాగటానికి నీరూ, దుస్తులూ ఇలా ఎన్నో జారవిడుస్తు న్నారు.

చుట్టుపక్కల ఊళ్ల నుంచి వచ్చి చూస్తున్న జనం. సహాయం చేస్తున్న జనం.

శరీర బాధలతో, మనసుకి తగిలిన గా యాల బాధలతో, పోగొట్టుకున్న ఆత్మీయుల కోసం అలమటించే వాళ్లూ; ఆస్తుల్నీ, ఇళ్లనీ పోగొట్టుకుని, ప్రాణాల్ని మాత్రం దక్కించు కుని బయటపడిన వారూ, నిన్నటి వరకూ ఇళ్లల్లో ఆనందంగా గడిపి, తెల్లవారి శవా లుగా పడివున్న ఆత్మీయుల్ని, జరిగిన నిజాల్నీ భరించలేక తల్లడిల్లే వాళ్లూ అక్కడి పరిస్థితిని ప్రత్యక్షంగా చూస్తూ జీర్ణించుకోలే కపోతున్నారు.

శిథిలాలుగా మారిన సౌధాలూ, సమాధు లలోకి పోతున్న మానవ కంకాళాలూ!

మతి తప్పిన ప్రకృతి రాక్షసత్వానికీ, విలయ తాండవానికీ ప్రతీకలుగా కనిపిస్తు న్నాయి అక్కడి ప్రతి దృశ్యం, ప్రతి సంఘ టన!

కూలిపోయిన భవనాల కింద పడివున్న శవాల నుండి కుళ్లిన వాసన వస్తోంది.

శిథిల భవనాల కింద కొన ఊపిరితో బతుకు కోసం పోరాడుతున్న ప్రాణుల కోసం అక్కడున్న వారంతా గాలిస్తున్నారు; వెలికి తీస్తున్నారు. అవసరమైన ప్రాథమిక చికిత్సలు చేస్తున్నారు.

అంటువ్యాధులు రాకుండా జాగ్రత్తలు తీసుకుంటున్నారు. ఇతర సహాయక చర్య లూ ముమ్మరంగా సాగుతున్నాయి. శంక రం గారు అక్కడికి చేరుకున్నాక మొదటి, మూడు రోజులు సహాయక చర్యలో పాలు పంచుకున్నారు. ఒకటి, రెండుసార్లు అక్కడే ఉన్న ఒకరిద్దరు ఇన్ స్పెక్టర్లనీ, మరి కొందరినీ మిత్రుడు భాస్క రరావు గురించి వాకబు చేశారు. ఎవరూ ఏమీ చెప్పలేకపోయారు. ఆయన కుటుంబం గురించి బతికి ఉన్నట్టుగానీ, మరణించిన వారిలో ఉన్నట్టుగానీ తెలియలేదు. బాధప డటం తప్ప ఏమీ చెయ్యలేకపోయారు.

నాలుగో రోజు ఒకచోట ఆ కూలిపోయిన భవన శిథిలాల గుట్టలు తొలగిస్తున్నారు. ఎక్కడో సన్నగా నీరసమైన ఏడుపు! పసి పాప గొంతులా ఉంది. ఓపికలేక, శక్తిలేక, ఏడవలేక, నూతిలో నుంచి వచ్చే సన్నటి ఏడుపులాంటి వేదన.

శంకరంగారు రాళ్లు తొలగించారు. మరొ కరి సహాయంతో అక్కడి రాళ్లని పైకి తీశారు. మట్టిలో, దుమ్ములో దాదాపు ఓ పదినెలల పసిపాప. ప్రాణం మాత్రం



ఉన్నట్టు ఊపిరి ఆడుతోంది. బతుకు కోసం ఆ చిన్ని ప్రాణం ఆరాటం!

ఎంత చిత్రం! నోట మాట రాలేదు శంకరంగారికి. పసిపాపని బయటికి తీశారు. వెంటనే అక్కడ గుడారాల్లో ఉన్న డాక్టర్ల దగ్గరకి తీసుకువెళ్లారు. వాళ్ళు అ పసిబిడ్డకు చెయ్యవలసిన ప్రాథమిక చికిత్స వెంటనే మొదలుపెట్టారు.

చావు బతుకుల మధ్య కొట్టుమిట్టాడుతోంది ఆ పసిపాప.

ముక్కునిండా నోటినిండా మట్టి ఇరుక్కుపోయింది. మూడు రోజులుగా పాలూ, నీరూ, గాలీ లేవు. అయినా ఆ పసిపాప ప్రాణంతో ఉంది.

పాప పరిస్థితికి శంకరంగారి హృదయం ద్రవించిపోయింది. 'ఎంతోమంది చనిపోయారు. కానీ ఈ పాప ఇంత భయంకరమైన స్థితిలో ప్రాణంతో ఉంది. పాప బంగారు బొమ్మలా ఉంది. ఏ తల్లిదండ్రులు కన్నబిడ్డో! వాళ్ల బతికి ఉన్నారో లేదో తెలియదు. భగవంతుడి లీలలు ఎంత విచిత్రం!' బాధపడుతున్నారు పాపని చూస్తూ.

శంకరంగారి భుజం మీద చెయ్యి వేసి, "మాష్టారూ" అని పిలిచి ఆయన తల తిప్పగానే అటెన్షన్‌లో నిలబడి శాల్యూట్ చేశాడు అక్కడికి వచ్చిన సిపాయి దుస్తుల్లో ఉన్న ఓ వ్యక్తి.



శంకరంగారు మొదట ఉలిక్కిపడ్డారు. ఆ తరువాత ఆశ్చర్యం వేసింది, అర్థమూ కాలేదు. 'ఎవరీ అబ్బాయి? యీ సిపాయి...? తను అతనికి సీనియరు కాదు, తనేమీ వి.ఐ.పి. కాదు. రాజకీయ నాయకుడూ కాదు. ఈ ప్రదేశమూ తనకి పరిచితమైంది కాదు. మరి తనకెందుకు శాల్యూట్ చేసినట్టు?' ఆలోచనల్లో మునిగిన శంకరంగారిని మళ్లీ అడిగాడు ఆ సిపాయి "నన్ను గుర్తుపట్టలేదా మాష్టారూ!" అని.

ఆయనకి ఎంత సేపటికీ గుర్తు రావడం లేదు. అదే విషయం చెప్పారు.

"నా పేరు కిశోర్. వరంగల్‌లో నేను మీ స్టూడెంట్‌ని" అని ఆ సంవత్సరం, వివరాలూ చెప్పాడాతడు.

"అలాగా!" ఇంకా గుర్తు తెచ్చుకొనే ప్రయత్నంలోనే ఉన్నారు.

"నా నంబరు ముప్పైఆరు. 'మిస్చీఫ్‌మేకర్' అని మీరు నాకు పేరు పెట్టారు. ఒకసారి మీ పెన్ను దొంగతనం చేశాను. భయం వేసి, మళ్లీ మీకు తెలియకుండా మీ జేబులో పెట్టాను"

చిరునవ్వుతో వింటున్నారు. గతంలోని జ్ఞాపకాల్ని వెలికి తీసే ప్రయత్నంలో ఆ సిపాయి ఇంకా చెబుతున్నాడు. "మాష్టారూ! మా ఫ్రెండ్ జేబులో నుంచి దొంగతనంగా వంద రూపాయలు తీస్తే మీరు అది చూశారు. కానీ ఏమీ అనలేదు, నాకు పనిష్‌మెంటూ ఇవ్వలేదు. నేను అప్పటికే దొంగతనాలు చేస్తున్నట్టు మీకు తెలుసు. కానీ ఒక రోజు సాయంత్రం నన్ను హోటల్‌కి తీసుకు వెళ్లి, ఐస్‌క్రీమ్ ఇప్పించి, నాకు మీరు చెప్పిన మాటలు" అంటూ గుర్తు చేశాడు కిశోర్.

* * *

క్లాసులో చాలా అల్లరి చేసేవాడు కిశోర్. మార్కులు సరిగ్గా వచ్చేవి కాదు. సరిగ్గా చదివేవాడు కాదు. చెడు సావాసాల ప్రభావం ఎక్కువగా ఉండేది. స్నేహితుల జేబుల్లో నుంచి డబ్బులు దొంగతనం చేసేవాడు. కిశోర్, మరొక అబ్బాయి రాజూ, రమేష్, ఇంకెవరో! అందరూ గ్రూపు.

ఒక రోజు ఆఖరికి శంకరం మాష్టారి పెన్ను కూడా దొంగతనం చేశాడు కిశోర్. తరువాత మాష్టారికి తెలిసిపోయింది. కానీ ఆయన కిశోర్‌ని అడగలేదు. వీడు, వీడితో ఉన్న వీడి స్నేహబృందం చెడు బుద్ధులు నేర్చుకుంటున్నారు. మిగతావాళ్లు బొత్తిగా మాట వినరు. తన మాట లెక్క చెయ్యరు. కనీసం ఈ కిశోర్‌ని ఎలా అదుపులో పెట్టాలా అని ఆయన ఆలోచనలో పడ్డారు. తననొకసారి కలవమని కిషోర్ తల్లిదండ్రులకు కబురుచేశారు. అయినా వాళ్ళు రాలేదు. వాళ్ల అబ్బాయిని గురించి వాళ్లేమనుకుంటున్నారు? అంత నిర్లక్ష్యం ఏమిటి?

రెండు రోజుల తరువాత శంకరం మాష్టారు క్లాసుకి వచ్చేసరికి ఆయన పెన్ను టేబులు మీదుంది. ఈ పెన్నుని ఇక్కడ ఎవరు పెట్టారని అడిగినా క్లాసులో ఒక్కరూ మాట్లాడలేదు.

"నిజం చెప్పండి. నిజం చెబితే... నేను ఏమీ అనను. అబద్ధం చెప్పటం నాకు అసలు నచ్చదు" అన్నారు గంభీరంగా.

రెండు, మూడు సార్లు అడిగిన తరువాత "కిశోర్ పెట్టాడు" అన్నాడు రాజు కాస్త నిర్లక్ష్యంగా.

"ఏం కిశోర్? నిజమేనా?"

'నిజమే' అన్నట్టు బుర్ర ఊపాడు కిశోర్.

శంకరం ఏమీ మాట్లాడలేదు. మామూలుగా పాఠం చెప్పి క్లాసు ముగించారు. తరువాత ఆయన కిశోర్‌ని ఒంటరిగా మందలించారు.

ఆ రోజు కిశోర్, రాజూ,రమేష్ ముగ్గురూ సుధాకర్, మోహన్ జేబుల్లోంచి పర్సులు దొంగతనం చేశారు. ఆ సంగతి సుధాకర్‌కి, మోహన్‌కి తెలిసిపోయింది. చేసిన దొంగతనం బయటపడుతుందని ముగ్గురికీ భయం వేసింది. రాజూ, రమేష్ రెండు పర్సులూ కిశోర్ చేతిలో పెట్టి పారిపోయారు. కిశోర్

దొంగగా దొరికిపోయాడు. మోహన్, సుధాకర్ కిశోర్‌ని చితకబాదారు. ప్రిన్సిపాల్ దగ్గరకి తీసుకువెళుతుండగా ఆ సంగతి శంకరంగారికి తెలిసింది. ఆయన కిశోర్ దగ్గర ఉన్న పర్సులు ఎవరివి వాళ్లకి ఇప్పించారు. 'కిశోర్‌ని నేను మందలిస్తాను. ఈ ఒక్కసారికీ వదిలెయ్యండి' అని మోహన్‌ని, సుధాకర్‌ని పంపించేశారు.

ఆ తరువాత కిశోర్‌ని తనతో పాటు బయటికి తీసుకువెళ్లి ఐస్‌క్రీమ్ కాబోలు ఇప్పించి మెత్తగా నాలుగు మాటలు చెప్పాడు. తనకి తోచిన సలహాలు ఇచ్చాడు.

లీలగా గతం కళ్ల ముందు మెదిలింది. ఏనాటి సంఘటన! జరిగిన వాటిలో ఇంకా అన్ని గుర్తుకు రావటం లేదు. అసలు ఆ సంఘటనలే మర్చిపోయాడు తను! ఆనాటి కిశోర్ ఈ ఆర్మీ దుస్తుల్లో ఎదురుగా నిలబడి పలకరించాడు. కిశోర్ పలకరింపులో తొంగి చూసిన గౌరవమూ, వినయమూ, ఆప్యాయత శంకరాన్ని ముగ్ధుణ్ణి చేశాయి.

నవ్వుతూ నిలబడ్డారు శంకరంగారు.

"గుర్తుపట్టారా మాష్టారూ? " అడిగాడు కిశోర్. అతని ముఖం బాగా వడిలిపోయి ఉంది.

"గుర్తుపట్టానురా కిశోర్ ! అప్పుడు చిన్నపిల్లవాడివి. ఇప్పుడు గడ్డాలూ, మీసాలూ వచ్చిన పెద్దవాడివి. ఈ మధ్యకాలంలో నిన్ను చూడలేదు. అందుకే గుర్తుపట్టడానికి సమయం పట్టింది. సారీ! ఒరే అన్నాను" సిగ్గుపడ్డాడు.

"సారీ అనకండి మాష్టారూ! మీరు అలాగే పిలవాలి. మీ పిలుపులోని ఆ ప్రేమే, ఆ ఆప్యాయతలే నన్ను ఇవ్వాళ ఇక్కడ నిలబెట్టాయి"

## వాయిదా వొంటికి చేటు



అయిదు కిలోల్లో అద్భుతమైన ఆరోగ్య రహస్యం దాగుందంటే ఎవరికయినా నవ్వు వస్తుంది. కానీ అది నవ్వే విషయం కాదంటారు అమెరికా డాక్టర్లు. లావెక్కితే రోగాలకు రాజమార్గం సిద్ధం చేసినట్టేనని అందరికీ తెలుసు. 'అయ్యో లావెక్కుతున్నానే' అని బాధపడతారు. కానీ లావు తగ్గటాన్ని 'ఇవాళ్ల రేపు' అంటూ పోస్ట్‌పోన్ చేస్తుంటారు. అలా వాయిదాలు వేయక కష్టపడి ఓ అయిదు కిలోలు తగ్గితే చాలు. ఇక వ్యక్తి మానసికంగా ఆరోగ్యవంతుడవటమే కాదు, జీవితాంతం బరువు పెరగకుండా వ్యాయామం చేస్తూనే ఉంటాడని వైద్యనిపుణులు అంటారు. ఎందుకంటే, మనిషి తగ్గిన మొదటి అయిదు కిలోలవల్ల పైన పడబోతున్న అనేక ప్రమాదాలు వెనకడుగు వేస్తాయి. బరువు తగ్గటంతో హైపర్‌టెన్షన్, కొలెస్ట్రాల్ వంటివి వెనక్కువెళ్తాయి. ఓస్టియో ఆర్థ్రటిస్ కూడా బరువు తగ్గటంతో జాయింట్లపై ఒత్తిడి తగ్గి వెనక్కు వెళ్తుంది. వీపు నొప్పి కాస్త ఆగుతుంది. కాబట్టి కళ్లు మూసుకుని, ఊపిరి బిగబట్టి ఓ అయిదు కిలోలు తగ్గండి. అందువల్ల కలిగిన లాభాలు చూసి ఇక మీరే బరువు పెరగరు. ఇప్పుడు చెప్పండి 'అయిదు కిలోల్లో అద్భుతమైన ఆరోగ్య రహస్యం దాగుందా? లేదా?'

అన్నాడు కిశోర్.

శంకరంగారిని చూసిన ఆనందంతో "నమస్కారం శంకరంగారూ!" అప్పుడే అక్కడికి వచ్చి పలకరించాడు- ఆ ఊరి ఛైర్‌పర్సన్ రామ్‌లాల్ ఆయన సంభాషణ హిందీలోనే సాగింది.

నాలుగు రోజుల నుంచీ శంకరాంగారిని ఆయన అక్కడి వారికి చేస్తున్న సహాయాన్ని చూస్తూనే ఉన్నాడు రామ్‌లాల్. ఆయన కిశోర్, శంకరంగారి సంభాషణ అంతా విన్నాడు.

దూరంగా తమ వాళ్లని పోగొట్టుకున్నవారి ఏడుపులూ, గాయాలతో బాధపడుతున్నవారి అరుపులు అంబులెన్స్‌ల మోతలూ, క్రేన్ల శబ్దాలూ, కనిపించకుండా పోయిన శవాల కుళ్లు వాసన అంతా బీభత్సంగానే వుంది యింకా. సహాయక చర్యలు ముమ్మరంగా సాగుతూనే వున్నాయి.

"నమస్కారం రామ్‌లాల్ గారూ!" తిరిగి పలకరించారు శంకరం.

"శంకరం గారూ! నాకంటే పెద్దవారు ఈ కిశోర్‌తోపాటు, నేను కూడా మిమ్మల్ని "మాష్టారూ" అని పిలవాలని వుంది అన్నాడు ఛైర్‌పర్సన్ రామ్‌లాల్.

"తప్పకుండా పిలవండి" అన్నారు శంకరంగారు.

"మాష్టారూ! ఈ కిశోర్ మీ శిష్యుడా? "

"అవునండీ!"

"మీరు నిజంగా ఈ దేశానికి వజ్రాన్ని అందించారు మాష్టారూ!"

"మీరు నన్ను ఎక్కువగా పొగుడుతున్నారు సార్!" అన్నాడు కిశోర్.

"మీరు నన్ను చాలా గొప్పగా ఊహించుకుంటున్నారు. నేను మామూలు స్కూలు మాష్టార్ని"

"లేదు మాష్టారూ! మీ గురుశిష్యులు ఇద్దరూ ఇక్కడ కలవటం యాదృచ్ఛికమే అయినా ఈ భూకంపం జరిగిన వెంటనే వచ్చిన ఈ కిశోర్ మిమ్మల్ని పరోక్షంగా నాకు ఎప్పుడో పరిచయం చేశాడు. మీ గురించి అతను తలచుకోని రోజు లేదు. ఎప్పుడూ ఒక్కటే చెబుతాడు. మా శంకరం మాష్టారు నన్ను ఆ రోజు ఆ రకంగా మందలించకపోయివుంటే, ఆయన అంత బాగా నాకు చెప్పకపోయి ఉంటే నేను ఏ దొంగగానో, ఏ స్మగ్లర్‌గానో, ఏ డ్రగ్ ఎడిక్ట్‌గానో, హంతకుడిగానో అయివుండేవాడిని. ఆ రోజు మా శంకరం మాష్టారు నన్ను కొట్టలేదు, తిట్టలేదు. నేను చేసిన పనులకి నన్ను అసహ్యించుకోలేదు. హృదయానికి హత్తుకునే విధంగా ఎంతో బాగా చెప్పారు. దాని ఫలితమే నేను ఈ రోజు ఇలా మీ ముందు నిలబడివున్నాను. ఆయన పెట్టిన భిక్షే ఈ జీవితం అంటాడు. ఇంక అనుకోకుండా ఇక్కడ మిమ్మల్ని చూసి కిశోర్ ఎంతగా ఆనందపడుతున్నాడో!" అన్నాడు రామ్‌లాల్.

"నేను చేసింది ఏమీ లేదండీ! నాకు తోచిన నాలుగు మాటలు చెప్పాను. కిశోర్ మంచివాడు, తెలివైనవాడు. నా మాటలు తను విన్నాడు. పైన భగవంతుడు సాయం చేశాడు" మామూలు ధోరణిలో అన్నారు.

"మాష్టారూ! ఈ కిశోర్ సామాన్యుడు కాదు సార్! చాలా కష్టజీవి! వచ్చిన దగ్గర నుంచీ విపరీతంగా కష్టపడుతున్నాడు. తన వాళ్లంటూ ఎవరూ లేరట. ఒంటరివాడు. పెళ్లి చేసుకోలేదు. దేశం కోసం శ్రమిస్తున్నాడు. ఇప్పుడు ఈ ఆపద సమయంలో ఇక్కడికి వచ్చాడు. కర్తవ్య నిర్వహణలో ముందు ఉంటాడు. అనుకోకుండా మీరు ఇక్కడికి వచ్చి అతనికి కనిపించారు. అతనికి చాలా ఆనందంగా వుంది. ఇటువంటి ఉత్తముడిని కన్న ఈ కిశోర్ తల్లిదండ్రులూ, కిశోర్‌ని చెడుతోవనుంచి తప్పించి, ఒక మంచి బాధ్యతగల పౌరుడిగా తీర్చిదిద్దిన గురువైన మీరూ, ఇటువంటి పౌరుడిని పొందిన ఈ దేశం చాలా గొప్పవి మాష్టారూ!"

రామ్‌లాల్ మాటలకి శంకరం కళ్లు చెమర్చాయి.

"కిశోర్! నీకు మీ వాళ్లు ఎవ్వరూ లేకపోవటమేమిటి? మీ నాన్నగారూ, అమ్మగారూ, చెల్లెలు వున్నారుగా? "

"మా అమ్మా, నాన్నా, చెల్లెలూ ముగ్గురూ యాక్సిడెంట్‌లో పోయారు మాష్టారూ!"

"అయ్యో! ఎంత ఘోరం! ఎప్పుడు జరిగింది? "

"చాలా సంవత్సరాలైంది మాష్టారూ! నేను ఆర్మీలో చేరిన కొత్తలో వాళ్లు ముగ్గురూ టాక్సీలో శ్రీశైలం వెళ్తూ యాక్సిడెంటులో పోయారు"

"ఎంత ఘోరం జరిగిపోయింది కిశోర్! ఇంత చిన్న వయసులో తల్లి తండ్రుల్నీ, తోడపుట్టిన చెల్లెల్నీ పోగొట్టుకున్నావు. నీకు చాలా అన్యాయం జరిగిందయ్యా! పెళ్లెందుకు చేసుకోలేదు!"

"ఏమో సార్! చేసుకోవాలనిపించలేదు" ఉదాసీనంగా అన్నాడు.

కిశోర్‌కి జరిగిన అన్యాయం గురించి విన్న శంకరంగారి మనసు బాధపడ్డది. తన వాళ్లనందరినీ పోగొట్టుకున్న కిశోర్ కర్తవ్య దీక్షకి ఆశ్చర్యపోయారు. కొన్ని క్షణాలు ఆయనకి నోటమాట రాలేదు.

"కిశోర్! నీకు భగవంతుడు చాలా అన్యాయం చేశాడయ్యా!"

"అవును మాష్టారూ! ఎప్పుడో జరిగిపోయింది. ఒంటరివాడినై పోయాను."

కానీ ఇప్పుడు ఇక్కడ నాలాగా ఎందరో...! తమ వాళ్లనీ, నిలువ నీడనీ, ఆస్తుల్నీ పోగొట్టుకుని, ఎందరు బాధపడుతున్నారో! నేను రేపు బ్రతకగలను కానీ పాపం వాళ్ల భవిష్యత్తు? రేపు ఎలా బ్రతకాలి? అన్న బాధ బ్రతికి వున్న వాళ్లని వేధిస్తోంది. అది



ఎంత బాధ మాష్టారూ!

చూడండి! ఈ పసిపాప! దీనికి ఎవరున్నారు? తన వాళ్లు ఎవరో తెలియదు. ఎక్కడ ఉన్నారో, ఏమైపోయారో, అసలు ఏం జరిగిందో కూడా తెలియదు ఈ పసిగుడ్డుకి.

నాలుగు రోజులపాటు శిథిలాలలో చిక్కుకుని కూడా పాప చిన్నగా కదులుతోంది. మెల్లగా ఊపిరి పీల్చుకుంటోంది.

శంకరంగారు, కిశోర్, ఛైర్‌పర్సన్ రామ్‌లాల్ వున్నారు అక్కడ.

"పాపకి ఏం పరవాలేదు" అన్నారు డాక్టర్లు.



మరో వారం గడిచింది. భూకంపం బాధితులకి సహాయ సహకారాలు అందుతూనే ఉన్నాయి. శంకరంగారు తనకి చేతనైన సహాయం నలుగురితో పాటు చేస్తూనే ఉన్నారు.

దేశం నలుమూలలనుంచీ, ఇరుగు పొరుగు దేశాలనుంచీ, ఇతర విదేశాలనుంచీ, వస్తున్న సహాయం, డబ్బూ, వస్తువులూ, ఆహార పదార్థాలూ, మందులూ అపారం. ఎంతోమంది స్వచ్ఛందంగా వచ్చి సహాయం చేస్తున్నారు.

అక్కడే టెంట్లు వేసి, తాత్కాలిక పునరావాసం కల్పించి, సేవలు అందిస్తున్నారు బాధితులకి.

పాప బాగా తేరుకుంది. అక్కడి నర్సులే పాపకి పాలూ, నీళ్లూ పడుతున్నారు. ఆలనా, పాలనా చూస్తున్నారు. పాప నిజంగానే బంగారు పాప! చక్కటి కళ్లూ, ముక్కూ, చిన్ని నోరూ, నల్లని జుట్టూ ఆకర్షణీయంగా ఉంది. పలకరిస్తే నవ్వుతోంది. అందరి ముఖాలూ చూస్తోంది. అప్పుడప్పుడూ ఏడుస్తోంది. తన వాళ్లని గురించి అడగటమే తెలియని, మాటలు రాని వయసు. బాధపడటం చేతకాని మనసు.

శంకరంగారు పదిరోజులుపైనే అక్కడ ఉండి చేతనైన సహాయం చేశారు. అక్కడ బ్రతికి, బట్టకట్టిన వారికి భోజనం, బట్టలూ, నీరూ, మందులూ, డాక్టర్ల వైద్యమూ అన్నీ అందుతూనే వున్నాయి. అందనివారు బాధపడుతున్నారు. ప్రభుత్వం వారూ, ప్రయివేటు సంస్థల వారూ విరామం లేకుండా సహాయ కార్యక్రమాలు అందిస్తూనే ఉన్నారు.

నాలుగురోజులు ఆలోచించారు శంకరంగారు. కిశోర్‌తో, అక్కడి డాక్టరుతో, ఛైర్‌పర్సన్ రామ్‌లాల్‌తో మాట్లాడారు. ఆయన తన ఆలోచన ఆచరణలోకి రావాలనే గట్టి నిర్ణయంతోనే వున్నారు.

ఆయన అక్కడ వున్నన్ని రోజుల్లోనే ఆ పాప తాలూకు ఎవరూ బ్రతికిలేరనే విషయం తెలిసిపోయింది.

"అయ్యా! రామ్‌లాల్ గారూ! ఈ పాపని నేను తీసుకెళ్లి పెంచుకుంటాను" అన్నారు.

అక్కడ వున్న అందరికీ ఆశ్చర్యం వేసింది శంకరం మాటలకి.

"అదేమిటి శంకరంగారూ! ఇలాంటి నిర్ణయం తీసుకున్నారేమిటి...? మీకు భార్య లేదన్నారు. మీ అమ్మాయిలకి పెళ్లిళ్లయి, అత్తవారిళ్లకి వెళ్లిపోయారన్నారు. అరవై ఏళ్లు రాబోతున్న యీ వయసులో, ఒంటరిగా వుంటున్న మీరు ఈ పసిపాపని పెంచటమంటే తేలికైన పనేనా? చాలా శ్రమపడాలి. చాలా కష్టాలూ, నష్టాలూ, ఇబ్బందులూ పడాలి. చాలా ఓర్పూ, నేర్పూ కావాలి" రామ్‌లాల్ అన్నాడు.

"అన్నీ ఆలోచించుకునే నేను ఈ నిర్ణయం తీసుకున్నానండీ! ఈ చిన్నారిని పెంచటం- ఈ వయసులో నాకు కష్టమే కావచ్చు, శ్రమా కావచ్చు, ఖర్చూ కావచ్చు. అసాధ్యం మాత్రం కాదు. నేను ఆరోగ్యంగానే వున్నాను. ఎందుకో ఈ పాపని అనాథలా వదలాలని లేదు నాకు. ఏదో మమకారం ఈ పసిదాని మీద.

ఇక్కడ ఈ భూమి ఇంత తల్లక్రిందు లైనా, ఇంతగా ఈ ధరణి కంపించినా ఇక్కడి మనుష్యులూ, తన వాళ్లూ శవాలుగా మారి, తన యిల్లు కూలిపోయి, శిథిలాలుగా మారగా, ఆ శిథిలాలలో తను చిక్కుకుపోయి, నాలుగురోజులు మృత్యువుతో పోరాడి గెలిచింది ఈ పిల్ల! భగవంతుడి ఆజ్ఞ లేనిదే, ప్రాణి జీవితం ముగించదు అంటే అందుకు ఉదాహరణ ఈ పాపే అనిపిస్తుంది నాకు.

పలకరిస్తే, అమాయకంగా, పువ్వులా నవ్వే ఈ పదినెలల పసిపిల్లకు తన పేరు తెలియదు, తన ఉనికి తెలియదు, తన తల్లితండ్రులు ఏమైనారో తెలియదు, ఏమి జరిగిందో తెలియదు, ఆకలేస్తే ఏడవటం తప్ప,

మరేమీ తెలియదు-

ఉడతా భక్తి! ఇంకా ఎక్కువకాలం వుండి శ్రమ పడలేను. నా స్నేహితుడి కుటుంబం గురించి తెలియలేదు. అది నన్ను నిరాశ పరిచింది, బాధపెట్టింది. ఇక్కడి బాధితులకి అన్ని రకాలుగా సహాయాలూ, సహకారాలూ అందుతున్నాయి. ఈ పాపని మాత్రం నేను తీసుకువెళ్లి పెంచుకుంటాను." మనస్ఫూర్తిగా అన్నారు.

ఛైర్‌పర్సన్ రామ్‌లాల్ శంకరంగారి మాటలకి చాలా ఆనందపడి మరుక్షణంలో కాస్త సిగ్గుపడిపోయాడు కూడా.



**సి.ఆర్ రెడ్డిగా సుప్రసిద్ధులైన డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి గొప్ప విద్యావేత్త. సంస్కృతాంధ్ర ఆంగ్లాలలో దిట్ట. 'ముసలమ్మ మరణం', 'కవిత్వతత్వ విచారం' వంటివి రాశారు. అనేక పదవులు అధిష్ఠించారు. ఆంధ్రాయూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్‌గా పనిచేశారు. ఆయన వివిధ సందర్భాలలో చేసిన వ్యాఖ్యలు..**

## జంట కవిత్వం అలవాటు కదా?

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి సన్మానం జరుగుతోంది. సభకు అధ్యక్షత వహించిన కట్టమంచి గంభీరంగా ఉపన్యసిస్తున్నారు. వయోవృద్ధులైన చెళ్లపిళ్ల వయోగతమైన చాదస్తంతో తన ఆసనంలో కూర్చునే వెనుక నుంచి కట్టమంచి మాటలపై వెక్కిరింతగా వ్యాఖ్యానిస్తున్నారు.. అంత పెద్దాయనను ఎవరు కట్టడి చేయగలరు? కట్టమంచివారికీ ఆ 'నస' దుర్భరంగా తయారైంది. వెంటనే చమత్కారంగా-

'గురువుగారికి మొదటినుంచీ జంటకవిత్వం అలవాటన్నది అందరికీ తెలిసిందే.. ఆ అలవాటే ఇప్పుడూ మాట్లాడిస్తోంది.. మీరెవ్వరూ అపార్థం చేసుకోవద్దు. కార్యక్రమానికి ఆటంకంగా భావించవద్దు' అన్నారు.

చమత్కార బాణం సూటిగా ఎక్కడ తగలాలో అక్కడే తగిలింది. చెళ్ల పిళ్లవారు ఆపైన అనవసర ప్రసంగం చేయలేదు.



స్థానికంగా ఉంటూ అన్నీ చూస్తూ కూడా తనకి ఈ ఆలోచన రానందుకు ఆయనకి సిగ్గుగానే అనిపించింది.

"దటీజ్ మా మాష్టారు!" ఆనందంగా అన్నాడు కిశోర్.

అక్కడ ఉన్న డాక్టర్లూ, నర్సులూ ఆశ్చర్య పోయారు శంకరంగారి నిర్ణయం విని. ఆనందపడ్డారు కూడా.

"శంకరంగారూ! మీ మానవతా హృద యానికి జోహార్లు. మాష్టారూ! నాకు రాని ఆలోచన వచ్చింది. ఈ కిశోర్ మీ గురించి చెప్పిన మాటలకీ, ఇప్పుడు ఇక్కడికివచ్చి, ఇక్కడ స్వచ్ఛందంగా సేవలు చేసి, చివరికి ఈ పాప విషయంలో మీరు తీసుకున్న నిర్ణ యానికి మీరింకా ఉన్నతంగా కనిపిస్తు న్నారు. మీరీ పాపని తప్పకుండా తీసుకువె ళ్లండి. ఈ కిశోర్ లాంటి మరో వజ్రాన్ని ఈ సమాజానికి అందించండి" ఆనందంగా అన్నాడు రామ్‌లాల్.

శంకరంగారు తన అడ్రసూ, ఫోన్ నంబరూ, వివరాలూ అన్నీ వాళ్లకి ఇచ్చారు. "ఒకవేళ అదృష్టం కొద్దీ పాప తల్లిదండ్రులు దొరికితే నా దగ్గరకి పంపండి. లేదా నాకు తెలియ చేస్తే పాపని తీసుకుని నేను వస్తాను" అన్నారు.

శంకరంగారు పాపని తీసుకుని బయలు దేరారు. కిశోర్ స్టేషన్‌కి వచ్చాడు.

పాపతో రైల్లో కూర్చున్నారు శంకరం గారు. "కిశోర్! నువ్వు ఇంత గొప్పవాడివైనం దుకు నాకు చాలా ఆనందంగా ఉందయ్యా!' ' అన్నారు.

"అందుకు మీరే కారణం మాష్టారూ! ఆనాడు వాల్మీకికి జ్ఞానోదయం అయినట్టు నాలోనూ మార్పొచ్చింది. వాల్మీకి అంతటి గొప్పవాడిని కాదుగానీ ఆ రోజు మీరు నాకు చెప్పిన మాటలు నా ఆలోచనల మీద గొప్ప ప్రభావం చూపించాయి. నా కళ్లు తెరిపిం చాయి. దాని ఫలితమే మీ ముందు నేను ఇలా నిలబడి వున్నాను. గురుదేవో భవా!. అని అంటారు. మీరు గురువులు కానీ మీకు గురుదక్షిణ ఇచ్చుకోలేనివాడిని" కిశోర్ కళ్లు చెమర్చాయి.

"ఛ ఛ బాధపడకు, నువ్వు నాకు గురుద క్షిణ ఇచ్చేశావు!"

"ఎప్పుడు మాష్టారూ? ఎలా? "

"నువ్వు నా శిష్యుడిగా ఇంత సంస్కార





వంతుడిగా, ఇంత గొప్పగా ఎదిగిన మరుక్ష ణమే నా గురుదక్షిణ చెల్లిపోయింది. ఏ గురువుకైనా బిరుదులూ, అవార్డులూ, సన్మానాలూ కాదయ్యా! తన శిష్యుడు ఒక గొప్ప వ్యక్తిగా, సంస్కారవంతుడిగా ఎదిగిన రోజున ఆ గురువుకి అంతకంటే గొప్ప బహుమతులూ, అవార్డులూ, బిరుదులూ అవసరం లేదు. ఆ ఆనందం మాటల్లో చెప్పలేనిది.

"అదా! భలేవారే మాష్టారూ!"

"చూడు కిశోర్! నువ్వు మన దేశాన్ని రక్షించే గొప్ప బాధ్యత గల సైనిక ఉద్యోగంలో వున్నావు. కానీ వ్యక్తిగతంగా నీకు చాలా అన్యాయం జరిగింది. నీ వాళ్లందరినీ పోగొట్టుకుని, ఒంటరి వాడివి అయ్యావు. నాకు చాలా బాధగా వుంది. పెళ్లి కూడా చేసుకోలేదు. నీకు నేను ఏ సహాయమూ చెయ్యలేకపోయాను. భగవంతుడు ఏవి, ఎప్పుడు, ఎందుకు చేస్తాడో మనకి తెలియదు. చూడు! నీకు ఒంటరి తనం విసుగు అనిపించినప్పుడు, ఏ కష్టం వచ్చినా నా దగ్గరికి వచ్చెయ్యి. నీకు నేనున్నాను. ఆ సంగతి మర్చిపోవద్దు" ఆయన హృదయం బాధతో నిండిపోయింది. శంకరంగారి మాటలకి, కిషోర్ మనసు పొంగిపోయింది.

"అలాగే మాష్టారూ! తప్పకుండా! థ్యాంక్స్ మాష్టారూ!" అన్నాడు. "నాతో పాటు పని చేసి, రిటైరయిన నా స్నేహితుడు, భార్యా, ఆయన కొడుకూ, కోడలు దగ్గర వుంటున్నారు. ముఖ్యంగా వాళ్లని చూడాలని వచ్చాను. ఇన్ని రోజులు ఉన్నా వాళ్లు కనిపించలేదు. ఆయన కుటుంబం ఈ శిధిలాలలో సమాధి అయిందని తెలిసింది. వాళ్లు కనపడలేదు. ఈ పసిపాప దొరికింది. విచిత్రమే! ఆయన్ని చూడలేకపోయాను గానీ వజ్రంలాంటి నా శిష్యుడిని చూడగలిగానని ఆనందంగా వుంది" అన్నారు. సిగ్నల్ ఇవ్వడంతో గార్డు పచ్చ జెండా ఊపడంతో రైలు ముందుకు కదిలింది.




ఆర్మీవారూ, పోలీసు డిపార్టుమెంటు వారూ, హోమ్‌గార్డ్స్ కొందరు అక్కడ టెంట్లు వేసుకుని ఉంటున్నారు.

అలాగే కిశోర్ కూడా ఒక టెంటులో మిత్రుడితో కలిసి ఉంటున్నాడు.

ఇప్పుడు తనకి అదే నివాసం. అదే పెద్ద భవనం. రాత్రి పది గంటలు దాటింది. అతడి మిత్రుడు అప్పుడే నిద్రలోకి ఒరిగిపోయాడు.

శంకరంగారిని రైలెక్కించి వచ్చిన తరువాత కిశోర్‌కి ఏదో పోగొట్టుకున్నట్టు అనిపించింది.

అక్కడికి వచ్చిన తరువాత ఉదయం లేవగానే కాస్త కాఫీయో, టీయో తాగి, వీలైతే టిఫిన్‌తో కడుపు నింపుకుని తొందరగా పనిలోకి జొరబడితే కాలం తెలియదు. ఒక్కొక్కసారి ఆకలీ తెలియదు. తెలిసినా కడుపు నింపుకునేందుకు కొన్నిసార్లు సమయమూ దొరకదు.

అలసిపోయి, రాత్రికి గుడారానికి చేరుకుని, నిద్రలోకి జారి పోవటానికి ప్రయత్నిస్తే పనిలో ఎదురైన దృశ్యాలు మనసులో సుడులు తిరుగుతుంటాయి.

క్రేన్లు తెచ్చి, కూలిపోయిన ఇళ్ల శిధిలాలని తీసి శుభ్రపరుస్తున్నారు. వాటి కింద ఇంకా ఉండిపోయిన శవాలు కొన్ని కుళ్లిపోయి, గుర్తు పట్టలేనంతగా మారిపోయి, దుర్వాసనలు వస్తున్నాయి. వాటిని బయటికి తీసి, ఒక చోట చేర్చటం ఒక బాధాకరమైన, కష్టమైన కార్యక్రమం. వాటిని గుర్తు పట్టేవారి

కోసం ఆ వాసన భరిస్తూ ఒకటి, రెండు రోజులు ఎదురు చూసి, ఆ తరువాత ఆ నిర్జీవులకు సామూహిక దహన సంస్కారం జరిపిస్తున్నారు..

ఈ పనులన్నీ అక్కడ వున్న అందరూ తమవంతుగా చేస్తూనే ఉన్నారు. ఇన్ని చేసిన తరువాత రాత్రికి ఎప్పటికో తిండి తినాలి, నిద్రపోవాలి. ఒక్కొక్కసారి ఆ తిండి సహించదు. కంటికి నిద్ర పట్టదు. ఎంత శిక్షణ పొందిన సైనికుడైనా, ఇన్‌స్పెక్టరైనా, హోమ్ గార్డ్ అయినా, స్వచ్ఛందంగా అక్కడికి వచ్చి పనులు చేసేవారైనా మొట్టమొదట వాళ్లు మానవ మాత్రులు. వాళ్ల మనసూ, బుద్ధీ పరిస్థితులకి అతీతంగా ఆలోచించినా ఆచరణలో మానవ సహజంగా కలిగే స్పందనలు కలుగుతూనే ఉంటాయి.

తాము చేస్తున్న ఈ పనులకి భయమూ, బాధా, విరక్తీ, చేస్తున్నందుకు శరీరానికి అలసట కలుగుతున్నా విధి నిర్వహణలో వీటన్నింటికీ అతీతంగానే పనులు చేస్తున్నారు అక్కడివాళ్లు.

పరిశుభ్రంగా సర్దిన ఇంట్లో పసిపిల్లవాడు అన్నింటినీ పీకి, లాగి, విరగ్గొట్టటమో, పగల గొట్టటమో, కాగితాలు చింపి, చెత్తా చెదారంతో ఇల్లంతా చిందరవందర చేస్తే తల్లీ, ఇంట్లో వాళ్లూ అల్లరి చేసినందుకు పిల్లవాడిని మందలిస్తారు. తప్పని సరిగా ఇల్లంతా సర్దుకుని, శుభ్రం చేసుకుంటారు.

అది పసివాడి అల్లరి.

తానే సృష్టించి, ఒక క్రమ పద్ధతిలో సృష్టిని నడిపిస్తున్న భగవంతుడు అప్పుడప్పుడూ అలవి కాని భీభత్సం సృష్టించి మళ్లీ తాను సృష్టించిన మానవుల చేతనే సరి చేయిస్తాడు. ఇది భగవంతుడి శక్తి!

కంటికి కనిపించిన పసివాడిని మందలించగలం. కంటికి కనిపించని భగవంతుడిని ఏమీ అనలేం. ఏమీ చేయలేం. భగవంతుడు చేసిన పనుల్ని సరిచేసుకునేందుకు శక్తి నివ్వమని ఆయన్నే ప్రార్థించటం తప్ప! పిల్లలూ, దేముడూ ఒక్కటే అని సమాధానంతో తృప్తి పడతాడు పాపం వెర్రి మానవుడు.

> "కంటికి కనిపించని భగవంతుడిని ఏమీ అనలేం. ఏమీ చేయలేం. భగవంతుడు చేసిన పనుల్ని సరిచేసుకునేందుకు శక్తి నివ్వమని ఆయన్నే ప్రార్థించటం తప్ప!"

చేస్తున్న పనులకి ఒక్కొక్కసారి జీవితం మీద విపరీతమైన వైరాగ్యం, విరక్తి కలుగుతున్నాయి కిశోర్‌కి. భోజనం చేశాడు యాంత్రికంగానే. అంతే యాంత్రికంగా నిద్రపోదామంటే ఆ నిద్ర దూరమైంది. అదే టెంట్‌లో వుంటున్న కిశోర్ మిత్రుడు రహీమ్ నిద్రలోకి జారిపోయాడు. మంచి మిత్రుడు, కష్టపడి పనిచేస్తాడు. భగవంతుడి మీద భక్తి, తన స్వశక్తి మీద నమ్మకం ఇవన్నీ కలిసి రహీమ్ అవుతాడు. "ఏం కిశోర్! మనం ఎంత చేసినా ఫలితం మన చేతుల్లో ఏముంది? అంతా అల్లాదయ, అల్లా మహిమ! ఆయన ఆజ్ఞ లేనిదే ఏదీ జరగదు." వేదాంతం చెబుతాడు.

కిశోర్‌కి నిద్ర పట్టలేదు. టెంటు బయటికి వచ్చి కూర్చున్నాడు. ఆకాశం నిర్మలంగా వుంది. దశమినాటి చంద్రుడు మెల్లమెల్లగా

ప్రయాణం చేస్తున్నాడు.

చిందర వందరగా ముసురుతున్న ఆలోచనల్ని పక్కకి నెట్టాడు కిశోర్. శంకరం మాష్టారు కళ్లముందు మెదిలారు. అందమైన విగ్రహం! అంతకంటే అందమైన ఆయన మనసు! ఎప్పుడూ 'పాజిటివ్ థింకింగ్'తో ఆలోచించి, ఆచరించే ఆయన వ్యక్తిత్వం. కిశోర్‌కి శంకరంగారిని తలుచుకుంటే మనసు పొంగిపోతుంది అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ కూడా.

ఆయన దగ్గర ఎవరూ లేకపోయినా భార్యలేని ఒంటరివాడైనా మధ్య తరగతి వ్యక్తే అయినా, వయసు మళ్లినా కష్టించి, అనాథలా మిగిలిన ఒక పసిపాపని పెంచే బాధ్యత ఎంత ధైర్యంగా స్వీకరించారు! మాష్టారు ఎప్పుడూ గ్రేట్! గొప్పగా అనుకున్నాడు కిశోర్. ఆయనే లేకపోతే తన జీవితం ఎలాంటి స్థితిలో ఉండేదో!

కిశోర్ ఆలోచనలు కదిలిపోతున్నాయి. వర్తమానం తాత్కాలికంగా వెనక్కి వెళ్లింది. గతం ముందుకు వచ్చి నిలబడింది. ఆ నిలబడిన గతంలో ఎన్ని జ్ఞాపకాలు! ఎన్నెన్ని సంఘటనలు! ఎన్నెన్ని అనుభవాలూ!




కాంతారావు, పంకజం దంపతులకి ఇద్దరు పిల్లలు. కిశోర్, జ్యోతి. కాంతారావు బ్యాంకులో గుమస్తా ఉద్యోగం. మామూలు మధ్య తరగతి కుటుంబం.

కాంతారావు నిదానస్తుడు, కష్టపడి పనిచేస్తాడు. ఇంట్లో భార్యా, పిల్లల్ని ఇబ్బంది లేకుండా చూసుకుంటాడు.

ఆయన భార్య పంకజం ఆయనకి పూర్తిగా వ్యతిరేకం. సొంత ఇల్లు లేదనీ, పట్టు చీరెలూ, బంగారు నగలూ లేవనీ, గొప్పగా అందరు ధనవంతుల్లా కార్లలో తిరిగేంత హోదా లేదనీ కాంతారావుని సాధిస్తూ వుంటుంది. పంకజానికి కొడుకు కిశోర్ అంటే ఇష్టం. కూతురు జ్యోతిపట్ల 'ఆడపిల్ల' అనే చులకన భావన.

జ్యోతి ఏది అడిగినా విసుక్కుంటుంది, "నీకెందుకే దండగ!" అంటుంది.

"అమ్మా! మరి అన్నయ్యకి ఎందుకు కొన్నావు? " అని అడిగితే

"వాడు మగపిల్లవాడు. నువ్వు ఆడపిల్లవి. అయినా వాడికీ, నీకూ పోలికేమిటి? " అని తీసిపారేస్తుంది.

కిశోర్‌కి ఈ పద్ధతి నచ్చింది. చిన్న వయసు. తల్లి అలా మాట్లాడుతూ తనంటే ఎక్కువ విలువ ఇవ్వటం వాడికి గొప్పగానే వుంది. 'నాకేమిటి! నేను ఏమైనా చెయ్యొచ్చు' అనే భావన వస్తున్నది. తను 'మగ పిల్లవాడు' అన్న ధీమా. తన ఇష్టాన్నీ, పట్టుదలనీ సాగించుకుంటున్నాడు.

"పిల్లలు ఇద్దరిలో అలాంటి తేడాలు చూపించకూడదు పంకజం. వాళ్ల మనసులు సరిగ్గా ఎదగవు, పాడైపోతాయి" అని కాంతారావు అనేవాడు.

"ఏమీ ఫరవాలేదు. ఆడ పిల్లకీ, మగ పిల్లవాడికీ తేడా లేకుండా ఎలా వుంటుంది? మీరు నాకు ఇలాంటి బోధలు చెయ్యక్కర లేదు. నాకు తెలుసు ఎవరిని ఎలా పెంచాలో!" విరుచుకుపడేది పంకజం.

త్వరగా వంట చేసి కాంతారావుకీ, పిల్లలకీ వడ్డించి, తరువాత వాళ్ల టిఫిన్ బాక్సుల్లో డబ్బాల్లో ఇంత అన్నం కూర సర్దేసి కాంతారావుని బ్యాంకుకి, పిల్లల్ని స్కూలుకి పంపేది.

ఆ తరువాత పంకజానికి అంతా ఖాళీయే. ఉదయం ఆట సినిమాలకి

వెళ్లటం, లేకపోతే ఇరుగుపొరుగు వారితో కబుర్లు చెప్పటం అలవాటు. అంతకంటే ఆవిడకి వేరే వ్యాపకం ఏదీ ఉండదు. ఏదీ కాకపోతే టి.వి.లో వచ్చే తెలుగు సీరియల్స్‌కి న్యాయం చేస్తుంది.

స్కూల్లో షార్ట్ ఇంటర్‌వెల్‌లో పిల్లలందరూ వాళ్లు తెచ్చుకున్న బిస్కెట్లో, జంతికలో, అరటిపండో, వేరుశనగ పప్పులో ఏదో ఒకటి తింటుంటారు. వాళ్లని చూసిన కిశోర్‌కి తనకీ ఏదైనా తినాలనిపించింది.

'అమ్మ తనకి ఈ 'షార్టు ఇంట్రవెల్'లో తినటానికి ఏమీ ఇవ్వదు, ఒక్క మధ్యాహ్నం 'లంచ్ బాక్స్' తప్ప. అడిగితే 'ఏమీ అక్కరలేదులే' అంటుంది. మధ్యలో తినేందుకు అలా తెచ్చుకోనివాళ్లు డబ్బులు పెట్టి అప్పుడప్పుడూ కొనుక్కుంటారు.

"అమ్మా! నాకూ షార్టు ఇంటర్వెల్‌లో తినేందుకు ఏదైనా పెట్టు రోజూ!" అని ఇంటికి వచ్చాక తల్లిని అడిగాడు కిశోర్.



"లంచ్ బాక్స్ ఇస్తున్నానుగా!" అంది పంకజం.

"అది మధ్యాహ్నం తినటానికి. అందరూ అలాగే చేస్తారు. ఏదో ఒకటి స్నాక్స్ తెచ్చుకుంటారు. తెచ్చుకోని వాళ్లు కూడా అప్పుడప్పుడూ కొనుక్కుంటారు. నాకూ స్నాక్స్ పెట్టు, లేకపోతే డబ్బులియ్యి..." అన్నాడు గారాబంగా.

కాంతారావు కొడుకు మాటలు విన్నాడు. చిన్నపిల్లవాడు. సాధారణంగా చిరుతిండి ఏదో ఒకటి తినాలనిపిస్తుంది. ఇదేమంత గొంతెమ్మ కోరిక కాదు అనుకున్నాడు.

"పంకజం! రేపటి నుంచే పిల్లలకి స్నాక్స్ ఏదో ఒకటి బాక్స్‌లో పెట్టి యివ్వు. నీకు వీలైతే ఇంట్లో చేస్తే బాగుంటుంది. ఎక్కువ ఖర్చు కూడా కాదు." అన్నాడు.

"అమ్మా! నాకు కూడా ఇవ్వాలి" అంది కూతురు జ్యోతి.

"నీకెందుకే? దండగ" అంది పంకజం.

"అదేమిటి! జ్యోతి కూడా స్కూలుకి వెళ్తోంది కదా! వాడికంటే రెండు క్లాసులు తక్కువ. దానికి ఇవ్వటానికి దండగ అంటావేమిటి?" అన్నాడు కాంతారావు.

"నాకు ఇంకేం పని లేదా? అస్తమానం వీళ్ల తిండి కోసం ఆ వంట ఇంట్లో పడి చెయ్యటానికి! నేనేమీ చెయ్యను" విసుక్కుంది.

ఇంక పంకజం అటువంటివేవీ చెయ్యదు అనిపించింది కాంతారావుకి. బజారుకి వెళ్లి, తినటానికి జంతికలూ, బిస్కట్లూ తీసుకువచ్చాడు.

పంకజం వాటిని చూసి "ఎంతెంత డబ్బు దండగ! అనవసరంగా ఖర్చు" అంది.

"పోనీ ఖర్చు ఎక్కువ అనుకుంటే ఇంట్లోనే నువ్వు చెయ్యి. తక్కువ ఖర్చులో అయిపోతాయి. రోజూ చెయ్యక్కర్లేదుగా! పిల్లలు అడుగుతున్నారు. తినటానికి ఖర్చుపెడితే బాధపడకూడదు"

"అవును మరి మీరు తెచ్చే లక్షలూ, కోట్లూ మురిగిపోతున్నాయి కదా!" వెటకారంగా అంది.

"నువ్వు సినిమాలకీ, షాపింగులకీ పెట్టే అనవసరమైన ఖర్చుకంటే ఇదేం తీసిపోలేదులే" కాస్త ధైర్యం చేశాడు.



"నోరు ముయ్యండి. ఎప్పుడూ నా మీదే ఏడుపు. ఏ సరదా లేదు. ఖర్మ! నాకు ఎక్కడ పెళ్లికాదో అని మానాన్న ఈ బ్యాంకు గుమస్తాకి ఇచ్చి చేశాడు. ఛీ ఛీ" మూతి తిప్పింది.

నోటికి ఎంత మాటొస్తే అంతమాట అనగలదని తెలిసిన కాంతారావు ఇక మాట్లాడలేదు.

పంకజం ఆలోచనల్ని, ఆవిడ పద్ధతుల్నీ మార్చటం తన వల్లకాదు. ఎంత మెల్లగా చెప్పినా తన ధోరణి తనదే. ఇంక ఏమీ చెయ్యలేక, తనే ఎక్కువగా మౌనంగా వుండటం అలవాటు చేసుకున్నాడు.

తల్లితండ్రులు ఎప్పుడూ పోట్లాడుకోవటం, తల్లి ఏడుస్తూ బాధపడుతూ వుండటం పిల్లల్ని అయోమయంలో పడేస్తుంది. వాళ్లకి ఆ చిన్ని వయసుల్లో తల్లీ, తండ్రుల గొడవల్లో, కీచులాటల్లో ఎవరిది తప్పో, ఎవరిది ఒప్పో తెలియదు. తెలుసుకునే వయసూ, నిర్ణయించే వయసూ పిల్లలకుండవు. ఇంట్లో వుండాలంటే ఒక రకమైన అయిష్టత, భయం. బిక్కు బిక్కుమంటూ తల్లితండ్రుల కీచులాటలు వింటూ, చూస్తూ కూర్చోవటం తప్ప మరింకేమీ చేతకాదు.

* * *

అలాంటి ఇంటి వాతావరణంలోనే కిశోర్, జ్యోతి పెరుగుతున్నారు.

'నాగింగ్ వైఫ్, లీకింగ్ రూఫ్ కీప్స్ ది మ్యాన్ ఎవే!' అన్న ఆంగ్ల సామెత తనకి తెలియకుండానే ఆచరణలో జరిగిపోతోంది కాంతారావు విషయంలో. పిల్లల కోసమైనా త్వరగా ఇంటికి వెళ్లాలనిపించినా భార్య సాధింపులు భరించలేక, ఎదిరించే ధైర్యం లేక ఇంటికి ఎంతో కొంతసేపు దూరంగానే వుంటున్నాడు.

ఎదుగుతున్న కిశోర్‌కి తల్లి గారాబం కొద్ది

కొద్దిగా ధైర్యాన్నిచ్చింది.

"అమ్మా! నాకు డబ్బులు కావాలి" అడిగాడు కిశోర్. ఎనిమిదవ తరగతి చదువుతున్నాడు. టీనేజ్‌లో వున్నాడు. వాడి ఆలోచనలు అన్నీ ఎక్కడో గాలిలో తేలిపోతున్నాయి. కోరికలు గుర్రాలై రెక్కలు వుంటే ఎగిరిపోయేటట్లుగా వున్నాయి. ప్రపంచంలో తనే ఒక ప్రత్యేకమైన మనిషినని, ఏదో చెయ్యాలని, ఏదో సాధించాలనీ,ఎన్నో రంగులకలల్లో తేలిపోయే వయసు. తన చుట్టూ వున్న స్నేహితులు కూడా కిశోర్ లాంటి పిల్లలే. అందుకే వాళ్ళు స్నేహితులైనారు.

తండ్రి అంటే లెక్కలేదు. ఎందుకంటే అమ్మ లెక్క చెయ్యదు గనుక. ఆ విధంగా పిల్లల దృష్టిలో కాంతారావు అంటే నిర్లక్ష్య వైఖరి వచ్చింది.

తను అడిగింది అమ్మ ఇస్తుందనే నమ్మకం కలిగింది కిశోర్‌కి.

తల్లిని కిశోర్ డబ్బులు అడగటం కాంతారావు విన్నాడు.

"కిశోర్! ఎప్పుడూ నీకు డబ్బు లెందుకురా? పిల్లలు అంత డబ్బులు ఖర్చుపెట్టకూడదు. నీకు ఏం కావాలో చెప్పు. నేను తీసుకువస్తాను. నువ్వు బాగా చదువుకోవాలి. చదువు మీద శ్రద్ధ చూపించు. నువ్వు చదువుకుంటూ వుంటే నిన్ను చూసి జ్యోతి కూడా చదువుకుంటుంది" నిదానంగానే చెప్పాడు.

కిశోర్‌కి కోపం వచ్చింది తండ్రి మాటలకి. "నీకెందుకు నాన్నా? నా ఇష్టం. అయినా నేను అమ్మని అడుగుతున్నాను" అన్నాడు.

పిల్లలచేత, 'నీకెందుకు నాన్నా? నా ఇష్టం!' అని అనిపించుకుని, వాళ్ల దృష్టిలో తను మరొక మెట్టు జారిపోయానని బాధపడ్డాడు కాంతారావు.

"అవునండీ! అయినా మీకెందుకు? కిశోర్ అడిగింది నన్ను. ప్రతి చిన్న విషయానికీ నీతిసూత్రాలు చెప్పటం మాత్రం తెలుసు - డబ్బు సంపాదన లేకపోయినా!" నోరు పారేసుకుంది పంకజం.


అయినా మీకెందుకు? కిశోర్ అడిగింది నన్ను. ప్రతి చిన్న విషయానికీ నీతిసూత్రాలు చెప్పటం మాత్రం తెలుసు - డబ్బు సంపాదన లేకపోయినా!

మౌనమే శరణ్యమైంది కాంతారావుకి కానీ 'ఈ కిశోర్ ఏమైపోతాడు భవిష్యత్తులో? వాడికి చదువు ఎలా వస్తుంది? ' అన్న ఆలోచన మాత్రం వేధిస్తూనే వుంది కాంతారావుని.

"పిల్లలకి ఏవో అవసరాలు వుంటాయి. ప్రతిదీ మనకి చెప్పాలేమిటి? " అంటూ, కిశోర్ అడిగిన డబ్బులు వాడి చేతిలో పెట్టింది. పంకజం గారాబం పిల్లల్ని ఎటు తీసుకువెళ్తుందోనని భయం వేస్తూ వుంటుంది కాంతారావుకి.

ఎనిమిదో క్లాసు కూడా అయిపోయింది.

తొమ్మిదవ క్లాసులోకి వచ్చాడు కిశోర్. జ్యోతి ఏడవ తరగతిలోకి వచ్చింది.

తొమ్మిదవ క్లాసు ప్రారంభం నుంచీ కిశోర్ అల్లరి మరీ ఎక్కువైంది. అస్తమానం తల్లిని డబ్బులు కావాలని అడుగుతూనే ఉన్నాడు. ఎప్పుడైనా లేవు అంటే గొడవ చేస్తాడు.

ఒకరోజు ఉదయం కాంతారావు తన చొక్కా జేబు చూసుకున్నాడు. వందరూపాయలు లేవు. ఏమయ్యాయి?

"పంకజం" పిలిచాడు.

"జేబులో వందరూపాయలు వుండాలి. నువ్వు తీశావా? "అడిగాడు.

"నాకేం పని? " దురుసుగా అంది.

"మరి ఏమైనాయి? ఎవరు తీశారు? "

పక్కగదిలో కిశోర్ స్కూలుకి వెళ్లేందుకు పుస్తకాలు సర్దుకుంటున్నాడు.

"నాన్నా! ఇందాక అన్నయ్య నీ జేబులో నుంచి డబ్బులు తీసుకుంటూవుంటే

చూశాను" అంది జ్యోతి.

"కిశోర్!" పిలిచాడు.

మాట్లాడకుండా వచ్చాడు.

"నా జేబులో వందరూపాయలు తీశావా? "

"నేను తియ్యలేదు"

"అబద్ధం నాన్నా!" పక్కనుంచి జ్యోతి అంది.

"షటప్! నిన్ను తంతాను జ్యోతి!" కసురుకున్నాడు జ్యోతిని.

"నువ్వూరుకో జ్యోతి! కిశోర్! నిజం చెప్పు. నేను నిన్నేమీ అనను" అన్నాడు కాంతారావు.

"నేను తియ్యలేదు"

కోపం వస్తోంది కాంతారావుకి.

"ఏమిటండీ మీ గొడవ? వాడు తియ్యలేదు అని చెబుతూవుంటే వినిపించుకోరేమిటి? దానిమాటే లెక్కా మీకు? " పంకజం అంది.

"జ్యోతి మాట లెక్క కాదు. నా జేబులో వందరూపాయలు వుండాలి. నువ్వు తియ్యలేదు, కిశోర్ తియ్యలేదు. మరి ఏమైపోతాయి? రెక్కలు వచ్చి ఎగిరిపోయిందా నోటు? "

"ఏమో! ఎగిరిపోయిందేమో! లేకపోతే, మీరే దేనికి ఖర్చు పెట్టుకున్నారో ఎవరికి తెలుసు? ప్రతి చిన్న విషయానికీ నా కొడుకుని అనుమానించటం, కొట్టడం, కోప్పడటం మాత్రం తెలుసు" మండిపడింది.

కాంతారావుకి చిరాకు వేసింది భార్య ధోరణికి. కొడుకు ఇలాంటి పనులు చేస్తున్నందుకు బాధ కలుగుతోంది. కిందటిసారి కిశోర్ తన జేబులో నుంచి డబ్బులు తీసుకున్నందుకు కొట్టాడు. కానీ ప్రయోజనం లేదు. ఎందుకిలా చేస్తున్నాడు...? తల్లి చేసే గారాబం, స్నేహితుల ప్రభావం వీడిని ఎటు తీసుకువెళ్తుంది? అని బాధపడేవాడు.

కిశోర్ స్నేహితులు రాజూ, రమేష్, రంగా ముగ్గురూ తమ ఇంటికి వచ్చారు ఒకరోజు. రంగా సిగరెట్టు కాలుస్తూ నిలబడ్డాడు. అప్పుడే బయటినుంచి వచ్చిన కాంతారావు చూశాడు. రంగా కాస్త కంగారుపడ్డాడు. కాంతారావు అందరినీ కోప్పడ్డాడు. మంచి మాటలు చెప్పాడు. సున్నితంగా మందలించాడు.

అవి వాళ్ల బుర్రలోకి ఎంతవరకు ఎక్కాయో తెలియదు.

సినిమాలు చూడటం, వీడియో గేములు ఆడటం, సెలవొస్తే గాలికి తిరగటం, సరిగ్గా చదవకపోవటం.

కాంతారావుకు వాళ్ల పద్ధతులు నచ్చలేదు. వాళ్లతో స్నేహం చెయ్యొద్దు అంటే కిశోర్‌కి నచ్చదు. కిశోర్‌ని కోప్పడితే, పంకజానికి నచ్చదు. ఈ నచ్చకపోవటమనే వైఖరిలో, కిశోర్ ఎటు కొట్టుకుపోతాడు? ఏమైపోతాడు అనే ఆందోళన, ఆలోచనే గానీ సరియైన ఆచరణలో పెట్టగలిగే ధైర్యం, సమర్థత, నేర్పూ లేవు కాంతారావుకి. కాంతారావు అశక్తత, పంకజం గారాబం కిశోర్‌కి అవకాశంగా మారాయి.




ఒక రోజు మధ్యాహ్నం స్కూలు మానేసి రాజూ, రమేష్, రంగా, కిశోర్ మ్యాట్నీ సినిమాకు బయలుదేరారు.

రోడ్డుమీద నడుస్తున్నారు. పక్కనుంచి ఎవరో వెళ్తున్నారు. ఆయన ప్యాంటు జేబులోనుంచి పర్సు తీశాడు రంగా. ఆయనకు తెలిసి వెనక్కి తిరిగి చూశాడు. మిత్రులు నలుగురూ పరుగు లంకించుకున్నారు.

'దొంగ దొంగ' అంటూ అరుస్తూ వెంటప

## పశ్చిమాన్ని పొడుం చేసిన భూకంపం

భూకంపాలు భూమి పొరలలో కలిగే ఒత్తిళ్ళు, కదలికల వల్ల సంభవిస్తుంటాయి. ఆ ఒత్తిళ్ళు, కదలికల తీవ్రత ఎంత ఎక్కువగా ఉంటే భూకంపాల తీవ్రత అంత అధికంగా ఉంటుంది. ఆ తీవ్రత మీద నష్టం స్థాయి ఆధారపడి ఉంటుంది. భారతదేశంలో భూకంపాల చరిత్రను పరిశీలిస్తే అలాంటి తీవ్రత, నష్టం అధికంగా నమోదైన పెను భూకంపాలు రెండున్నాయి. అవి మహారాష్ట్రలో లాతూరు ప్రాంతంలో, గుజరాత్‌లోని కచ్ ప్రాంతంలో సంభవించిన భూకంపాలు. ఈ రెండూ సృష్టించిన పెను విధ్వంసం మాటల కందనంత బీభత్సమైనది. గుజరాత్‌లోని భుజ్, తదితర ప్రాంతాల్లో 2001లో రిపబ్లిక్ దినోత్సవం నాడు రిక్టర్ స్కేలుపై 7.9 తీవ్రతతో సంభవించిన భూకంపం వల్ల దాదాపు 20 వేల మంది మరణించారు. లక్షా అరవై ఆరు వేలమంది గాయపడ్డారు. ఆరు లక్షల మంది నిరాశ్రయులయ్యారు. మూడు లక్షల నలభై ఎనిమిది వేల ఇళ్లు పూర్తిగా కుప్పకూలిపోయాయి. మరో ఎనిమిది లక్షల ఎనభై ఎనిమిది వేల ఇళ్ళు ధ్వంసమయ్యాయి. 20 వేలకు పైగా పశువులు మృత్యువాత పడ్డాయి. ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ కోటీ యాభై తొమ్మిది లక్షల మంది ఈ పెను భూకంపం బాధితులయ్యారు. అనేక వంతెనలు, రోడ్లు ధ్వంసమయ్యాయి. దాదాపు 103కోట్ల డాలర్ల మేరకు ఆర్థికంగా నష్టం సంభవించిందని ప్రభుత్వం అంచనా వేసింది. అయితే, ఇతర అంచనాలు ఈ మొత్తాన్ని 500 కోట్ల డాలర్లుగా పేర్కొన్నాయి. ఈ భూకంపం వల్ల విడుదలయిన శక్తి 1994లో నార్త్‌రిడ్జ్‌లో సంభవించిన పెను భూకంపం సందర్భంగా విడుదలయిన శక్తికంటే 30 రెట్లు ఎక్కువ.

వాయువ్య భారతంలో 1819 నుంచి ప్రకంపనాలు నమోదవుతున్నాయి. 1819 జూన్ 16న సంభవించిన భూకంపంలో 1500 నుంచి 2000 మంది వరకు మరణించారు. ఆ తర్వాత 1845, 1846, 1856, 1857, 1869, 1956లో ఈ ప్రాంతంలో ఒక మాదిరి భూకంపాలు సంభవించాయి.



డ్డాడాయన.

రంగా తన చేతిలో వున్న పర్సు కిశోర్ చేతిలో పెట్టి పరిగెత్తాడు. మిగతా ఇద్దరూ రంగాని అనుసరించారు. కిశోర్ తేరుకుని పరిగెత్తే లోపల ఆయన వచ్చి కిశోర్‌ని పట్టుకున్నాడు. నాలుగు దెబ్బలు తగిలించి పర్సు తీసుకున్నాడు. "వెధవా! ఇంత చిన్న పిల్లవాడివి! ఇలాంటి దొంగపనులు చేస్తావా? పద పోలీస్ స్టేషన్‌కి" కిశోర్ చొక్కా పట్టుకున్నాడు.

"సార్ సార్! మీ పర్సు తీసింది నేను కాదు సార్! వాళ్లు తీసి, మీకు తెలిసి, పట్టుకోవటానికి వస్తుంటే నా చేతిలో పెట్టి వాళ్లు పారిపోయారు సార్!" భయంగా అన్నాడు.

"దొంగ వెధవా! అబద్ధాలాడతావా? కిశోర్ చెవి పట్టుకున్నాడు.

"లేదు సార్. ప్రామిస్ సార్. పోలీస్ స్టేషన్‌కి వద్దు సార్" భయపడుతున్నాడు.

ఆయనకి కిశోర్ వాలకం చూస్తే జాలికలిగింది.

'పాపం.. చిన్నపిల్లవాడు.. బ్రతిమిలాడుతున్నాడు' అనిపించింది.

"ఇంకెప్పుడూ ఇలాంటి తప్పుడు పనులు చెయ్యకు. అలాంటి వాళ్లతో స్నేహం

## దక్షిణాదిని మింగిన సునామీ

మహా బీభత్సకరమైన ప్రకృతి వైపరీత్యాలలో ఈ సునామీ ఒకటి. సునామీకి కూడ కారణం భూకంపమే. అయితే ఈ భూకంపం సముద్రపు భూగర్భంలో సంభవిస్తుంది. దీనివల్ల పెను ఉప్పెన సంభవించి తీర ప్రాంతాల్లో కనీ వినీ ఎరగని బీభత్సం సృష్టిస్తుంది. పెను ఉప్పెనలో రాక్షస అలలు నింగినంటేలా ఎగిసి పడుతూ భూమిపై మహా శక్తితో విరుచుకుపడే ప్రళయమే సునామీ. 2004 డిసెంబర్ 26న హిందూ మహా సముద్రంలో సంభవించిన సునామీ 11 దేశాలను అతలాకుతలం చేసింది. ఇండోనీషియాలోని సుమత్రా దీవికి ఉత్తరంగా 150 కిలోమీటర్ల దూరంలో సంభవించిన సునామీ భూకంపం గత 40 ఏళ్లలోనే కనీ విని ఎరగనంతటి భీకరమైనది. దీని తీవ్రత రిక్టర్ స్కేలుపై 9.3 పాయింట్లుగా నమోదయింది. ఇది, ప్రపంచంలో మహోగ్ర భూకంప ప్రళయాలుగా రికార్డైన వాటిలో రెండోది. 1960లో మే 22న చిలీలో 9.5 తీవ్రతతో సంభవించిన భూకంపం మొట్టమొదటిది.

భారతదేశంలోని అండమాన్ నికోబార్, తమిళనాడుతో పాటు; సుమత్రా దీవి, మలేసియా మైన్మార్, సింగపూర్, థాయిలాండ్, బంగ్లాదేశ్‌లలో సునామీ అధిక ప్రభావం చూపించింది. ఈ సునామీ వల్ల అధికంగా జన నష్టం సంభవించిన దేశం ఇండోనీషియా. ఆ దేశంలో లక్ష మందికి పైగా మరణించారు. శ్రీలంకలో 24 వేల మందికి పైగా, భారతదేశంలో 10 వేల మంది వరకు చనిపోయారు. థాయిలాండ్‌లో 7 వేల మంది మృత్యు ఒడిని చేరుకున్నారు. మలేసియా, మైన్మార్, మాల్దీవులు, సొమాలియా, టాంజానియాలలో కూడా డజన్లకొద్దీ చనిపోయారు. మొత్తంమీద దాదాపు లక్షన్నర మందిని ఈ సునామీ మింగేసింది. లక్షలాది మంది దీని బాధితులుగా మిగిలారు. పట్టణాలు, గ్రామాలు అనేకం సమూలంగా తుడచిపెట్టుకుపోయాయి. ఆస్తి నష్టం మాటకొస్తే, అది అంచనాకందనంత భారీ మొత్తంలోనే జరిగింది. సహాయక పునరావాస చర్యలకు, పునర్నిర్మాణాలకు, మరమ్మతులకు వేల కోట్ల డాలర్లు అవసరమవుతున్నాయి.



చెయ్యకు. నీ భవిష్యత్తు నాశనం అవుతుంది. పోనీలే అని నిన్ను వదిలిపెడుతున్నాను. పోలీసుస్టేషన్‌లో నిన్ను అప్పగించివుంటే వాళ్లు లాఠీ దెబ్బలు తగిలించేవాళ్లు" అని నాలుగు మాటలు చెప్పి ఆయన వెళ్లిపోయాడు.

ఆ క్షణంలో కాస్త భయం అనిపించింది కిశోర్‌కి. కానీ తన చెడ్డపనులు మానలేదు. అప్పుడప్పుడూ కిశోర్ తండ్రి జేబులోనుంచి డబ్బులు తీస్తూనే ఉన్నాడు. పంకజం మాత్రం ఏదో చిన్న పిల్లవాడు. తీస్తేతీశాడేమో! చిన్నతనం, వాడికీ ఏవో ఖర్చులుంటాయి. పెద్దవాడైతే వాడే మానేస్తాడు. దానికి పెద్ద సిద్ధాంతాలూ, రాద్ధాంతాలు!" ఈ రకంగా పంకజం కిశోర్ చేసే పనుల్ని కిశోర్ ముందరే సమర్థిస్తుండేది.

అప్పటినుంచీ తన దగ్గర వుండే డబ్బుని, జాగ్రత్త చేసుకునే అలవాటు చేసుకున్నాడు కాంతారావు. ఎప్పుడైనా పొరపాటున వదిలేస్తే కిశోర్ చేతిలోకి ఆ డబ్బు వెళ్లిపోయేది.

* * *

కిశోర్ చదివే స్కూల్లో 'పేరెంట్స్, టీచర్స్'

మీటింగు జరిగింది. చాలామంది పిల్లల తల్లితండ్రులు వచ్చారు.

రంగా, రాజూ, రమేష్ వాళ్ల తల్లులు మాత్రమే వచ్చారు. తండ్రులకి తీరిక లేదు. శంకరం కిశోర్ క్లాస్ టీచర్. పిల్లల్ని గురించి వాళ్ల తల్లితండ్రులకి ఆయనకి తెలిసిన పద్ధతిలో చెప్పారు. ఆ మాటలు వాళ్లకి ఎంతవరకూ నచ్చాయో తెలియదు. కిశోర్ కు మార్కులు రావటం లేదు. సరిగ్గా చదవటం లేదు. ఒకటి, రెండుసార్లు వీళ్ల చేసే అల్లరి ఆయనకి తెలిసింది. కిశోర్‌కు ఆయన పెన్ను తీయటం, మళ్లీ ఆయన చూడకుండా ఆయన టేబులుమీద పెట్టటం, క్లాసులో కూర్చుని పాఠం వినకుండా డబ్బులు లెక్కపెట్టుకోవటం ఇవన్నీ ఆయన కంటపడుతూనే వున్నాయి.

"మీ అబ్బాయి తెలివైనవాడే కాంతారావుగారూ! కానీ సరిగ్గా చదవటం లేదు. చెడు సావాసాలు చేస్తున్నాడు. వాడి చుట్టూ వున్న వాడి స్నేహబృందం కూడా అసలు మంచివాళ్లు కారు. వాళ్లు ఎంత చెప్పినా వినటం లేదు. మీరు నయానో భయానో ఏదో విధంగా వాడికి నచ్చచెప్పండి. వాడిలో మార్పు వస్తే బాగుంటుంది. నేనూ కేకలేస్తూనే ఉన్నాను వీళ్లందరినీ. వాళ్లు విని, మారితే వాళ్లకే మంచిది! ఏమంటారు? " అన్నారు శంకరం.

"నిజమే సార్! ఇంట్లో వాళ్ల అమ్మ గారాబం ఎక్కువైంది. వీడు చేసే పనులకి వాళ్ల అమ్మ సపోర్టు ఉంది. ఏం చెయ్యాలో అర్థం కావటం లేదు" బాధపడ్డాడు కాంతారావు.

ఆరోజు స్కూల్లో ఎవరి జేబులో నుంచి పర్సు దొంగతనం చేశారో ఆ పదవ తరగతి చదువుతున్న అబ్బాయి రమేష్, రంగా వెంటపడ్డాడు. వాళ్లు క్షణంలో ఆ పర్సు మళ్లీ కిశోర్ చేతిలోపెట్టి తప్పించుకున్నారు.

పరుగెత్తుకుంటూ వచ్చిన ఆ అబ్బాయి కిశోర్‌నీ, కిశోర్ చేతిలో ఉన్న తన పర్సునీ చూసి నాలుగు తగిలించాడు.

"నువ్వు ఒట్టి వెధవ్వి! ఇలాంటి వెధవ పనులూ, దొంగపనులూ చేస్తున్నావని నాకు తెలుసు కానీ కళ్లతో ఇవ్వాళ చూస్తున్నాను. పద నేను నిన్ను వదలను. ప్రిన్సిపాల్ దగ్గరకి తీసుకువెళ్తాను" సీరియస్‌గా కిశోర్ చొక్కా పట్టుకుని కొడుతున్నాడు.

"నాకేం తెలియదు" సణుగుతున్నాడు కిశోర్.

"ఆ రమేష్, రాజూ, రంగా దొంగలు. ఆ దొంగలలో నువ్వూ ఒకడివి. అబద్ధాలు చెబితే నమ్ముతాననుకుంటున్నావా? పద" కిశోర్ చొక్కా పట్టుకుని లాక్కువెళ్తున్నాడా అబ్బాయి.

ఇంతలో ఇదంతా దూరంనుంచి చూస్తూ శంకరం మాష్టారు వచ్చారు అక్కడికి.

"ఏమిటి రవీ! ఏమైంది? " అడిగారు. విషయమంతా చెప్పాడు రవి. "వీళ్లు ఒట్టి దొంగలు మాష్టారూ! అబద్ధాలు చెబుతారు. వాళ్లతోపాటు ఈ కిశోర్ కూడా పెద్ద దొంగ అవుతున్నాడు. ఇప్పుడు నా పర్సు కొట్టేశాడు. ఇంతకుముందు రోడ్డుమీద వెళ్తున్న ఎవరో ఒకాయన పర్సు కొట్టేశాడు. రేపు మీ పర్సు దొంగతనం చేస్తాడు. ఈ కిశోర్ ఇంట్లో కూడా దొంగతనం చేసి డబ్బులు తీసుకువస్తాడు. అసలు ఇటువంటి వాళ్లని స్కూల్లోనుంచి పంపించివేసి, పోలీస్ కంప్లైంట్ ఇవ్వాలి. లేకపోతే వీళ్ల మూలంగా అందరూ చెడిపోతారు. స్కూలుకి చెడ్డపేరు వస్తుంది" చాలా కోపంగా అన్నాడు రవి.

"నిజమే రవీ! వీడిని నేను మందలిస్తాను. ఈసారికి వదిలెయ్యి. మరొకసారి ఇలాంటి తప్పుడు పనులు చేస్తే అప్పుడు తప్పకుండా ప్రిన్సిపాల్ గారికి కంప్లైంట్ చేద్దాం. కఠిన చర్య తీసుకుందాం" అన్నారు. "ఇది మొదటిసారి కాదు మాష్టారూ!" అన్నాడు రవి.

"నిజమే రవీ! ఈ ఒక్కసారికీ వదిలెయ్యి. ఒక్క ఛాన్స్ ఇచ్చి చూద్దాం" అన్నారు.

"సరే మాష్టారూ! మీరు చెప్పారు గనుక ఈసారికి వదిలేస్తున్నాను" అన్నాడు రవి

కొంత అయిష్టంగానే.

'హమ్మయ్య' అనుకున్నాడు కిశోర్ మనసులో.

శంకరం క్లాసులోకి వచ్చాడు. కిశోర్ కూడా క్లాసులోకి వచ్చి కూర్చున్నాడు.

వెనక బెంచీలో కూర్చున్నారు రాజూ, రమేష్, రంగా. కిశోర్ వెళ్లి వాళ్ల దగ్గర కూర్చున్నాడు.

శంకరానికి కోపంగా ఉంది వాళ్ల ప్రవర్తనకి. ఎన్నిసార్లు ఎంత మంచిగా చెప్పినా వాళ్లు ముగ్గురూ మాట వినటం లేదు. ఆ పిల్లలకి పొగరు. తండ్రుల పదవులూ, ఉద్యోగాలూ చూసుకుని వాళ్ల ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తున్నారు. ఆ ఊరి ఎమ్మెల్యే కొడుకు రంగా. ఇంకెవరో ప్లీడరు కొడుకు రమేష్. రాజు బాగా ఆస్తిపాస్తులున్న బాపిరాజు గారాల పుత్రుడు. మామూలు మధ్య తరగతి కుటుంబంలో పుట్టిన కిశోర్ ఈ అల్లరి మూకతోచేరి, పాడైపోతున్నాడు. దానికి తోడు ఇంట్లో వాళ్ల అమ్మ గారాబం.

రేపు ఈ పిల్లలు ఏమైపోతారు? వాళ్ల భవిష్యత్తు ఏమిటి? మరుక్షణంలో అనిపించింది శంకరానికి. బహుశా వాళ్లందరి భవిష్యత్తూ బాగానే ఉంటుంది. ఎమ్మెల్యే కొడుకు ఇప్పుడు ఎన్ని వెధవపనులు చేసినా రేపు భవిష్యత్తులో ఏ రాజకీయ నాయకుడో అయిపోయి ఏ మంత్రి పదవిలో ఉన్నా ఆశ్చర్యం లేదు. వాడికి ప్రజల దణ్ణాలకి కొదువ ఉండదు. ఆస్తిపాస్తులున్న రాజూ అంతే! ఏవో ఘనకార్యాలు చేస్తాడు. వాడిని ఆదుకోవటానికి తండ్రి ఆస్తి, అనుభవించటానికి ఐశ్వర్యం... రెండూ ఉన్నాయి. మిగతావాళ్లు దొంగలే అవుతారో, మారిపోయి మంచివాళ్లే అవుతారో కాలమే నిర్ణయించాలి.

ఒక స్కూలు మాష్టారిగా, గురువుగారిగా వాళ్ల మంచి కోరి తను ఎన్ని రకాలుగా వాళ్లకి చెప్పినా వినిపించుకోవటం లేదు. ఈ కిశోర్ కూడా పాడైపోతున్నాడని బాధపడ్డారు. టీచర్‌గా తన ఉద్యోగానికి న్యాయం చెయ్యలేకపోతున్నానేమో అన్న బాధ కూడా ఆయన్ని వేధించింది. టీచర్ అంటే విద్యార్థులకి కేవలం పాఠాలు చెప్పటమే కాదు. వాళ్లని సక్రమమైన మార్గంలో పెట్టవలసిన బాధ్యత కొంతైనా వుంటుందని నమ్మే మనిషి తను.

అన్యమనస్కంగానే క్లాసులో పాఠం చెప్పటం పూర్తిచేశారు శంకరంగారు. క్లాసు మామూలుగా జరిగిపోయింది.




స్కూలు వదిలేశారు.

కిశోర్ ఇంటికి వెళ్తున్నాడు. శంకరం మాష్టారు ఏమీ అనలేదు 'హమ్మయ్య!' అనుకున్నాడు.

వెనుకగా వస్తున్న శంకరంగారు కిశోర్‌ని పిలిచారు. "కిశోర్ నాకు కాస్త పనివుంది మార్కెట్లో! నాతో వస్తావా? " అని అడిగారు దగ్గరికి వచ్చి.

భయం వేసింది కిశోర్‌కి. మాష్టారు మార్కెట్టుకి తనని ఎందుకు తీసుకువెళ్తారు...? అసలు తనని ఎందుకు రమ్మన్నారు? పోలీస్ స్టేషన్‌కి తీసుకువెళ్తారా? లేకపోతే తనని వాళ్ల ఇంటికి తీసుకువెళ్లి తంతారా? మనసులో ప్రశ్నలు మెదులుతున్నాయి.

"ఏమిటి మాట్లాడవు? పోలీస్‌స్టేషన్‌కి కాదులే" అన్నారు.

'అమ్మో! ఈయన కాలాంతకులు! తన మనసులోది కనిపెట్టేశారు' అనుకున్నాడు. మరుక్షణంలో 'హమ్మయ్య!' అని కూడా అనిపించింది.

"వస్తానండీ" భయంగానే అన్నాడు తల వంచుకుని. చేసింది తప్పుపని. అది మాష్టారుకి తెలిసిపోయింది. ఆయన చూశారు. మాష్టారుతో మాట్లాడే ధైర్యం కానీ, అసలు ఆయన పక్కన నడిచే ధైర్యం కానీ కిశోర్‌కి లేదు.

సాయంకాల సమయం. వాతావరణం చల్లగా బాగుంది. ఇద్దరూ వెళ్లి ఓ చిన్న రెస్టారెంట్‌లో కూర్చున్నారు. 'ఇదేమిటి? పని ఉందని, మార్కెట్టుకి వెళ్లాలని చెప్పి, ఈయన ఇక్కడికి ఎందుకు తీసుకువచ్చారు? ' అయోమయంగా ఉంది కిశోర్‌కి.

తీరుబడిగా కూర్చున్నారు.

"ఏం తీసుకుంటావు? "అడిగారు శంకరం.

"నాకేమీ వద్దు సార్!" భయంగానే వుంది కిశోర్‌కి.

"అదెలాగా! అయిస్‌క్రీమ్ తీసుకో బాగుంటుంది" అన్నారు. బేరర్ వచ్చాడు. ఒక ఒక అయిస్‌క్రీమ్, కాఫీ చెప్పారు. బేరర్ అవి తెచ్చిచ్చి వెళ్లిపోయాడు. భయం భయంగా కూర్చున్నాడు కిశోర్.

"తిను!" అన్నారు శంకరం.

కంగారుగానే తిన్నాడు కిశోర్.

"నీతో మాట్లాడదామనే నిన్ను ఇక్కడికి తీసుకువచ్చాను కిశోర్!" అన్నారు కాఫీ తాగుతూ.

మాట్లాడ లేదు కిశోర్.

"సూటిగా ఒక్కమాట అడుగుతాను చెప్పు! నువ్వు ఇలా దొంగతనాలు ఎందుకు చేస్తున్నావు? ఎందుకు ఇలా ప్రవర్తిస్తున్నావు? "

మాట్లాడ లేదు కిశోర్.

"మాట్లాడాలి కిశోర్!" అన్నారు వాడినే చూస్తూ.

తను పనిచేసిన స్కూళ్లల్లో కిశోర్ లాంటి విద్యార్థుల్ని ఎంతో మందిని చూస్తూనే వున్నాడాయన. ఆయనికీ ఇద్దరు కూతుళ్లు. వాళ్లూ స్కూలుకి వెళ్లి చదువుకుంటున్నారు. వాళ్లు బాగానే వున్నారు, బాగానే చదువుకుంటున్నారని ఆయన అనుకుంటున్నాడు. ఆ నమ్మకం నిజం కూడా!

క్రమశిక్షణ అనేది ఆడపిల్లకైనా మగపిల్లవాడికైనా ఒక్కటే. పెద్దలకైనా ఒక్కటే. అది మనిషికి అవసరం కూడా. ప్రాథమిక అవసరం.

ఎన్నో ఆశలతో, స్కూలు మీద టీచర్ల మీదా నమ్మకంతో తమ పిల్లల్ని స్కూలుకి పంపుతారు తల్లితండ్రులు. విలువైన ఎక్కువ కాలం స్కూల్లోనే గడుపుతారు విద్యార్థులు.

వాళ్లకి చదువు చెప్పటంతోపాటు వాళ్లు తప్పుదోవ పడితే గమనించి, సరిదిద్దవలసిన బాధ్యత ఉపాధ్యాయులకీ, తల్లితండ్రులకీ కూడా వుంది.

కిశోర్ లాంటి విద్యార్థులు తన అనుభవంలో తారసపడ్డారు,పడుతూనే వుంటారు.

డ్రగ్ ఎడిక్ట్స్, ఆడపిల్లల్ని ఏడిపించి అల్లరి పెట్టేవాళ్లూ, కిశోర్ లాంటి చిల్లర దొంగతనాలు చేసేవాళ్లూ - ఇలా చాలామంది.

తను కొంత సమయం కేటాయించుకుని, వాళ్లకి సరైన సలహాలూ, మందలింపులూ, సూచనలూ, ఏదో కొంత కౌన్సెలింగ్ కలిపి వాళ్లకి చెబుతూ వుంటాడు. వాళ్ల తల్లితండ్రులకి తెలియపరిచి- పిల్లల విషయంలో వాళ్లకి సహాయం చెయ్యటం, సలహాలివ్వటం చేస్తూ ఉంటాడు. అందులో కొంత మంది మంచి దోవలోకి వచ్చినవాళ్లు తనకి తెలుసు. ఎప్పుడైనా ఒకసారి కనిపించి, తనని ఎంతో ఆప్యాయంగా పలకరించి వెళ్తూ వుంటారు. "మాష్టారూ! మీ మూలంగానే మాకు ఈ మంచి జీవితం వచ్చింది" అంటారు. అప్పుడు, తన శిష్యుడు ఈ సమాజంలో ఒక మంచి పౌరుడిగా వున్నాడని తన మనసుకి ఎక్కడో చిన్న ఆనందం.

ఇప్పుడు ఈ కిశోర్ ఆలోచనల నుంచి తేరుకున్నారు శంకరంగారు.

"మాట్లాడాలి కిశోర్! నేను నిన్ను ఏమీ అనను. కొట్టను, తిట్టను. మనసు విప్పి

# ఉత్తమ నవలలకు ఆహ్వానం

మీరు విలక్షణ రచయితలా
వైవిధ్యమంటే మీకు మక్కువా
వినూత్నంగా అక్షరాన్ని సంధించడం మీ అభిలాషా

మరింకేం, వెంటనే స్పందించండి.

మీకు నవ్య నవలా వేదిక

**చతుర** సాదర స్వాగతం

గత 28 సంవత్సరాలుగా అప్రతిహతంగా నెలనెలా ఉత్తమ నవలను పాఠకులకు అందిస్తున్న చతుర రానున్న సంచికలను మరింత అద్భుతంగా వెలువరించాలని సంకల్పిస్తోంది. అశ్లీలతకు తావు లేకుండా, మానవతా విలువలతో ఆబాలగోపాలాన్ని అలరించగల మంచి నవలలకు స్వాగతం పలుకుతోంది.

## సునిశిత హాస్యంతో ఓలలాడించే వ్యంగ్య నవలలకు ప్రత్యేక ప్రాధాన్యం

నవలలు ఇతివృత్తంలో నవ్యత, రచనాసంవిధానంలో వైవిధ్యం కలిగి ఉండాలి. తెలుగు వాతావరణాన్ని, తెలుగు వారి సమకాలీన జీవితాన్ని విభిన్న కోణాల నుండి సమగ్రంగా ప్రతిబింబించగలగాలి. సామాజిక స్పృహతో మానవ స్వభావాలను, ఆంతరంగిక చిత్రాన్ని సమర్థవంతంగా ఆవిష్కరించగలగాలి. నవల చతురలో అచ్చులో 90 పేజీలు మించకుండా చూసుకుని పంపించాలి. అంతకు మించిన పేజీలు ఉన్న పెద్ద నవలలను పరిశీలించడం కుదరదు. కనుక రచయితలు చతురలోని ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో సరిచూసుకుని నవలలు పంపించాలి. ఎంపిక కాని వాటిని తిప్పి పంపగోరువారు తగు పోస్టేజి ఉన్న కవరును జత పరచాలి.

సంపాదకుడు

**చతుర**

'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాద్ - 82.

మాట్లాడు. నిజం చెప్పు. నేను నీకు సహాయం చేస్తాను. నువ్వు నోరు విప్పకపోతే మాత్రం పోలీస్ కంప్లైంటు ఇస్తాను. వాళ్లు వాళ్ల పద్ధతిలో నీ చేత నిజాలు చెప్పిస్తారు. ఆ తరువాత, జువైనల్ స్కూల్లో పడేస్తారు. ఇంక నీ జీవితమంతా పోలీసు కేసు ముద్ర పడిపోతుంది. నీ భవిష్యత్తంతా పాడైపోతుంది"

నేను తీసానని మా అమ్మకీ తెలుసు. కానీ నాన్నతో పోట్లాడి నన్ను ఏమీ అనేది కాదు. మా అమ్మకి నేనంటే చాలా ఇష్టం. చెల్లెలంటే ఇష్టం లేదు

వింటూ కూర్చున్నాడు కిశోర్.

"నా పెన్ను నువ్వు కాజేశావని మళ్లీ నా టేబులు మీద నువ్వే పెట్టావనీ తెలుసు. ఆ సుధాకర్, మోహన్ జేబుల్లోనుంచి పర్సులు దొంగతనం చేశావు. నువ్వు ఎన్నాళ్లనుంచో ఇలాంటి పనులు చేస్తు న్నావని క్లాసులో పిల్లలు చెబుతూనే వున్నారు. మొదట్లో నేను వాళ్ల మాటలు నమ్మలేదు. ఆ తరువాత నాకూ అనుమానం కలిగింది. నా కళ్లతో చూసి, నిన్ను పట్టుకున్నాక చాలా బాధ కలిగింది. మనం స్కూలుకి వచ్చేది ఎందుకు? మీరు చదువుకోవటానికి. మేము మీకు చదువు చెప్పటానికి, మంచి బుద్ధులు నేర్పటానికి. అవునా? "

మాట్లాడలేదు కిశోర్. 'అవును' అన్నట్టుగా బుర్ర ఊపాడు.

"ఎందుకు కిశోర్ ఇలాంటి పనులు చేస్తున్నావు? మీ ఇంట్లో ఎవ రికీ తెలియదా? " అడిగారు శంకరంగారు.

పోలీసు కంప్లైంటు, దాని పర్యవసానం, మాష్టారి నోటినుంచి వినేసరికి కిశోర్‌కి భయం వేసింది. కిశోర్ చెడ్డపనులు చేస్తాడు గానీ చెడ్డవాడు కాదు. దుర్మార్గుడూ, తెలివితక్కువవాడూ కాదు. ఆ సంగతి శంకరంగారికి తెలుసు. వీడిని ఇప్పుడే నాలుగు మందలించి బుర్రలోని చెడుని తొలగిస్తే, దోవలోకి వస్తాడేమోనన్న ఆశ ఆయ నది. ఈ కిశోర్‌ని ఇలాగే వదిలేస్తే మరింతగా నాశనమైపోతాడే మోననే భయం.

"మీ ఇంట్లో నీ సంగతి ఎవరికీ తెలియదా? " మళ్లీ అడిగాడు.

"మా నాన్న జేబులోనుంచి వంద రూపాయలు తీశాను" తలవంచు కుని చెప్పాడు కిశోర్. చెప్పక తప్పని పరిస్థితి.

"మీ నాన్నకు తెలుసా? "

"....... "

"నిన్నే అడిగేది చెప్పు."

"తెలుసు"

"ఎన్నిసార్లు తీశావు"

"చాలా సార్లు తీశాను"

"అలా ఇంట్లో ఎవరికీ చెప్పకుండా దొంగతనం చెయ్యటం తప్పుడు పని అని తెలియదా? "

మాట్లాడలేదు.

"మరి మీ నాన్న ఏమీ అనలేదా నిన్ను? "

"మా నాన్న అడిగేవారు. నేను తీశానని అమ్మకీ తెలుసు. కానీ

మా నాన్నతో పోట్లాడి నన్ను ఏమీ అనేది కాదు. మా అమ్మకి నేనంటే చాలా ఇష్టం. చెల్లెలంటే ఇష్టం లేదు" గొప్పగానే చెప్పాడు.

"ఎందుకని? "

"ఏమో! అది అమ్మాయి అని. మొన్న నేను మా నాన్న జేబులో నుంచి వంద రూపాయలు తీస్తుంటే మా చెల్లెలు చూసి మా నాన్నకి చెప్పింది. నాన్న నన్ను కొట్టారు. అప్పుడు మా అమ్మ నాన్నతో పోట్లాడింది నన్ను కొట్టినందుకు. నాన్నకి చెప్పినందుకు మా చెల్లెల్ని కొట్టింది. ఆ రోజు నాన్న అన్నం తినకుండా ఆఫీసుకి వెళ్లిపోయారు" టూకీగా తన ఇంటి సంగతి చెప్పాడు. 'అదన్నమాట కిశోర్ ఇంటి పరిస్థితి! కిశోర్ ఇంట్లోనుంచీ, తండ్రి జేబులో నుంచీ చెప్పకుండా డబ్బులు ఎత్తుకువస్తున్నాడు. దానికి తల్లి సపోర్టు చేస్తోంది. 'చిన్నపిల్లవాడు పెద్దవాడయితే మానేస్తాడు' అనే ధోరణి కిశోర్ తల్లిది.

రెండు, మూడు నిముషాల తరువాత " దొంగతనం చేసినందుకు మీ నాన్న నిన్ను కొట్టారు కదా, మరి మళ్లీ సుధాకర్, మోహన్ జేబుల్లోనుంచి ఎందుకు దొంగతనం చేశావు? మీ నాన్న కొట్టినందుకు నీకు సిగ్గుగా లేదూ? '" అడిగాడు.

మాట్లాడలేదు కిశోర్.

"మాట్లాడాలి కిశోర్! నేను నీకు ఇప్పుడు మాస్టార్ని కాదు. నన్ను ఒక ఫ్రెండుగా అనుకో చెప్పు. వీలైతే నేను నీకు సహాయం చేస్తాను" అన్నారు కాస్త ప్రేమగా.

". . ."

"దొంగతనం తప్పుడు పని అని తెలుసా? "

"తెలుసు"

"మరెందుకు చేస్తున్నావు? ఇంట్లో చేసినా, బయట చేసినా అది దొంగతనమే కదా!"

"రమేష్, రాజూ, రంగా చెయ్యమంటారు. ఎప్పుడూ డబ్బులు తీసుకురా! మీ నాన్నని అడుగు. ఇవ్వకపోతే ఆయన జేబులోనుంచి తీసుకో, ఫరవాలేదు. మీ నాన్నేగా! మీ ఇంట్లోనే కదా అంటారు. నేను అలాగే చేస్తాను. మా అమ్మ నన్నేమీ అనదు. మా నాన్నకి తెలియదనుకున్నాను. కాని తెలిసిపోయింది. ఇప్పుడు నేను తెచ్చే డబ్బులు చాలటం లేదంటున్నారు రమేష్ వాళ్లు.

నాన్న నా సంగతి తెలుసుకున్నాక ఆయన జేబులో అసలు డబ్బులు ఉండటం లేదు. ఒక వేళ తీసినా కొడుతున్నారని చెప్పాను.

అందుకని సుధాకర్, మోహన్‌ల దగ్గర డబ్బులు చాలా వుంటాయి. దొంగిలించమన్నారు. నీకు మేము కూడా సహాయం చేస్తాం అన్నారు. డబ్బులుంటే, బాగా ఎంజాయ్ చెయ్యొచ్చు అంటున్నార"ని కిశోర్ భయం భయంగానే విషయమంతా చెప్పాడు.

**మా అమ్మ నాన్నతో పోట్లాడింది నన్ను కొట్టినందుకు. నాన్నకి చెప్పినందుకు మా చెల్లెల్ని కొట్టింది. ఆ రోజు నాన్న అన్నం తినకుండా ఆఫీసుకి వెళ్లిపోయారు**

"అంటే దొంగతనం చెయ్యటం నీకు వాళ్లు నేర్పుతున్నారు అవునా? "

మాట్లాడలేదు కిశోర్.

"ఇంట్లో నువ్వు దొంగతనం చేసినా, మీ అమ్మ సపోర్టు వుందనే ధైర్యం నీకుంది. నీ చేతిలో డబ్బులుంటున్నాయి కనుక సిని మాలకీ, షికార్లకీ, తిరుగుతున్నావు. సిగరెట్లు తాగుతున్నావు. డబ్బు లుంటే బాగా జల్సా చేయొచ్చు కనుక నీకూ బాగానే ఉంది. అవునా? "

"..." మౌనమే అంగీకారమన్నట్టుగా తల వంచుకుని కూర్చున్నాడు కిశోర్.

"సరే... కిశోర్! నీ స్నేహితులు నీకు దొంగతనం నేర్పుతున్నారు, దొంగతనాలు చెయ్యమంటున్నారు. నీచేత డబ్బులు తెప్పించుకుని, వాళ్లూ హాయిగా, ఆనందంగా ఎంజాయ్ చేస్తున్నారు. వాళ్లతో పాటూ నువ్వూ ఎంజాయ్ చేస్తున్నావు.

నువ్వు దొంగతనం చేసి, పట్టుబడితే మాత్రం వాళ్లు తెలివిగా ఆ దొంగతనమంతా నీ మీద తోసేసి, వాళ్లు తప్పించుకుంటున్నారు. అదే కదూ జరుగుతోంది? "

'అవును' అనలేక ఆయన వంక భయంగా చూశాడు.

"సరే కిశోర్! ఒక్కమాట చెబుతాను బాగా విను."

"నీ స్నేహితులు నిన్ను ఇంట్లోనూ, బయట కూడా దొంగతనం చెయ్యమంటున్నారు. నువ్వు చేస్తున్నావు. ఇంట్లో దొంగతనం చేస్తున్నావని తెలిసి మీ నాన్న నిన్ను కొట్టారు. కోప్పడ్డారు. అయినా నీకు లెక్కలేదు. మీ అమ్మ నిన్ను ఏమీ అనటం లేదు, మందలించటం లేదు. ఆ ధైర్యం ఉంది నీకు.

నీ స్నేహితులు రమేష్, రాజూ, రంగా మంచి స్నేహితులు! మీ అమ్మ చాలా మంచివారు నీ లెక్కలో! మరి దొంగతనం కేసులో, పోలీసులు నిన్ను పట్టుకుంటే నీతో పాటు వాళ్లు కూడా నీ కోసం జైలుకి వస్తారా? నీతోపాటు, వాళ్లూ లాఠీ దెబ్బలు తింటారా? నీతోపాటు మీ అమ్మ జైల్లో ఉంటుందా? నీతోపాటు నీ స్నేహితులు రాజూ, రమేష్, రంగా ఇంకా ఇలా నిన్ను ప్రోత్సహించే నీ మిత్రులు జువెనైల్ స్కూల్లో వుంటారా? ఎందుకంటే దొంగతనం చెయ్యటం ఎంత నేరమో, ఆ దొంగతనాన్ని ప్రోత్సహించటం కూడా అంతకంటే పెద్ద నేరం! అలా ప్రోత్సహించిన వాళ్లు... తల్లయినా సరే, స్నేహితులైనా సరే దొంగతనం చేసిన దొంగతో పాటు వాళ్లూ శిక్షార్హులే. ఎందుకంటే నువ్వు దొంగతనం చేసి తెచ్చిన డబ్బుని వాళ్లూ పంచుకుంటున్నారు గనుక నిన్ను పోలీసులు పట్టుకుంటే నీతో పాటు శిక్షనీ వాళ్లు పంచుకోవాలి కదా! ఈ మాట వాళ్లని ఎప్పుడైన అడిగావా? " 'దొంగతనం', 'దొంగ' అనే మాటలు వత్తిపలుకుతూ అన్నారు శంకరంగారు.




ఆయన మాటలూ, ప్రశ్నలూ భయపెట్టాయి. భయంగా చూశాడు ఆయన వంక. తన మాటల్ని వింటున్న కిశోర్ ముఖంలోని భావాలు మారటం. వాడిముఖంలో కొద్దిగా ఆందోళన తొంగిచూడడం గ్రహించారు శంకరంగారు.

"అవునురా కిశోర్! నీ స్నేహితుల కోసం నువ్వు దొంగతనం నేర్చుకుని, దొంగతనం చేసిన డబ్బు తెచ్చి ఇస్తున్నావు, వాళ్లతో పాటు నువ్వు కూడా నీ దృష్టిలో ఎంజాయ్ చేస్తున్నావు, బాగానే వుంది. మరి నువ్వు ఇంత చేస్తున్నప్పుడు పోలీసులు పట్టుకున్నప్పుడు, అవసరమైతే వాళ్లు నీ కోసం జైలుకి

వెళ్తారా? జువెనైల్ స్కూల్లో నీతో పాటు వుంటారా? పోలీసులు కొట్టే దెబ్బలు నీతో పాటు వాళ్లూ తింటారా? వాళ్లు నీ మంచి స్నేహితులు కదా!" ఈ విషయాన్నే మళ్లీ మళ్లీ అడుగుతూనే ఉన్నారు శంకరం. కిశోర్ ఆలోచనల్లో మార్పు రావాలని ఆయన తాపత్రయం! ఆలోచనలో పడ్డాడు కిశోర్.

"ఏం కిశోర్?"

"లేదు" అన్నట్టుగా బుర్ర అడ్డంగా ఊపాడు.

"మరి?"

మాట్లాడలేదు కిశోర్.

"నువ్వు ఈ సంగతి ఆలోచించు కిశోర్! నీ స్నేహితుల్ని అడుగు. ధైర్యం తెచ్చుకుని, మీ అమ్మగారిని కూడా అడుగు. వాళ్లు ఏం జవాబు చెబుతారో విను."

కిశోర్ ఆలోచిస్తున్నాడు. రంగాగానీ, రమేష్‌గానీ, రాజుగానీ ఎవరి జేబులోనుంచైనా పర్సులు దొంగతనం చేస్తే, అది వాళ్లకి తెలిసి పట్టుకోవటానికి వస్తే ఆ పర్సు తన మీద పడేసి ముగ్గురూ పారిపోయేవారు. వాళ్లు దొంగతనం చేసిన పర్సులు తన దగ్గర చూసి, దొంగ అనుకుని తనని కొట్టేవారు. తను దొంగతనం చేస్తే ఎవరైనా పట్టుకోవటానికి వస్తే అప్పుడూ పారిపోయేవాళ్లు.

"ఎందుకు అలా పారిపోతారు మీరు?" అని అడిగాడు తను.

"పారిపోక పోలీసులకి దొరికిపొమ్మంటావా?" అన్నాడు రంగా. "మరి నన్ను పోలీసులు పట్టుకుంటే మీరేమీ సహాయం చెయ్యరా?"

"నిన్ను పోలీసులు పట్టుకుంటే అది నీ ఖర్మ! ఆ సమయంలో మేము నీకు సహాయం చేస్తే మేము కూడా పట్టుబడిపోతాం. మాకేం ఖర్మరా! అయినా ఈ విషయంలో, ఎవరి తెలివితేటలు వాళ్లవి. తప్పించుకున్నవాడు అదృష్టవంతుడు" అన్నాడు రాజు. కిశోర్‌కి అన్నీ గుర్తుకు వస్తున్నాయి.

ఒకసారి ఇంట్లో నాన్న అమ్మతో అంటూ వుంటే విన్నాడు. "కిశోర్ ఇవ్వాళ నా జేబులో డబ్బు దొంగతనం చేసి, నీ సపోర్టుతో తప్పించుకుంటున్నాడు. రేపు ఇదే అలవాటై, బయట దొంగతనం చేసి, పోలీసులకి పట్టుబడితే వాడితో పాటు నువ్వూ జువెనైల్ కూర్చుంటావా? ఆ తరువాత, వాడిని 'జువెనైల్ స్కూల్లో' వేసి, దొంగ అనే ముద్ర వేసినప్పుడు నువ్వు ఎంత ఏడ్చినా ప్రయోజనం ఉండదు." అన్నాడు నాన్న.

"మీకు ప్రతీదీ రాద్ధాంతం చెయ్యటం అలవాటు. వాడితో పాటు పోలీస్‌స్టేషన్‌కి వెళ్లటానికి నాకేం ఖర్మ! ఏదో చిన్నతనం! వాణ్ని పోలీసులేమీ పట్టుకోరు. అలా పట్టుకునేలా వాడు చెయ్యడు. ఒక వేళ పోలీసులు పట్టుకుంటే వాడి ఖర్మ! ఏం చేస్తాను గనుక" అన్న తల్లిమాటలు గుర్తు వచ్చాయి. అప్పట్లో ఆ మాటలు తను విన్నా లెక్క చెయ్యలేదు. ఇంట్లో నాన్న అంటే కొద్దిగా భయం. ఆయన ఒకటి, రెండుసార్లు తనని కొట్టారుగానీ ఈ శంకరం మాష్టారిలా ఒక్కమాట కూడా చెప్పలేదు. ఇంక అమ్మ! తనంటే వున్న గారాబంతో, తను చేసే చెడు పనిని కూడా సమర్థించింది. అంతే!




ఇవ్వాళ మాష్టారి మాటలు వింటూ వుంటే తన ఆలోచనలు ఎటో వెళ్ళి పోతున్నాయి.

"చూడు కిశోర్!"

మాష్టారి పిలుపుకి ఉలిక్కిపడ్డాడు.

## ఇది రెడ్డిరాజుల కాలమే కదా?



కట్టమంచి ఆంధ్రావర్సిటీ వీసీగా చేసేరోజుల్లో ఒకప్పటి ఆంధ్రరాచ వంశాల ఔన్నత్యం నేటి విద్యార్థులకు తెలిసేలా 'కాకతీయ', 'చాణక్య' అంటూ ఆయా ద్వారాలకు రకరకాల పేర్లు పెట్టించారు.

అది గమనించిన ఓ మిత్రుడు 'అయ్యా.. అన్నివంశాల పేర్లూ పెట్టించారు మరి రెడ్డిరాజుల పేరేది? ' అని అడిగాడు.

'పేర్లు పెట్టింది అంతరించిన రాచవంశాల వారివయ్యా... ఆ మాత్రం తెలీదూ? ' అన్నారు ముసిముసి నవ్వులతో సీఆర్.

తాను రెడ్డి.. పెత్తనమంతా తనదే అయినప్పుడు ఇంకా ద్వారానికి ప్రత్యేకంగా (రెడ్డిరాజుల)పేరెందుకని ఆయన ఉద్దేశం. విషయం అర్థమైన మిత్రుడూ నవ్వాడు.

"భయపడకు, నువ్వు చాలా మంచి వాడివి, తెలివైన వాడివి. నీ స్నేహితులు గానీ, మరెవరైనా గానీ చెడుపనులు చేయమని చెబితే చెయ్యటమేనా? మనం కూడా ఆలోచించాలి కదా! నువ్వు స్కూలుకి వచ్చేది చదువుకోవటానికి. మంచి ప్రవర్తన నేర్చుకోవటానికి. చెడు పనులు చెయ్యటానికి కాదు, దొంగతనాలు, చెయ్యటానికీ కాదు. నిన్ను చెడ్డపనులు చెయ్యమని ప్రోత్సహించేవాళ్లూ, దొంగతనాలు చెయ్యమని ప్రోత్సహించేవాళ్లూ నీకు అసలు స్నేహితులే కారు. అసలు స్నేహితులంటే మన మంచి కోరేవాళ్ళు మాత్రమే. నువ్వు బాగా చదువుకుంటే గొప్పవాడివవుతావు. ఇలాంటి తప్పుడు పనులు చేస్తే చెడ్డవాడివవుతావు. ఏది చేసినా దాని ప్రభావం నీ మీద మాత్రమే ఉంటుంది. ఇలాగే చెడు పనులు చేశావనుకో! నీ భవిష్యత్తంతా పాడైపోతుంది. మంచి పనులు చేస్తే నీ భవిష్యత్తంతా ఎంతో గొప్పగా వుంటుంది. నువ్వు ఏ పని చేసినా మంచి గానీ, చెడు గానీ, దాని ప్రభావం నీకు మాత్రమే నీ జీవితం మీద మాత్రమే వుంటుంది. జాగ్రత్త! ఆలోచించుకో నువ్వు కూడా! ఎటువంటి ఫలితమైనా నువ్వొక్కడివే అనుభవించాలి."

మాట్లాడలేదు కిశోర్.

కిశోర్ నుంచి ఎటువంటి సమాధానం కూడా ఆయన ఆశించలేదు.

"చీకటి పడింది. పద...వెళ్దాం." అని లేచారు శంకరంగారు.

* * *

ఆ తరువాత, కిశోర్ తల్లిదండ్రులతో మాట్లాడాలని చాలాసార్లు కబురు చేశారు శంకరంగారు.

పదిసార్లు కబురు చేశాకగానీ కిశోర్ తల్లీ, తండ్రీ రాలేదు.

అన్ని సార్లు కబురు చేసిన తరువాత ఎంతో కష్టంగా వచ్చిన కిశోర్ తల్లిదండ్రుల పద్ధతికి ఆయనకి ఆశ్చర్యం వేసింది.

శంకరం కాంతారావును పంకజంను కూర్చోపెట్టి కిశోర్ గురించి మాట్లాడారు. భార్య పక్కన వుండటంతో, కాంతారావుకి ఎక్కువగా మాట్లాడే ధైర్యం లేకపోయింది.

కిశోర్‌ని గురించి వివరంగా చెప్పి, "జాగ్రత్తపడండి! లేకపోతే పిల్లవాడు అనవసరంగా పాడైపోతాడు" అన్నారు.

వింటూ కూర్చున్నాడు కాంతారావు.

కిశోర్ తల్లి పంకజానికి కోపం వచ్చింది

"మీరెవరండీ! మా కిషోర్‌ని గురించి చెప్ప టానికి? అందరి టీచర్లతోపాటు మీరూ ఒకరు, ఏ విషయమైనా చెబితే స్కూలు ప్రిన్స్‌పాల్ చెప్పాలి... అయినా అనవస రంగా ఇలా మా అబ్బాయి మీద లేనిపోని నిందలు వేయటం మర్యాద కాదు." గయ్యి మంది.

"చూడండీ! ఈ విషయం ఇంకా ప్రిన్స్‌పా ల్‌గారి వరకూ వెళ్లలేదు. దీన్ని పెద్ద వి షయం చెయ్యటం నాకు ఇష్టం లేదు. అన వసరంగా కిశోర్ మీద చెడు ప్రచారం చెయ్యటం మంచిది కాదు. అది వాడి భవి ష్యత్తుకీ మంచిది కాదు. నేను కిశోర్ క్లాస్ టీచర్‌ని. ఆ బాధ్యతతోనే మీకు చెబుతు న్నాను. మీరు కిశోర్‌ని మందలించి, సరైన దోవలో పెట్టకపోతే, 'తోటకూర నాడే ఎందుకు చెప్పలేదమ్మా?' అని రేపు మీ అబ్బాయి మిమ్మల్ని అడిగే పరిస్థితి వస్తుంది" అన్నారు శంకరంగారు.

మాట్లాడకుండా లేచి వెళ్లిపోయారు ఇద్దరూ. తమ కొడుకుమీద ఆ తల్లిదండ్రు లకున్న నిర్లక్ష్య ధోరణికి ఆశ్చర్యం వేసింది, బాధా కలిగింది ఆయనకు.

సంవత్సరం చివరికి వచ్చింది. తొమ్మిదో తరగతి పరీక్షలయిపోయాయి. వేసవి సెల వులు ఇచ్చారు. శంకరం మాష్టారికి వరం గల్లు నుంచి ట్రాన్స్‌ఫర్ అయింది. ఆయన అక్కడినుంచి కొత్తచోటుకి వెళ్లిపోయారు.




అత్తెసరు మార్కులతో తొమ్మిదవ క్లాసు పాసై పదవక్లాసులోకి వచ్చాడు కిశోర్.

స్కూల్లో శంకరం మాష్టారు లేరు. ఆయ నకి ట్రాన్స్‌ఫర్ అయిపోయింది. వెళ్లిపో యారని తెలిసింది.

ఆయన స్కూల్లో లేకపోవటం బెంగగా అనిపించింది కిశోర్‌కి. ఆ రోజు శంకరం గారు చెప్పిన మాటలు ఇంకా వాడి బుర్రలో తిరుగుతూనే ఉన్నాయి. ఒకసారి, రెండు సార్లు తండ్రి జేబులోనుంచి డబ్బులు తియ్యటానికి ప్రయత్నించాడు. ఆఖరి నిము షంలో మాష్టారి మాటలూ, మాష్టారి రూపమూ కళ్ల ముందు మెదిలింది.

"నువ్వు దొంగ అని ముద్ర వేయించుకో వటం నీకు ఇష్టమేనా? నువ్వు ఇలాంటివా డివని నలుగురికీ తెలిస్తే ఇంక నీ జీవి తంలో నిన్నెవ్వరూ నమ్మరు. నువ్వు ఏ చె డు పని చేసినా ఫలితం నువ్వు మాత్రమే అనుభవించాలి. చుట్టుప్రక్కల వారి మీద నీ చెడ్డ పనుల ప్రభావం తాత్కాలికంగా ఉ న్నా తరువాత వాళ్లు జాగ్రత్తపడతారు. కానీ నువ్వు మాత్రం నిన్ను నువ్వే చెడగొట్టుకున్న వాడివి అవుతావు. నాశనమయిపోయేది నువ్వు మాత్రమే! అప్పుడు నీకు ఎవ్వరూ ఏ రకమైన సహాయమూ చెయ్యరు. నీకోసం మాత్రమే- కేవలం నీకోసం మాత్రమే నిన్ను నువ్వు సరిచేసుకోవాలి!" రకరకాలుగా మాష్టారు చెప్పిన మాటలు గుర్తొస్తూనే ఉన్నాయి.

రాజూ, రమేష్, రంగా కిశోర్‌తో కలు స్తూనే ఉన్నారు. కాస్త జాగ్రత్తపడి మెల్లగా వాళ్లనుంచి తప్పించుకుంటున్నాడు. ఎలాగో కష్టపడి సెకండ్ క్లాసులో పదో తరగతి పాసయ్యాడు కిశోర్.

కాంతారావుకి ఆ ఊరు నుంచి ట్రాన్స్‌ఫర్ అయింది. కిశోర్‌ని హాస్టల్లో ఉంచి, చది విస్తే మంచిదనుకున్నాడు. విజయవాడలో ఒక ప్రయివేటు కాలేజీలో, హాస్టల్లో చేర్పిం చాడు. ఇప్పటినుంచే కొడుకుని దూరం చేస్తున్నాడని కాంతారావుమీద విరుచుకుప డింది పంకజం. కానీ కాంతారావు భార్య

# చతుర భాషితాలు

మూర్ఖుల వల్ల వివేకులకు లాభమే. మూర్ఖులు చేసే తప్పులు తాము చేయకుండా వారు జాగ్రత్త పడతారు.

-మార్కస్ కేటో

పలుకుబడి అద్దం లాంటిది. ఒకసారి పగిలితే అది మళ్ళీ ఉపయోగించదు.

-స్కాట్

అధికారంలోని కష్టం అధికారంలో ఉన్నవారినడుగు. అధికారంలో ఉండే సుఖం దాని కోసం అర్రులు సాచేవారినడుగు.

-కాలెబ్ కొల్టన్

ముందుగా వాస్తవాలను పొందుపరచుకో. అప్పుడు నీ చిత్తం వచ్చినట్లు వాటికి రూపం కల్పించుకో.

-మార్క్ ట్వైన్

పరులను జయించినవాడు విజేత. తనను తాను జయించిన వాడు మహావిజేత

-లావోట్సే

జీవితంలో ధ్యేయాలు రెండు. ఒకటి కోరుకున్నది సాధించడం. రెండు సాధించినది అనుభవించడం.

-పీర్సాల్ స్మిత్

నిజమైన స్నేహం నిలువవున్న సొమ్ములాంటిది

-ఎల్బర్ట్ హెబ్బర్

ఇతరులను శాంతింపజేసే నాలుకతో ఎల్లప్పుడు మాట్లాడు. అది నిన్ను కూడా నెమ్మది పరుస్తుంది.

-కబీర్

తగవులాడుకుంటున్న ఇద్దరు వ్యక్తులు ఆత్మ నిగ్రహాన్ని కోల్పోయి నట్లయితే ఇద్దరిది తప్పేనని అర్థం.

-లియోటాల్‌స్టాయ్

మాటలని లెక్క చెయ్యలేదు. ఇంట్లో తల్లి గారాబం ఎక్కువైంది. అందుకే కాంతారావు ఆ నిర్ణయం తీసుకున్నాడు. జ్యోతి మాత్రం వాళ్ల దగ్గరే ఉండి చదువుకుంటోంది.

కిశోర్‌కి ఆ ఊరు కొత్త. కాలేజీ కొత్త. హాస్టలు వాతావరణం కొత్త! అంతకంటే ఇంటికి దూరమయ్యాననే బెంగ కొంత! హాస్టలు గదిలో తనతోపాటు ఇంకా ఇద్దరు పిల్లలు ఉన్నారు. వాళ్లిద్దరూ- రవీంద్ర, రమణ - పల్లెటూరి నుంచి వచ్చినవాళ్లు

ఆ హాస్టల్ నిబంధనలూ, పద్ధతులూ, క్రమశిక్షణా కఠినంగానే ఉన్నాయి. పిల్లలం దరూ తెల్లవారుఝామున నాలుగున్నర, అయిదుగంటల లోపలే నిద్ర లేవాలి. ముఖం కడుక్కుని, నిద్రమత్తు వదిలించు కుని, చదువుకోవటానికి కూర్చోవాలి. వార్డెన్ కూడా స్ట్రిక్ట్‌గా, పిల్లలు క్రమశిక్షణతో ఉండటమే ధ్యేయంగా ఉన్నాడు.

తెల్లవారుఝామున లేవడమంటే కిశోర్‌కి మొదట్లో కష్టంగా ఉండేది. కానీ తప్పని పరిస్థితి. పల్లెటూరి నుంచి వచ్చిన రమణ, రవీంద్ర కొంచెం త్వరగానే ఈ పద్ధతిని అల వాటు చేసుకుంటున్నారు. ఆ సమయంలో నిద్రలేవటం, తప్పనిసరిగా చదువుకోవటా నికి కూర్చోవటం కిశోర్‌కి మాత్రం చాలా కష్టంగానే ఉంది. అప్పటివరకూ ఇంటి దగ్గర తన ఇష్టాన్ని సాగించుకున్నాడు. ఇప్పుడు ఒక్కసారిగా ఇంత క్రమశిక్షణ పాటించాలంటే చాలా కష్టంగా ఉంది.

అన్నీ టైముకి జరిగిపోవాలి. ఉదయం నిద్ర లేవటం నుంచీ స్నానాలూ, టిఫిన్లూ, మధ్యాహ్నం భోజనాలూ, సాయంత్రం తిన టానికి కొంత సమయం, ఆటలూ- ఆ తరు వాత మళ్లీ స్నానాలూ వగైరా. తర్వాత రాత్రి ఎనిమిది గంటలకే భోజనాలు. పద కొండు గంటల వరకూ తప్పనిసరిగా చదువు.

మెల్ల మెల్లగా కాలేజీ వాతావరణానికి, హాస్టల్ వాతావరణానికీ అలవాటుపడుతు న్నాడు కిశోర్. మధ్య మధ్యలో అమ్మా, నాన్నా, చెల్లెలూ, గుర్తొస్తున్నారు.

ఇంటిమీద బెంగ లాంటిది కలుగుతోంది. కానీ కుదరదు. అస్తమానం ఇంటికి వెళ్తా నంటే ఒప్పుకోరు.

క్లాసులయిపోయాయి. కాలేజీ గ్రౌండులో కాసేపు ఫుట్‌బాల్ ఆడి తన గదికి వచ్చాడు కిశోర్. కాస్త అలసటగా ఉంది. చెమటగా ఉంది. స్నానం చేసి వచ్చాడు.

అప్పటికే రూమ్మేట్స్ రమణ, రవీంద్ర పుస్తకాలు ముందేసుకుని కూర్చున్నారు.

సాయంత్రం ఏడు గంటలయింది. ఎక్క డినుంచో వివిధభారతిలో సైనికులు కోరిన హిందీ పాటలు సన్నగా వినిపిస్తున్నాయి.

చాలా శ్రద్ధగా చదువుకుంటున్నారు రవీంద్ర, రమణ. వాళ్లని చూసి, యాంత్రి కంగా పుస్తకాలు ముందర వేసుకుని కూర్చు న్నాడు. అంత శ్రద్ధ లేదు. చదువు బుర్రకి ఎక్కటం లేదు. ఏమిటోగా ఉంది బుర్ర. వీళ్లు పుస్తకాలు ముందరవేసుకు కూర్చు న్నారు. నిజంగానే చదువుతున్నారా లేక పోతే ఫోజు కొడుతున్నారా....

"ఏమైనా సరే నేను ఈ ఇంటర్‌లో డిస్టిం క్షన్ తెచ్చుకోవాలి. ఎమ్‌సెట్ బాగా రాయాలి. ఇంజినీరింగ్‌లో ఫ్రీ సీటు సంపా దించుకోవాలి. మా అమ్మ కోరిక అది" అన్నాడు రమణ.

"మీ అమ్మ కోరిక సరే మరి మీ నాన్న గారు ఏమంటారు?" అడిగాడు రవీంద్ర.

"ఏమో రవీంద్రా! ఆయన ఉంటే ఏమనే వారో తెలిసేదేమో! నేను పుట్టిన రెండేళ్లకే నాన్న పోయారు. నన్ను బాగా చదివించా లని మా నాన్న కోరికట! నాన్నంటే మా అమ్మకి చాలా ఇష్టం. ఎప్పుడూ ఆయన గురించే చెబుతుంటుంది" అన్నాడు రమణ.

"మీ అమ్మ చదువుకుందా?" అడిగాడు రవీంద్ర.

"టెన్త్‌క్లాసు వరకూ చదివిందిట అంతే- కానీ... మా అమ్మకి చాలా విషయాలు

తెలుసు. మేం పల్లెటూరిలో ఉన్నా, నాన్న లేకపోయినా, ఎక్కువగా డబ్బు లేకపోయినా నన్ను ఎంతో డిసిప్లిన్డ్‌గా పెంచింది.

ఒకసారి మా పక్కవాళ్లింటికి వెళ్లాను. వాళ్ల అల్మారాలో పది రూపాయల నోటు ఉంది. ఎవ్వరూ లేరు అక్కడ. అంతే ఆ నోటు తీసుకు వచ్చేశాను. తరువాత ఆ డబ్బులు చూసి మా అమ్మ ఎక్కడివని అడిగింది. మొదట చెప్పలేదు. మెల్లగా అడిగింది. ఆ తరువాత భయపెట్టింది అప్పుడూ చెప్పలేదు. ఇంక కొట్టింది. అప్పుడు చెప్పాను.

"అంటే దొంగతనం చేశావన్నమాట! నువ్వు దొంగవి" అంటూ బాగా కొట్టింది. ఆ తరువాత కోప్పడింది, మరొక్కసారి నువ్విలా చేస్తే నేనే పోలీసు కంప్లైంటిస్తాను. నా కొడుకువి అని కూడా చూడను" అంది. నన్ను మా పక్కవాళ్లింటికి పంపి, ఆ పది రూపాయల నోటు ఇచ్చేసి జరిగింది చెప్పి, సారీ చెప్పి రమ్మంది. లేకపోతే ఇంట్లోకి రానివ్వన"ని కోప్పడింది. భయం వేసింది. మా అమ్మ చెప్పినట్లే చేశాను.

ఆ తరువాత చాలాసేపు కబుర్లు చెప్పింది. మనిషికి డిసిప్లిన్ చాలా ముఖ్యం. అబద్ధాలు చెప్పటం, దొంగతనాలు చేయటం మంచిది కాదు. చెయ్యకూడదు. పరీక్షలకి బాగా చదివి రాయాలి గానీ కాపీలు కొట్టకూడదు. మనం కష్టపడి చదవాలి, కష్టపడి సంపాదించుకోవాలి న్యాయంగా. నీకు వీలైతే మరొకరికి సహాయం చెయ్యాలి. ఇదంతా ఎవరికోసమో కాదు నీకోసమే. అంతేగానీ ఇలాంటి దొంగపనులూ, చెడుపనులూ జీవితంలో మరెప్పుడూ చెయ్యకూడదు అని చాలా సీరియస్‌గా చెప్పింది.

అంతే! ఆ మాటలన్నీ నా బుర్రలోకి ఎక్కాయి. స్కూల్లో మా క్లాస్ టీచర్ జానకి మేడమ్ అని ఉంది. ఆవిడ చాలామంచి టీచర్. పాఠాలు బాగా చెప్పేవారు. వాటితో పాటు ఎన్నో విషయాలు జనరల్ నాలెడ్జ్, మోరల్ సైన్సు బాగా చెప్పేవారు. ఆవిడంటే నాకు చాలా ఇష్టం. ఇంటి దగ్గర అమ్మ కూడా మా జానకి మేడమ్ లాగానే ఎన్నో విషయాలు చెబుతుంది. పేపరు చూడటం మంచి మంచి పుస్తకాలు చదవటం అలవాటు చేసింది మా అమ్మే. అసలు తల్లి మొదటి గురువు అంటారు. అమ్మలు ఎన్నో విషయాలు చెబుతారు. మనమే సరిగ్గా వినిపించుకోం.

"అవును రమణా నువ్వు చెప్పింది నిజమే. ఇంటి దగ్గర అమ్మలూ, నాన్నలూ మనకెన్నో చెబుతారు. మనమే ఆ మాటలు వినం" అన్నాడు రవీంద్ర.

"మరి నువ్వేమనుకుంటున్నావు? ఏం చదువుతావు" అడిగాడు రమణ.

"నేనా? " నవ్వాడు.

"నవ్వుతావేమిటి? ఏదో ఒక అయిడియా ఉంటుందిగా!"

"ఉంది. నాకు పిల్లలకి పాఠాలు చెప్పటమంటే చాలా ఇష్టం. అందులో ఇంగ్లీషు సబ్జెక్ట్ అంటే ఇష్టం. ఆ కోరికతోనే కష్టపడి బాగా చదివి, యూనివర్సిటీలో ఇంగ్లీషు ప్రొఫెసర్‌నవ్వాలని కోరిక. అదికాకపోతే - కాలేజీలో ఇంగ్లీషు లెక్చరర్ అవ్వాలని వుంది. అదీ కాకపోతే - హైస్కూల్లో ఇంగ్లీషు టీచర్‌గానైనా చెయ్యాలని కోరిక. చూడాలి మరి"

"మరి మీ అమ్మా, నాన్న దీనికి ఇష్టపడ్డారా? "

"ఇష్టపడ్డారా అంటే అంతగా ఇష్టపడలేదు. చివరికి నీ ఇష్టం! దేన్నికైనా బాగా చదవాలన్నారు" చెప్పాడు రవీంద్ర.

వీరి మాటలన్నీ వింటున్నాడు కిశోర్. అతడిలో ఎందుకో తప్పుచేసిన భావన! వాళ్లిద్దరిలా తను మనసు విప్పి హాయిగా మాట్లాడలేకపోతున్నాడు. తనలోతనే ముడుచుకు పోయి వాళ్లకి కనిపించకుండా వుంటే ఎంత బాగుండు!' అన్న భావన!



ఎంత అల్లరి చేశాడు! ఎంత మొండిగా వుండేవాడు! ఎన్నెన్ని తప్పుడు పనులు, దొంగతనాలు చేసేవాడు! నాన్నని ఎంతెంత విసిగించేవాడు!

అప్పటి తన స్నేహితులు రాజూ, రమేష్, రంగా ఎటువంటి వారు! ఎలాంటి పనులు నేర్పారు!

ఇప్పుడు ఈ రమణ, రవీంద్ర కూడా స్నేహితులే. కొత్తగా కలిసిన స్నేహితులు. కలిసి ఒకే గదిలో వుంటున్నారు. కానీ వీళ్ల మాటలూ, వీళ్ల ప్రవర్తనా తనకి కొత్తగా ఉంది. తన ఆలోచనల్ని వీళ్ల స్నేహం మారుస్తోందా?

'పాపం, శంకరం మాష్టారు మాత్రం తనకీ, తన స్నేహితులకీ ఎన్నిసార్లు ఎన్ని మంచి మాటలు చెప్పలేదూ! తామే వినిపించుకోలేదు, లెక్కచెయ్యలేదు. అయినా ఆరోజు తనని హోటల్‌కి తీసుకువెళ్లి, కోప్పడకుండా, తిట్టకుండా, అంత బాగా అన్ని విషయాలు చెప్పకపోతే తనింకా చెడు దోవలో పోయేవాడే. ఆరోజు ఆయన చెప్పిన మాటలే తనని ఎక్కువగా ఆలోచించేటట్లు చేశాయి.

తల్లి మొదటి గురువు! అయితే మరి అమ్మ తనకి చెడుపనులు చెయ్యకూడదని ఎందుకు చెప్పలేదు.? ప్చ్! నాన్న చెప్పినా తను వినిపించుకోలేదు. ఆలోచనలతో, పుస్తకంలోని అక్షరాలు బుర్రలోకి ఎక్కటం లేదు కిశోర్‌కి.

రాత్రి డిన్నరు టైము అయింది. ముగ్గురూ వెళ్లి భోజనం చేసి వచ్చి చదువుకోవటానికి కూర్చున్నారు.

* * *

ఎప్పుడు కబుర్లు చెప్పుకున్నా వాళ్ల చిన్నప్పటి కబుర్లు చెప్పుకుంటారు రవీంద్ర, రమణ. వాళ్ల చిన్నప్పటి స్కూలు కబుర్లు, స్కూలు టీచర్ల కబుర్లు, వాళ్లకి తెలియకుండానే వీళ్లు పెట్టిన 'నిక్ నేమ్స్', వాళ్లు క్లాసులో పాఠాలు చెప్పిన పద్ధతుల్ని సరదాగా అనుకరించటం, వాళ్లని గురించి

చెప్పుకుని నవ్వుకుంటూ వుంటారు. వాళ్ల ఇళ్లల్లో అమ్మా, నాన్నా వాళ్లని కోప్పడే తీరూ, వాళ్ల నేర్పిన భయభక్తులూ, ఇష్టాయిష్టాలూ, ప్రేమలూ, గారాబాలూ ఇలా ఎన్నో విషయాలు కబుర్లు చెప్పుకుంటూ ఉంటారు. వాళ్ల కబుర్లు వింటూ ఉంటే ఎంతో సరదాగా అనిపిస్తుంది కిశోర్‌కి.

"నువ్వు ఏ ప్రొఫెసర్‌వో, లెక్చరర్‌వో, లేకపోతే స్కూలు టీచర్‌వో అయ్యావనుకో రవీంద్రా! నీకు కూడా నీ శిష్యులు బోలెడు 'నిక్‌నేమ్స్' పెడతారు. మరి ఇప్పటి నుంచే జాగ్రత్తగా వుండు" అన్నాడు రమణ.

"జాగ్రత్తగా వుండటం కాదు రమణా! సిద్ధపడాలి... మనం మన గురువుగార్లకి బిరుదులు ఇచ్చినట్లే నేనూ స్వీకరించాలిగా మరి!" నవ్వాడు రవీంద్ర.

వాళ్ల మాటలకి ఎక్కువగా శ్రోతలాగానే వుండిపోతాడు కిశోర్. తన గురించి చెప్పుకోవటానికి ఏముంది గనుక? బాల్యం అందమైంది అంటారు. అందమైన బాల్యాన్ని తను పాడుచేసుకున్నాడు. ప్రతి క్లాసూ తప్పలేక ఏదో అత్తెసరు మార్కులతో పాసు కావడం తప్ప, తను శ్రద్ధగా చదివింది ఎప్పుడు?

అమ్మ గారాబం తప్ప మరొక మాట లేదు. నాన్న తిట్లు, భయం తప్ప తనకి ఇంకొకటి తెలియదు. అవును మరి! తను చేసే పనులకి తండ్రి తిట్టక, కొట్టక ఏంచేస్తాడు గనుక!

పోనీ ఇంటి వాతావరణమా అంటే అమ్మ సాధింపులూ, అమ్మా నాన్నా పోట్లాడుకోవటం, చిరాకుపడి నాన్న ఇంటికి దూరంగా గడపటం. స్కూలుకి వెళితే తన స్నేహితులు కూడా దొంగలే. తనని కూడా దొంగతనానికి ప్రోత్సహించేవారే. తండ్రి మీద చిరాకు, ఇంటి వాతావరణం నచ్చక, తనూ మొండిగానే ప్రవర్తించేవాడు. ఇవి తప్ప తన గురించి ఏముంది చెప్పుకోవటానికి.

'ఆనాడు శంకరం మాష్టారు అంతసేపు తనని కూర్చోపెట్టుకుని, తను చేస్తున్న చెడుపనుల గురించి, వాటి ఫలితాల గురించి, తన భవిష్యత్తు గురించీ విపులంగా చెప్పారు. ఆ తరువాత నుంచీ తన ఆలోచనలు కొద్దికొద్దిగా మారాయి. చెడు స్నేహాల్ని వదిలేసి, ఇక నుంచీ జాగ్రత్తగా వుండాలనే నిర్ణయం, భవిష్యత్తులో ఏదైనా చెయ్యాలనే కోరిక.

"మరి కిశోర్! నువ్వేం చదవాలనుకుంటున్నావు? " అడిగాడు రవీంద్ర.

"ఏమో! నేనింకా ఏమీ ఆలోచించలేదు" ముక్తసరిగా అన్నాడు.

"అదేంటి! ఇంటర్ ఫస్ట్ ఇయర్ చదువుతున్నాం మనం. మనం ఏది చదవాలన్నా ఇప్పటి నుంచే నిర్ణయించుకోవాలి కదా! పోనీ కిశోర్! ఇప్పుడు ఆలోచించు. దాని కేమీ ఖర్చు కాదుగా!" నవ్వుతూ అన్నాడు రమణ.

రెండు నిముషాలు ఆలోచించి, "ఏమో రమణా! ఇంజనీరింగ్, మెడిసిన్ కోర్సులు నేను చదవలేను" అన్నాడు కాస్త నిరుత్సాహంగా.

"అలా ఎందుకనుకుంటున్నావు? నాతో పాటు చదువు. బాగా ప్రయత్నం చెయ్యి. వస్తుంది. రాకపోతే అప్పుడు ఆలోచించొచ్చు" కాసేపు మాట్లాడలేదు కిశోర్.

"నేను మొదటి నుంచీ పెద్ద బ్రైటు స్టూడెంటుని కాదు. అత్తెసరు మార్కులతో పాసయ్యాను. టెన్త్ క్లాసు కూడా సెకండ్ క్లాస్ వచ్చింది. ఇవేమీ కాదు. మామూలు డిగ్రీ చేస్తాను. ఆ తరువాత, మిలిటరీలో చేరాలని ఉంది" అన్నాడు.

ఇద్దరికీ ఆశ్చర్యం వేసింది కిశోర్ మాటలకి.

"మిలిటరీలో చేరతావా? చాలా రిస్కు ఉంటుంది. చాలా కష్టం" రవీంద్ర అన్నాడు.

"అయినా ఎందుకలాంటి నిర్ణయం తీసుకుంటున్నావు కిశోర్? మీ ఇంట్లోవాళ్లు ఒప్పుకుంటారా? " రమణ ప్రశ్న.

"నేనివన్నీ ఆలోచించలేదు. నాకు అలా

చెయ్యాలని ఉంది" అన్నాడు నవ్వుతూనే.

"సరేలే. ముందు మనం బాగా చదవాలి. మన పెద్దవాళ్లు మనమీద బోలెడు ఖర్చు పెట్టి, మనల్ని ఇక్కడికి పంపింది బాగా చదువుకోవటానికే" అన్నాడు రమణ.

"నీ ఫిజిక్ బాగానే వుందనుకో! కొంచెం పొడుగ్గానే వున్నావు. చాలా కష్టమైన ఉద్యోగం. చాలా రిస్క్ కూడా వుంది" అని మళ్లీ తనే, "మంచి చదువు చదువుకుని, మంచి ఉద్యోగంలో చేరటం మన కోసమే క దా! మనకి ఆకలేస్తే, అన్నం తింటే మన కడుపే నిండుతుంది. మనని కన్న అమ్మా, నాన్నల కడుపు నిండదు, పక్కవాడి కడుపూ నిండదు. అలాగే మనం చదువుకుంటే మనకే చదువొస్తుంది. మంచి ఉద్యోగం వస్తుంది. కాకపోతే, ఒక్కటి - మనల్ని కన్నందుకు, మనం వాళ్లంతయ్యేంత వరకూ, మనల్ని పెంచి, ప్రయోజకుల్ని చేసినందుకు వాళ్లని మనం చూసుకోవాలి మరి. ఏ విదేశాలకో వెళ్లిపోతే ఏమో! ఏమైనా మన కోసమే మనం చెయ్యాలి" చిన్న జీవిత సత్యాన్ని వివరించాడు రవీంద్ర.

వాళ్ళ మాటలు ఒక రకమైన షాక్‌తోనూ, ఆశ్చర్యంతోనూ వింటున్నాడు కిశోర్.

వీళ్లిద్దరూ ఇలా ఎలా మాట్లాడగలుగుతున్నారు? ఇంత మెచూర్డ్‌గా ఇన్ని మాటలూ, ఆలోచనలూ వీళ్లెలా నేర్చుకున్నారు?

వాళ్ళ అమ్మా,నాన్నా నేర్పించారా? వాళ్ళ స్నేహితులా? లేకపోతే వాళ్ల చదువూ, వాళ్ళ స్కూలు, టీచర్లూనా?

తనంత వయసు ఉన్నవాళ్లే కానీ ఆలోచనల్లో ఎంత తేడా!

ఎక్కడో కాస్త తన అదృష్టం బాగుంది. శంకరం మాష్టారు కారణంగా తనలో మార్పు వచ్చింది. ఇంకా రావాలి అనుకున్నాడు. గతంలో తను ప్రవర్తించిన తీరుకి, కొంత పశ్చాత్తాపం కలిగింది. రూమ్మేట్స్ రమణ, రవీంద్ర, మిగిలిన తన క్లాసు పిల్లలు కొంత మంది ప్రవర్తన, వాళ్ళ ఆలోచనలూ, వాళ్ళ పద్ధతులూ, అలవాట్లూ కిశోర్‌లో మెల్ల మెల్లగా మార్పు తెస్తున్నాయి.

పరీక్షలూ, సెలవులూ, మళ్లీ పరీక్షలూ రెండు సంవత్సరాల కాలం గడిచిపోయింది.

స్నేహితులు ముగ్గురూ విడవలేక విడిపోయారు.

రమణకి ఎమ్‌సెట్‌లో కూడా మంచి ర్యాంకు వచ్చింది. ఫ్రీ సీటు సంపాదించుకున్నాడు. అమ్మ కోరిక తీరింది. అమ్మ కోరిక తీరడమంటే చనిపోయిన నాన్న కోరిక తీరినట్టేనని ఆనందపడిపోయాడు రమణ.

రవీంద్ర ఇంగ్లీషు సబ్జెక్టు తీసుకుని డిగ్రీలో చేరాడు. కిశోర్ సైన్స్ తీసుకుని, బిఎస్సీలో చేరాడు.




డిగ్రీ పూర్తి చేసుకుని ఇంటికి వచ్చేశాడు కిశోర్. "డిగ్రీ చదవటం పూర్తి అయింది. ఇంక ఏం చేస్తావు? ఏదైనా ఉద్యోగం వెతుక్కో! లేకపోతే మళ్ళీ గాడిదలా తిరగటమేగా!" అన్నాడు కాంతారావు.

"ఆర్మీలో చేరాలని ఉంది నాన్నా! చేరుతాను" అన్నాడు.

"ఆర్మీలో చేరతావా? మతి ఉండే మాట్లాడుతున్నావా? " మండిపడ్డాడు కాంతారావు.

కిశోర్ మాటలు విని, పంకజం శోకాలు పెట్టింది. "ఒక్కగా నొక్క కొడుకువి. నిన్ను ఎంత గారాబంగా పెంచాను? ఇప్పుడు ఆ సైన్యంలో చేరతానంటావేమిటి? ఇంక మా గతి ఏం కాను? "

"అమ్మా! అలా బాధపడక్కర లేదు. ఆర్మీలో చేరితే, వచ్చే ప్రమాదమేమీ లేదు.

కష్టమూ లేదు. నువ్వేడవకమ్మా!" బతిమి లాడే ధోరణిలో అన్నాడు.

"అయినా నీకిదేం బుద్ధి? దేశంలో ఇంక ఉద్యోగాలే లేవన్నట్లు ఆ సైన్యంలో చేరటం ఏమిటి? ఎవరు నేర్పారు నీకు ఈ బుద్ధులు? "

తల్లి మాటలకి కాసేపు మాట్లాడలేదు కిశోర్.

"హాస్టల్లో చేర్పించవద్దని ఆనాడే మీ నాన్నకి చెప్పాను. నామాట వింటేగా మహా నుభావుడు! ఇప్పుడు నా కొడుకుని నా నుంచి దూరం చేస్తున్నాడు" శోకాలు పెడు తూనే ఉంది.

సైన్యంలో చేరటం అంటే సినిమాల్లో చూపించే బాంబులూ, తుపాకులూ, గొడ వలూ ఇవే గుర్తుకు వస్తున్నాయి పంకజానికి.

కిశోర్ ఎన్నో రకాలుగా తల్లికి నచ్చచెబు తూనే ఉన్నాడు. కాంతారావూ అందులో చేరవద్దని చెబుతూనే ఉన్నాడు.

కానీ కిశోర్ పట్టుదల వదలలేదు. తన నిర్ణయం మార్చుకోలేదు.

అతడి పట్టుదల, నిర్ణయం తెలిసిన తరు వాత, కాంతరావు ఎక్కువగా మాట్లాడలేదు. ఎందుకు, ఎలా నిర్ణయించుకున్నాడోనని మాత్రం ఆయనకి ఆశ్చర్యంగా ఉండేది.

డిగ్రీ సెకండ్ క్లాసులో పాసయ్యాడు కిశోర్. అతణ్ణి చూస్తూంటే కాంతారావుకి ఆశ్చర్యంగా ఉంది.

అసలు వీడు తన కొడుకేనా! వీడు ఈ మాత్రం చదువుకుంటాడనీ, ఇంత మాత్రం క్రమశిక్షణ వీడికి వస్తుందనీ తను ఎన్నడూ అనుకోలేదు. చిన్నప్పుడు కిశోర్ చేసిన అల్ల రికీ, వాడి చెడు ప్రవర్తనకీ ఇప్పుడు కిశోర్ ఉన్న తీరుకీ ఎక్కడా పోలికే లేదు. తను ఏం చెయ్యాలనుకుంటున్నాడో కూడా నిర్ణ యించుకోగలిగే స్థితికి, అది కూడా మంచి నిర్ణయమే తీసుకునే స్థితికి వచ్చాడు. తల్లికి కూడా, మంచి మాటలతో నచ్చచెప్పటానికే ప్రయత్నిస్తున్నాడు. కారణం ఏదైనాగానీ, ఎవరైనా గానీ కిశోర్‌లో వచ్చిన మార్పుకి కాంతారావుకి ఆనందంగానే ఉంది.

'మిలిటరీలో చేరాలనే కిశోర్ నిర్ణయం



## సూది నొప్పికిక గుడ్‌బై

కొందరు డాక్టరు దగ్గరకు వస్తూనే 'సూది మందు ఇవ్వండి డాక్టర్'అని ఆజ్ఞాపిస్తారు. 'సూదిలోనే ఉన్నది ఆరోగ్యమంతా' అనే టైపు వాళ్లది. కానీ ఇంకొందరు సూది చూస్తేనే పసిపిల్లల కన్నా కనాకష్టంగా ఏడుస్తారు. ముఖం ముడిచేసి, కళ్ళు మూసేసి అష్టావక్రులయిపోతారు. ఒళ్లంతా బిగించేసి గిలటిన్ దెబ్బకు సిద్ధపడ్డవాళ్లలా సూదికి సిద్ధపడతారు. ఇటువంటి వారందరికీ ఓ శుభవార్త. నొప్పి లేకుండా ఇంజెక్షన్ కాటును నిర్వీర్యం చేసే పద్ధతిని డాక్టర్లు కనుగొన్నారు. ఎక్కడయితే సూది గుచ్చాలో ఆ భాగంలో ఓ పది నిమిషాలపాటు బొటన వేలిని ఒత్తి ఉంచాలి. ఇందువల్ల ఆ ప్రాంతంలోని పెద్ద నరాలు రిలాక్సవుతాయి. దాంతో చిన్న నరాలు కూడా సంతృప్తిపడి నొప్పిని చెప్పటం మరిచిపో తాయి. దాంతో ఇంజక్షన్ గుచ్చినా నొప్పి తెలియదు. ఇదీ చిట్కా. ఇంకేం, ఇక 'ఇంజక్షనంటే భయమూ లేదురా, ఎంత పొడిచినా నొప్పి లేదురా' అంటూ పాడుకుంటూ సూది మందుని లెక్కచేయటం మానేద్దాము!

మంచిదే. మంచి డిసిప్లిన్, క్రమశిక్షణ, బాధ్యత, కష్టపడి పని చేయటం, అంకిత భావంలాంటి ఎన్నో మంచి లక్షణాలు వస్తాయి' అనుకున్నాడు.

ఈ విషయంలో పంకజానికి నచ్చచెప్పే ధైర్యం కానీ, శక్తిగానీ లేవు. తను మాత్రం కిశోర్‌ని కేకలెయ్యకుండా ఉంటే బాగుటుం దేమో!

పంకజం శోకాలు కిశోర్‌ని బాధపెడుతు న్నాయి. "నువ్వు ఆ సైన్యంలో చేరితే మా గతేమిటి? మమ్మల్ని ఎవరు చూసుకుం టారు? " అని ఏడుస్తోంది. "అక్కడ ఉంటే నీకు ఏ కాలో, చెయ్యో విరిగితే ఎలా? అసలు నీకు ఇదంతా ఎవరు నూరి పోశారు? " ఇలా రకరకాలుగా శోకాలు పెడుతూనే ఉంది. ఇవన్నీ వింటూ ఉంటే 'అమ్మని తను ఇంత బాధపెట్టాలా! పోనీ మానేస్తే? ' అనిపించింది. కానీ ఆ భావన కొద్దిసేపు ఉండేది. అంతలోనే స్థిరంగా అనుకునేవాడు 'తన నిర్ణయం మార్చుకోకూ డద'ని.

తల్లిని ఎన్నో రకాలుగా బతిమిలాడాడు, నచ్చచెప్పాడు. పంకజం వినిపించుకోలేదు. ఆవిడ ధోరణే ఆవిడది! ఇంక కిశోర్ ఈ విషయం ఇంట్లో మాట్లాడటం మానేశాడు. మౌనంగా ఉన్నాడు.

ఆర్మీ రిక్రూట్‌మెంట్ జరుగుతుంటే వెళ్లాడు. సెలెక్ట్ అయ్యాడు. స్నేహితుడిని చూడటానికి వెళ్తున్నానని చెప్పి, ఇంట్లో నుంచి బయలుదేరి ట్రైనింగ్‌కి వెళ్లాడు.

వెళ్లే ముందు శంకరం మాష్టారుని చూడాలని ఎంతగానో అనిపించింది. ఆయన ఎక్కడ ఉన్నారో వివరంగా తెలియ లేదు. మరోసారి వచ్చినప్పుడైనా మాష్టారుని కలవాలి అనుకున్నాడు.

కిశోర్ ట్రైనింగ్‌కి వెళ్ళిపోతూ తల్లి, తండ్రు లకి ఉత్తరం రాశాడు.

తను ఆర్మీలో చేరానని, తనని గురించి బెంగ పడటం గానీ, బాధ పడే అవసరం గానీ లేదని ధైర్యంగా ఉండమని, తల్లి తండ్రులకి ధైర్యం చెబుతూ వివరంగా ఉత్తరం రాశాడు.

* * *

ఆర్మీలో చేరిన తరువాత అక్కడి జీవితం మరోరకంగా ఉంది. అక్కడి దినచర్య చాలా కఠినంగా, కష్టంగా, శ్రమగా, చాలా స్ట్రిక్ట్‌గా ఉంది. ట్రైనింగ్ సమయంలో, మొదట్లో ఆ శిక్షణకి, అక్కడి అలవాట్లకీ, చాలా కష్టంగా ఉండేది. మనసూ, శరీరమూ కూడా బాధ పడేవి.

ఒక్కొక్కసారి అనిపించేది దీంట్లో ఎందుకు చేరానా? ' అని. ఏడుపు కూడా వచ్చేది ఆ శిక్షణ తట్టుకోలేక.

కానీ తను ఒక్కడే కాదు! తనతో పాటు, తనలాగే శిక్షణ పొందుతున్న వాళ్లు; వాళ్ళ పట్టుదలా, వాళ్లూ పడే కష్టం, చూసి కొంత ఊరట కలిగేది.

దేశం నలుమూలల నుంచి - పంజాబ్, అస్సాం, బెంగాల్, కేరళ, కర్ణాటక ఇలా ఎన్నో రాష్ట్రాల నుంచి వచ్చి చేరిన వారున్నారు.

వాళ్లందరితో కలిసి బతకటం, కలిసి పని చేయటం, వాళ్ల అలవాట్లూ పద్ధతులూ, భాషలతో ఎన్నో ఆశ్చర్యకరమైన విషయా లు తెలుస్తున్నాయి. ఇంతటి కఠినమైన శిక్ష ణలోనూ మధ్యలో కాస్త వినోదం! కొందరు పాటలు పాడేవారు. ఏదో కొద్దిగా కర్ణాటక, హిందుస్తానీ శాస్త్రీయ సంగీతం నేర్చుకున్న కొందరు ఆ సంగీతం పాడేవాళ్ళు. కొందరు జానపద గీతా, ఇంకొందరు హిందీ సినిమా పాటలు, బెంగాలీ, తెలుగు, కన్న డం, మళ యాళం,తమిళం ఇలా ఆ భాషల్లో వాళ్లకి వచ్చిన పాటలు పాడేవారు. కొందరు ఆధు నికమైన డ్యాన్సులు సరదాగా చేసేవారు. వీ టన్నిటితో హుషారుగా ఉండేది.

ఎంతటి చలికాలమైనా తెల్లవారు ఝామున నాలుగు గంటలకి తప్పని సరిగా లేపుతారు. జాగింగ్, ఫిజికల్ ట్రైనింగ్, ఆ తరువాత కాఫీలూ, టీలూ, టిఫిన్లూ అయ్యే

**ప్ర**కృతి మీద మానవుడి విజయాలకిదొక చిహ్నం. కొండ చిలువలా మెలికలు తిరిగినట్లు చిత్రంలో కన్పిస్తున్న ఈ వంతెన పొడవు ఏడున్నర మైళ్లు. సముద్రంలో విసిరేసినట్లుగా వున్న 'హోన్‌సూ, షికోకు సహా నాలుగు జపాన్ దీవులను కలుపుతూ నిర్మించిన ఈ వంతెన పేరు 'సెటో ఒహాషి'. వంతెనలో సగ భాగం ఎలాంటి పిల్లర్ల మద్దతూలేకుండా తేలియాడుతుంటుంది. దీని నిర్మాణానికి పదేళ్లు పట్టింది. 950కోట్ల డాలర్లు ఖర్చయ్యాయి. నిర్మాణంలో ఐదు వేలమంది కార్మికులు పాల్గొన్నారు. 17 మంది ప్రాణాలు కోల్పోయారు. భూకంపాలు అధికంగా సంభవించే ప్రాంతం నిర్మించిన ఈ వంతెన రిక్టర్ స్కేల్‌పై 8.5 తీవ్రత కలిగిన భూకంపాలను సైతం తట్టుకుని నిలబడేలా రూపకల్పన చేశారు. 1988లో దీనిని ప్రారంభించారు. ఈ బ్రిడ్జ్ పై భాగంలో నాలుగు లైన్ల రోడ్డు మార్గం ఉండగా కిందిభాగంలో రైళ్ల రాకపోకలు సాగుతుంటాయి.



వి. రైఫిల్ షూటింగులూ, ఇంకా మరెన్నో సైనిక శిక్షణలు ఉండేవి. శ్రమ ఎక్కువే. అయినా ఆనందమూ ఉండేది.

మంచి భోజనం, మంచి వాతావరణం ఉండేది. తనకి తెలియని ఎన్నో విషయాలు తెలుసుకుంటున్నాడు కిశోర్. ఎన్ని పనులు ఎంత శ్రద్ధగా చేస్తున్నా తల్లితండ్రులూ, చెల్లెలూ, ఒక్కోసారి శంకరం మాష్టారూ మనసులో మెదులుతూనే ఉండేవారు. అమ్మా, నాన్నల్ని బాధ పెట్టాను ఇక్కడికి వచ్చి' అని అనుకుంటుండే వాడు.

కిశోర్‌కి ట్రైనింగ్ పూర్తి కావడంతో జమ్మూకు పంపించారు. డ్యూటీలో చేరే లోపల తల్లి తండ్రుల్ని, చెల్లెల్ని, వీలైతే శంకరం మాష్టారినీ చూసి రావాలనుకున్నాడు. వచ్చే సంవత్సరం నాన్న రిటైరు అవుతారు, చెల్లిలికి పెళ్లయ్యాక తల్లినీ, తండ్రినీ తీసుకువచ్చి తన దగ్గరే వుంచుకోవాలనుకున్నాడు.

ఇంతలో పిడుగు లాంటి వార్త వచ్చింది. శ్రీశైలానికి వెళ్తూ యాక్సిడెంటయి, కాంతారావు, పంకజం, జ్యోతీ అక్కడికక్కడే మరణించారన్న వార్త వింటూనే కుప్పకూలిపోయాడు కిశోర్. చుట్టూ ఉన్న స్నేహితులు, ధైర్యం చెప్పారు. పై అధికారులు ఓదార్చారు.

గుండెలు పగిలిపోయాయి కిశోర్‌కి. తన అమ్మా, నాన్న, చెల్లెలూ ముగ్గురూ మరణించారు. తనకింక ఎవరున్నారు? అనుకుంటూ కన్నీరుమున్నీరయ్యాడు.

వెంటనే ఊరికి బయలు దేరాడు. స్నేహితుడు రవివర్మ కిశోర్‌కి తోడుగా వెంట వెళ్లాడు.

వీళ్లు వెళ్లాక పోస్ట్‌మార్టమ్, మిగతా కార్యక్రమాలూ పూర్తయ్యాయి. ముగ్గురి శవాల్నీ ఇంటికి తెచ్చారు. బంధువులూ, స్నేహితులూ, ఇరుగు, పొరుగు వచ్చారు. జరిగిన ఘోరానికి బాధపడుతూనే వున్నారు.

అంత్యక్రియలు జరిగిపోయాయి. కిశోర్‌కి జరిగిన అన్యాయానికి, అందరినీ పోగొట్టుకుని ఒంటరివాడైపోయినందుకు బంధువులంతా బాధపడ్డారు.

నాలుగు, అయిదు రోజుల తరువాత చాలామంది, బంధువులు వెళ్లిపోయారు. ఒకరిద్దరు దగ్గరి చుట్టాలు, ఒకరిద్దరు కాంతారావు స్నేహితులు మాత్రం ఉన్నారు. పదిరోజుల కార్యక్రమం ముగిసింది. తరువాత వాళ్లూ వెళ్లిపోయారు. ఒంటరిగా మిగిలాడు కిశోర్. అనాథలా అనిపించింది. చుట్టు ప్రక్కలవారు సముదాయించారు. స్నేహితులు ధైర్యం చెబుతూనే వున్నారు. కిశోర్‌తో వచ్చిన తోటి సైనికుడు రవివర్మ అతడి వెంట వెంట తిరుగుతూ ధైర్యం చెబుతూనే వున్నాడు.

ఇంక ఆ ఊరిలో ఉండాలనిపించలేదు కిశోర్‌కి. ఉన్నా ఉపయోగమూ లేదు. కాంతారావు పనిచేసిన బ్యాంకు నుంచి రావలసిన డబ్బూ, కొద్దో, గొప్పో ఇతర వ్యవహారాలూ కాంతారావు ప్రాణ స్నేహితుడు ఒకరు చూసిపెడతానన్నారు. 'అవసరమైతే మరొకసారి రావచ్చు' అని వెళ్లిపోయాడు కిశోర్.




జమ్మూ నుంచి కాశ్మీర్‌కి వెళ్లిపోయారు కిశోర్ ఇంకా మరి కొంత మంది బృందం. టెర్రరిస్టుల ఆగడాలూ, హింసలూ, భయంకరమైన బాంబుల దాడులు, ప్రతి నిముషం, ప్రతి క్షణం సిపాయిలకు బతుకుపోరాటం. దేశం కోసం ప్రాణాల్ని లెక్క చెయ్యని పోరాటం. దేశాన్ని శత్రుమూకల నుంచి రక్షించాలన్నది ఒక్కటే ధ్యేయం! ఒక్కటే బాధ్యత!

నిత్యం మారణ హోమాలూ! యుద్ధ బీభత్సం. ఆ పోరాటంలో ఎంత మంది అమాయక ప్రజలు బలి అయిపోతున్నారో లెక్కకి రావటం లేదు.

దేశ రక్షణ పోరాటంలో ప్రాణాలు పోగొట్టుకుని వీర మరణం పాలైన వీర జవానులూ కొడుకుల్ని పోగొట్టుకున్న తల్లితండ్రులూ, భర్తల్నీ, తండ్రుల్నీ పోగొట్టుకున్న అభాగ్య స్త్రీలూ, పిల్లలూ...

భర్త దేశ రక్షణ కోసం జరిగే యుద్ధంలో వీర మరణం పాలైనా మళ్లీ తన కొడుకుని ఈ దేశానికి సేవ చేసే సైనిక శిక్షణకి పంపే తల్లిని, ఆ వీరపత్నిని ఆ భావి భారత సైనికుడి తల్లిని ఏమని కొలవాలి? ఏమని పిలవాలి? అటువంటి స్త్రీ ఉన్నతమైన మనసు ముందు ఈ దేశంలో పుట్టిన ప్రతి పౌరుడు పాదాభివందనం చెయ్యాలి. అంత ఉన్నతంగా ఎదిగిన ఆ తల్లి మనసుకి విలువ కట్టే శక్తి ఎవరికి వుంది- సృష్టించిన ఆ భగవంతుడికి తప్ప!

తోటి సైనికులు వాళ్ల వివరాలూ, గాథలూ చెబుతూ వుంటారు. ఆ వివరాలూ, వాళ్ల కుటుంబ సంగతులు విని, అవాక్కైపోతుంటాడు కిశోర్.

కొందరు సైనికుల వ్యవసాయ జీవితం, పల్లెటూరి వాతావరణం, కొందరు తల్లిదండ్రుల చిన్న చిన్న ఉద్యోగాలు, మధ్య తరగతి స్థితిగతులు, ఆర్థిక సమస్యలు ఇలా ఎన్నో రకాలు. కొందరి తండ్రులు ఉద్యోగం చేసి సంపాదించినదంతా తాగుడు వ్యసనాలకి ఖర్చుపెట్టడం, అనారోగ్యంతో బాధపడే కుటుంబ సభ్యులు, ఇక్కడి నుంచి సైనికుడు పంపిన డబ్బుతోనే ఇల్లు గడుపుకునే కొన్ని కుటుంబాలూ!

కన్న కొడుకు కోసం కొందరు, తమ భర్తల కోసం మరికొందరు, తమ అన్నదమ్ముల కోసం ఇంకొందరు - వాళ్లెప్పుడు వస్తారా ఎప్పుడు చూస్తామా అని ఆశతో చూసే ఎదురుచూపులు- ఇలాంటివన్నీ కిశోర్‌కి ఆశ్చర్యమూ ఆనందమూ కలిగిస్తుంటాయి.

అదొక ప్రపంచం! తన తోటి సైనిక సోదరులంతా పోస్టు కోసం ఎదురు చూస్తుంటారు. ఉత్తరం అందుకున్న సైనికుడికి ఎంత ఆనందం!

తల్లి తండ్రులు రాసే ఉత్తరాలూ, భార్యా, లేకపోతే ప్రేయసి, కాబోయే భార్య రాసే ఉత్తరాలు కొందరికీ, అక్కచెల్లెళ్లూ, అన్నదమ్ములు, స్నేహితులు రాసే ఉత్తరాలూ వస్తూ ఉంటాయి. వాటినందుకున్న సైనికుడి ఆనందం అంతు లేనిది.

ఏ సైనికుడి అడ్రస్సూ సూటిగా ఉండదు. 'కోడ్ నంబర్లూ' కొద్దీ వివరాలు మాత్రమే ఉంటాయి. వాటితోనే సైనిక సోదరులకి ఉత్తరాలు వస్తూ వుంటాయి.

సైనికులు వాళ్ల వాళ్లకి, ఆత్మీయులకీ రాసే ఉత్తరాలైనా, తమ తమ ఊళ్ల నుంచి సైనికులకి వచ్చిన ఉత్తరాలైనా సరే అవి ప్రేమ లేఖలయినా సరే, శుభాకాంక్షలయినా సరే, యోగక్షేమాల ఉత్తరాలైనా సరే రక్షణ సిబ్బంది వాటిని చదివి, మళ్లీ జాగ్రత్తగా అంటించి గమ్యస్థానానికి చేర్చుతారు. సైనిక విధానంలో అది తప్పనిసరి నియమం. వాళ్లు దేశ రక్షణ కోసం పనిచేసే బాధ్యత గల సైనికులు కనుక ఎట్టి పరిస్థితుల్లోనూ దేశ రక్షణ, దేశ భద్రత మాత్రమే వారి ప్రథమ కర్తవ్యం.

కిశోర్‌కి ఎక్కడి నుంచీ ఉత్తరాలుగానీ, గ్రీటింగ్ కార్డులుగానీ ఏవీ రావు. అతడికి తన వాళ్లంటూ ఎవరూ లేరు. అదేమిటో తనకి మంచి మిత్రులు కూడా లేరని బాధపడుతుంటాడు. ఇంటర్‌మీడియట్‌లో రూమ్మేట్స్ రమణ, రవీంద్ర మంచి మిత్రులే. ఇప్పుడు ఎక్కడ ఉన్నారో! ఏం చేస్తున్నారో అనుకుంటుంటాడు. తనకి 'నా' అన్నవారు లేరనే భావన, తను 'ఒంటరిని' అనే భావన కిశోర్ మనసులో అప్పుడప్పుడూ కలుక్కుమంటుంది. 'ఈ కాశ్మీర్ సరిహద్దుల్లో

ఎప్పుడూ కాల్పులూ,తుపాకి గుళ్ల మోతలూ వినపడుతూనే ఉంటాయి. ఎప్పుడు, ఎవరికి ఏం జరుగుతుందో తెలియదు. విధి వక్రించి తనకి ఏదైనా జరిగినా తన కోసం బాధప డేవారు లేరు.' అనుకునే అతని మనసు బా ధతో ములుగుతుంది.

విధి నిర్వహణలో సమయా సమయాలు లేవు. ఎప్పుడు పిలుపు వచ్చినా యూని ఫార్మ్ ధరించి పరుగులు తీయవలసిందే. మళ్లీ వచ్చేది ఎప్పుడో, ఏ అర్ధరాత్రికో. అ వసరమైతే మళ్లీ ఏ తెల్లవారు ఝామునో పరుగులు తీస్తూ వెళ్లాలి. తినటానికి సమయం ఉండదు. నిద్రకి సమయం ఉండదు. దేశ రక్షణ మొదటి కర్తవ్యం. అంతే, మిగతావి తరువాత.

కిశోర్ సైన్యంలో చేరి చాలా కాలమ యింది. ఎందుకో పెళ్లి చేసుకోవాలని అనిపించలేదు. ఒకవేళ అనిపిం చినా తనకి సంబంధం చూసి, పెళ్లి చేసేందుకు తనవాళ్లు ఎవ్వరూ లేరు. తనంతట తనుగా ఎవరినైనా ప్రేమిం చటం చేత కాలేదు. అందుకే అ వివాహితుడిగా మిగిలిపోయాడు. అ లాగే సంవత్సరాలు గడుస్తున్నాయి. ఒంటరి బ్రతుకుకు అలవాటు పడిపో యాడు. తన చుట్టూవున్న తోటి ఉద్యోగులే తన ఆత్మీయులు.




విధి నిర్వహణలో ఉన్నంత సేపూ మెద డుకి మరో ఆలోచన రాదు. అది ముగిశాక అతడిలో ఒకరకమైన నిర్లిప్తత!

సంవత్సరాలు గడుస్తున్న కొద్దీ కిశోర్ మంచి పేరు సంపాదించుకున్నాడు. ప్రభు త్వం నుంచి రెండు బిరుదులూ, మెడల్స్ పొందాడు. అవి అందుకున్నప్పుడు శంకరం మాష్టారే మనసులో మెదిలారు. ప్రమోష న్లు వచ్చాయి. తోటివారి నుంచీ, పై అధికా రుల నుంచీ ప్రేమా, గౌరవం, మంచి పేరు అన్నీ సంపాదించుకున్నాడు. ఈ మధ్యనే 'షార్టు సర్వీస్' చేసి పదవీ విరమణ చేయాలని ఎందుకో ఆలోచన వస్తోంది.

* * *

"కిశోర్! ఆ కాశ్మీర్ బార్డర్ నుంచి ఇప్పుడు ఇవతలికి వచ్చేశాం. మళ్లీ ఎప్పుడు పంపుతారో తెలియదు. అందుకే ఓ నెల రోజులు సెలవు పెట్టి, మా ఊరు వెళ్లాలని ఉంది." అన్నాడు రవివర్మ ఆరోజు రాత్రి డిన్నర్ చేస్తూ.

"నిజమే బాగుంటుంది. లీవు శాంక్షన్ చేస్తారా?" కాస్త సందేహంగా అన్నాడు.

"అప్లై చేస్తాను. శాంక్షన్ చేస్తా రనే అనుకుంటున్నాను"

"అవునులే వెళ్లిరా! నువ్వు మీ ఊరికి వెళ్లి, మీ వాళ్లని చూసి దాదాపు రెండు సంవత్సరాలు అవు తోంది కూడా! మీ అబ్బాయి కాస్త పెద్దవాడు కూడా అయివుంటాడు"

"అందుకే వెళ్లాలని ఉంది. చూడు కిశోర్! ఒక్కమాట!" అన్నాడు రవివర్మ.

"ఏమిటి?"

"నువ్వూ సెలవుకి అప్లై చెయ్యి నాతో పాటు మా ఊరు రావచ్చు"

"నేనా? ఎందుకు?"

"నువ్వే! ఎందుకేమిటి! మా ఊరు చూద్దు వుగాని. మా అమ్మా, నాన్నా, నా తమ్ముడు, నా భార్యా, మా అబ్బాయి ఇంకా ఆ పక్కనే ఉంటున్న మా బాబాయిగారి కుటుంబం - అందర్నీ చూడొచ్చు. మా ఊరు గోదావరి జిల్లాలో ఉంది. చాలా బాగుంటుంది కిశోర్! కొబ్బరి తోటలు ఎక్కువ. మామిడి తోటలూ, పంటపొలాలతో చాలా చక్కగా ఉంటుంది. అయితే మాకు అన్ని తోటలూ,

పొలాలూ లేవులే. ఏదో కొద్దిగా ఉన్నాయి. అసలు నువ్వు ఎప్పుడైనా పల్లెటూర్లు చూశావా? " అనడిగాడు రవివర్మ.

"లేదు" నవ్వాడు కిశోర్.

"మరి నాతో రా! వెళ్దాం. నీకు నేను అన్నీ చూపిస్తాను. అసలు నువ్వు ఎప్పుడూ అన్ని రోజులు సెలవు పెట్టలేదు, ఎక్కడికీ వెళ్ల లేదు. అందుకే నీకు కూడా సెలవు తప్పక శాంక్షన్ అవుతుంది"

"ఒక వేళ శాంక్షన్ కాకపోతే? "

"కాకపోతే నేనూ మానేస్తాను. మళ్లీ అప్లై చేసుకుందాం. శాంక్షన్ అయినప్పుడే ఇద్దరం కలిసి వెళ్దాం. అయినా నీకు అనుమానమెం దుకు? ముందు సెలవుకి అప్లై చెయ్యి"

"అన్ని రోజులా! మీ ఊళ్లో, మీ ఇంట్లో అంతకాలం ఉండాలంటే ఏం బాగుంటుంది వర్మా! అక్కడ హోటళ్లు ఏమైనా ఉన్నాయా? " మొహమాటంగా అన్నాడు.

"అంత మొహమాటం వద్దురా భాయీ! మనమిద్దరం మంచి స్నేహితులం. అవునా కాదా" అనడిగి మళ్లీ తనే "నీకు నీవాళ్లు ఎవ్వరూ లేరు, సెలవు పెట్టి ఎక్కడికీ వెళ్లవు. మీ చుట్టాలు నువ్వు బ్రతికి ఉన్నావో, చచ్చిపోయావో కూడా పట్టించు కోరు. పోనీ పెళ్లి చేసుకుని ఓ తోడు తెచ్చు కోరా అంటే 'నాకు పిల్లని ఎవరు చూస్తారు? ఎవరు ఇస్తారు? " అంటావు అ న్నాడు రవివర్మ.

కిశోర్ నవ్వేశాడు.

నాతో పాటు వచ్చి మా ఇంట్లో ఉండడా నకి నువ్వే మాత్రం ఇబ్బంది పడనక్కర లే దు. పైగా మా అమ్మా, నాన్నా కూడా సంతోషిస్తారు. నా భార్యా, మా అబ్బాయి, మా తమ్ముడు, వాడి భార్యా, కొడుకూ అందరూ చాలా బాగా సరదాగా ఉంటారు. చాలా బాగుంటుంది మా ఇంటి వాతావ రణం. కుటుంబ వాతావరణానికి నువ్వు దూరమై చాలా కాలమైంది కూడా! నీకూ ఈ ఒంటరితనం బాధ తాత్కాలికంగా నైనా కాస్త దూరం అవుతుంది. నువ్వు ఇంకేమీ మాట్లాడకుండా సెలవుకి అప్లై చెయ్యి." అన్నాడు రవివర్మ.

ఆలోచనలో పడ్డాడు కిశోర్ 'చాలా కాలం నుంచీ తను సెలవు కూడా తీసుకోలేదు. ఇ న్నాళ్లూ సెలవు తీసుకుని ఏం చెయ్యాలి? ఎక్కడికి వెళ్లాలి? ఎవరి కోసం వెళ్లాలి? ' వంటి ప్రశ్నలకి సమాధానం దొరకలేదు. అందుకే కొంత అనాసక్తత, కొంత నిర్లిప్తత!.

ఇప్పుడు వర్మ తమ ఊరికి రమ్మని ప్రేమగా అడుగుతున్నాడు. ఇంతకాలంలో ఇలా అడిగింది మాత్రం ఎవరు..? వెళ్లాలి. తనకీ కొంత మార్పు కావాలి. కుటుంబం, కుటుంబ వాతావరణం...

"ఏమిటిరా అంత ఆలోచన? "

"ఏం లేదులే నేను కూడా సెలవుకి అప్లై చేసుకుంటాను. శాంక్షన్ అయితే వస్తానులే."

"హమ్మయ్య!" ఆనందంగా అన్నాడు రవి వర్మ.




రవివర్మకి, కిశోర్‌కి సెలవు మంజూర యింది. వాళ్లిద్దరి ఆనందానికీ పట్టపగ్గాలు లేవు.

ఊరికి బయలు దేరారు.

రైలు ప్రయాణం, తరువాత బస్సు ప్రయాణం. దాదాపు మూడు రోజులకి అల సిపోయి ఆ పల్లెటూరు చేరుకున్నారు. కిశోర్ కూడా తనతో వస్తున్నట్టూ, రవివర్మ వాళ్ల వాళ్లకి ముందే ఉత్తరం రాశాడు.

రవివర్మ తండ్రి వెంకటపతి రాజుది మధ్య తరగతి కుటుంబం. అంతస్తుల్ని

పెంచే ఆస్తులు లేకపోయినా తిండికీ, బట్టకీ లోటులేని సంసారం. పదెకరాలు మాగాణి పొలం ఉంది. ఇద్దరే పిల్లలు. అన్ని వసతులూ ఉన్న ఒక చిన్న డాబా ఇల్లు. ఇంటి ముందూ, వెనకా, చుట్టుప్రక్కల విశాలమైన స్థలం. ఇంటి వెనక భాగంలో ఒక పెద్ద గది. దానిలో ధాన్యపు గాదెలూ, వేరుశనగ బస్తాలూ, ఏవో పంట సామాన్లూ వుంటాయి.

వెంకటపతిరాజు తండ్రి సుబ్బరాజు ఆ రోజుల్లో స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. తన ఆస్తులు, డబ్బూ స్వాతంత్ర్య పోరాటం కోసమే ఖర్చు చేశారు. ఆయన ఖర్చు చెయ్యగా మిగిలిన ఆస్తి ఇది. ఆయన బ్రతికి నంతకాలం ఆ పల్లెటూరిలో, వ్యవసాయంతోనే కాలం గడిపారు. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న వారికి వయసు మళ్లిన స్వాతంత్ర్యపోరాట యోధులకు కల్పించిన పెన్షన్‌లో భాగంగా సుబ్బరాజుకి భారత ప్రభుత్వం ఇచ్చిన నాలుగెకరాల భూమిని ఇద్దరు పేద రైతులకి దానం చేశారు. ఆయనకి వచ్చే పెన్షన్‌ని గౌరవంగానే తిరస్కరించారు. "దేశానికి నేను ఏదైనా చెయ్యాలని కోరికతో చేశాను. దేశం నుంచి నేనేమీ ఆశించను. ఎంతో మంది స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. వారిలో నేనూ ఒకడిని. మన దేశానికి స్వాతంత్ర్య వచ్చింది. ఆ ఆనందం చాలు నాకు!" అనేవారు.

ఎన్నో ఏళ్లనుంచీ, ఎంతో కాలం నుంచీ నివసించే మధ్యతరగతి కుటుంబాలకి ఆమాత్రం ఇల్లూ, స్థలం ఏర్పరుచు కోవటంలో ఎక్కువ ఖర్చూ కాదు, ఆశ్చర్యమూ లేదు. ఆ ఊళ్లో ఎవరైనా అటువంటి ఇంట్లో నివసించేంత వరకే దాని విలువ. అది అమ్మి, సొమ్ము చేసుకోవాలంటే మాత్రం దాని విలువ తక్కువ. రవివర్మ పక్క ఊరి హాస్టల్‌లో వుండి డిగ్రీ పూర్తి చేశాడు. తరువాత అతడికి పై చదువులు చదవాలని అనిపించలేదు. ఆర్మీలో చేరాలనే కోరిక రోజురోజుకీ మనుసులో బలంగా నాటుకుంది. తండ్రికీ, తల్లికీ చెప్పాడు తన మనసులోని ఆలోచన. మొదట్లో తల్లి మాత్రం కాస్త బాధపడింది. తండ్రి వెంకటపతిరాజు మాత్రం "సరే రవీ! నీకు అంత ఇష్టంగా వుంటే నేను కాదనను. దేశం కోసం పని చేస్తానంటున్నావు. ఈ విషయంలో నీకు మీ తాతయ్య పోలికే వచ్చింది. ఒక విధంగా నాకు సంతోషంగా వుంది. నువ్వు ఏ రాజకీయాల్లోనో చేరి, రాజకీయ నాయకుడవుతానంటే బాధపడాలిగానీ ఆర్మీలో చేరతానంటే సంతోషమేరా బాబూ!" అన్నారు వెంకటపతిరాజు గారు.

అలా ఆర్మీలో చేరాడు రవివర్మ. తన సంగతంతా చెప్పాడు రవివర్మ కిశోర్‌తో ఇంటివైపు నడుస్తూ.

"అసలు ఈ పల్లెటూరు, ఈ వాతావరణంలో పుట్టి పెరిగిన నీకు ఆర్మీలో చేరాలని ఎందుకు అనిపించిందిరా?" అడిగాడు కిశోర్ బ్యాగ్ భుజాన వేసుకుని నడుస్తూ.

"నాకు మొదటి నుంచీ సైనికులూ, వాళ్ల క్రమశిక్షణా, వాళ్ల పద్ధతులూ అంటే చాలా ఇష్టంగా వుండేది. మరీ చిన్నప్పుడు వాళ్ల యూనిఫారమ్, వాళ్ల 'మార్చిఫాస్ట్' చాలా ఆకర్షించేవి. ఆగస్ట్ 15, 'రిపబ్లిక్ డే పెరేడ్' తప్పకుండా చూసేవాడిని టి.విలో. పెద్దవాడినయ్యాక మా తాతయ్య చదివిన పుస్తకాలు, ఆ రోజుల్లో మన స్వాతంత్ర్యయోధులు చేసిన సాహసాలూ, త్యాగాలూ, కష్టాలూ వాళ్లని గురించిన పుస్తకాలు చదివేవాణ్ణి. సైనికుల సాహసాలూ, ఋజువర్తన, దేశాన్ని గురించి వాళ్లకి వున్న అంకిత భావం వాళ్ల విధి నిర్వహణ, శ్రద్ధ వాళ్ల మీద ఇష్టాన్ని పెంచాయి. నాకూ మా తాతయ్య పోలిక వచ్చింది. ఆ రోజుల్లో ఆయన గొప్ప ఫ్రీడమ్ ఫైటర్, గొప్ప త్యాగమూర్తి, ఎన్నోసార్లు జైలుకి వెళ్లాడు. స్వార్థం ఎరుగని మనిషి. ఆయన పోలిక

కొంచెమైనా రావటం నాకు ఆనందమే. అలా జరిగింది నా సైనిక రంగ ప్రవేశం!"

కబుర్లతో ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు.

రవివర్మ ఇంట్లో ప్రతి ఒక్కరూ - ఆయన భార్య, ముద్దుగా వున్న రవివర్మ ఆరేళ్ల కొడుకూ, రవివర్మ తల్లీ తండ్రీ, అగ్రికల్చర్ బి.ఎ స్.సి చదివి, అక్కడేవుంటూ, తండ్రితో పాటు వ్యవసాయం చేస్తున్న రవి తమ్ముడు, అతని భార్య లక్ష్మి, వాళ్ల కొడుకు సుబ్బు ఆప్యాయంగా పలకరించారు ఇద్దరినీ.

స్నానం, భోజనాలు కాగానే నిద్ర ముంచు కొచ్చేసింది.

సాయంకాలం నాలుగు గంటలు దాటిన తరువాత నిద్ర లేచారు.

రవివర్మ తల్లి రుక్మిణమ్మ సున్నివుండలూ, జంతికలూ పెట్టింది. టీ చేసి, అందరికీ ఇచ్చింది రాధ. రవివర్మ కొడుకు కిరణ్, తమ్ముడు నాగరాజు కొడుకు సుబ్బులతో కాసేపు ఆటలూ, మాటలూ ముగిశాక వర్మ కిశోర్‌ని తీసుకుని వాళ్ల బాబాయి గారింటికి వెళ్లాడు.

రవివర్మ బాబాయి రంగారావు, ఆయన భార్య సరస్వతి, వాళ్ల చిన్నమ్మాయి శ్రీదేవినీ పరిచయం చేశాడు. ఫలహారాలు ఇస్తే వద్ద న్నారు. టీ మాత్రం తీసుకోక తప్పలేదు ఇద్దరికీ. రవివర్మ బాబాయి కూతురు శ్రీదేవి అందంగా వుంది. పాతికేళ్ల వయసు వుంటుందేమో! చూస్తున్నకొద్దీ చూడాలనే అనిపిస్తోంది. ముగ్ధుడైపోయాడు కిశోర్ శ్రీ దేవిని చూసి. పెళ్లికాలేదు, డిగ్రీ ప్రయివేటుగా చేసింది. ఆమె అంద చందాలూ, మాటలు అన్నీ తీరుగానే వున్నాయి. బాపూ గీసిన బొమ్మలా అందంగా వుంది అనుకున్నాడు కిశోర్.

**శ్రీదేవి అందంగా వుంది. పాతికేళ్ల వయసు వుంటుందేమో! చూస్తున్నకొద్దీ చూడాలనే అనిపిస్తోంది. ముగ్ధుడైపోయాడు కిశోర్ ఆమెను చూసి. బాపూ గీసిన బొమ్మలా అందంగా వుంది అనుకున్నాడు**

* * *

ఆ ఊరి వాతావరణం. పచ్చని పొలాలూ, పాడిగేదెలూ చూస్తుంటే ముచ్చటేసింది కిశోర్‌కి.

అమాయకత్వం కొంత, మర్యాద, మన్నన కొంత, మరింత ప్రేమతో పలకరించే ఆ ఊరి వాళ్లందరూ కిశోర్‌కి ఆత్మీయంగా అనిపిస్తున్నారు.

ఉదయం పూట ఫలహారాలూ, కాఫీలూ పూర్తి అయ్యాయి. వాతావరణం ఎక్కువ వేడిగా లేదు. బయటికి వెళ్లి, మునసబుగారి మామిడి తోట, దాని పక్కనే ఉన్న మల్లెతోట, ఇంకా కొన్ని పూదోటలూ చూద్దామని బయలుదేరారు వర్మ, వర్మ తమ్ముడు నాగరాజు, కిశోర్.

శ్రీదేవి చేతిలో స్టీలు క్యారియర్‌తో వచ్చింది

అక్కడేవున్న రాధని చూసి "వదినా! పెద్దమ్మ ఉందా? " అడి గింది.

"పెరట్లో వున్నారు!" చెప్పింది వర్మ భార్య

"అమ్మ జున్ను చేసింది. మీకు ఇచ్చిరమ్మని పంపింది" అని క్యారి

యర్ రాధ చేతికిచ్చి పెరట్లోకి వెళ్లింది శ్రీదేవి.

కిశోర్ శ్రీదేవినే చూస్తున్నాడు 'ఈ అమ్మాయి చాలా బాగుంది. ఇంతకాలం తరువాత ఒక ఆడపిల్లని చూసి అతడి మనసు స్పందిస్తోంది. లోగడ ఇలా పరవశించిపోవటం ఎప్పుడూ జరగలేదు. ఏమిటో ఈ మార్పు! ఎందుకు... ఇలా? ...

పెరట్లో నుంచి వచ్చిన రుక్మిణమ్మను చూసి విషయం చెప్పింది శ్రీదేవి. "నేనే చేద్దామనుకుంటున్నాను. వెంకన్నని జున్నుపాలు తెచ్చి పెట్టమని అడిగాను. వాళ్ల గేదె ఈ రోజే ఈనిందట. రేపు తీసుకువస్తానన్నాడు. సరే



మీ అమ్మ పంపిందిగా" అంది.

"అమ్మా! మునసబుగారి మామిడితోట, మల్లెతోటలూ కిశోర్‌కి చూపిస్తాం. శ్రీదేవీ నువ్వూ రా!" అన్నాడు వర్మ.

"నేనా! ఎందుకు? "

"ఎందుకేమిటి! రా శ్రీదేవీ!" అన్నాడు నాగరాజు.

"వదినలు వస్తే నేనూ వస్తాను" అన్నది.

"మేము రాములే శ్రీదేవీ! నువ్వు వెళ్లు" అంది రాధ.

"ఎందుకు? "

"అత్తయ్య ఒక్కరూ చేసుకోవాలి వంట. అందుకు".

"అదా! ఏం పరవాలేదు మీరిద్దరూ వెళ్లండి. మా వర్మ వుండేది కొన్ని రోజులేగా. వెంకన్న పెళ్లాం ఉందిగా. అది సాయం చేస్తుందిలే" అంది రుక్మిణమ్మ.

ఈ సంభాషణ వింటూ, ఆ కుటుంబాన్ని చూస్తున్న కిశోర్‌కి ఆశ్చర్యంగా వుంది 'ఈ ఇంట్లో అందరూ ఒకరినొకరు ఎంత బాగా



అర్థం చేసుకుంటారు!

ఎంత ఆనందంగా వున్నారో!' అనిపించింది.

మరి కాసేపటికి, ఇద్దరు తోడి కోడళ్లూ రెడీ అయ్యారు.

అందరూ కలిసి బయలు దేరారు.

* * *

మునసబుగారి మామిడి తోటలూ, పూలతోటలూ తిరిగారు. కొబ్బరి బొండాలు తాగారు. చెట్లకింద చేరి కబుర్లు చెప్పుకున్నారు.

మామిడి తోటలో చెట్లన్నీ పూతతో నిండిపోయాయి. అక్కడక్కడా చిన్న చిన్న మామిడి పిందెలున్నాయి. మామిడి పూత వెదజల్లే, సన్నటి వింత పరిమళం కోయిలమ్మ కూసే కోటి రాగాల స్వరాలూ... ఆహ్లాదంగా వున్నాయి ఆ పరిసరాలు.

కిశోర్‌కి ఆ పరిసరాల్ని చూస్తుంటే వింతగా వుంది, ఆహ్లాదంగానూ ఉంది. పల్లెటూర్లు ఎప్పుడూ చూడని అతడికి ఎంతో ఆనందంగా వుంది.

వర్మ కుటుంబంలోని వ్యక్తులూ, వాళ్ల ఆదరణా అతణ్ణి మరో ప్రపంచంలోకి తీసుకువెళ్తున్నాయి. వర్మ తల్లీ, తండ్రీ ఎంతో ప్రేమగా, అన్యోన్యంగా వుంటారు. అలాగే వర్మ దంపతులూ, నాగరాజు దంపతులూ... ఉమ్మడి కుటుంబం అంటే ఇలా వుంటుందా అనిపించింది.

'తను పెరిగిన ఇంట్లో ఎప్పుడూ గొడవలూ, కీచులాటలూ, తను చేసే వెధవ పనులూ, చెల్లెలిపై అందరితో పాటు తనూ చూపించే చులకన భావన - అలా అస్తవ్యస్తంగా వున్న కుటుంబంలో పెరిగాడు.

ఇప్పుడు వీళ్ల కుటుంబం చూస్తూవుంటే పండగలా వుంది. అందరిలోనూ శ్రీదేవి అందం, ఆమె కబుర్లు, వదినగార్ల వేళాకోళాలూ చూస్తూనే వున్నాడు కిశోర్. శ్రీదేవి వైపు అతని మనసు పరుగులు తీస్తోంది. అప్పుడప్పుడూ శ్రీదేవి వర్మకి ఉత్తరాలు

రాస్తూ వుంటుంది. మా బాబాయి కూతురు ఉత్తరం రాసింది అని అప్పుడప్పుడూ చెప్పే వాడు. ఈ శ్రీదేవే కాబోలు!

అందరూ కబుర్లు చెప్పుకుంటూ, పచ్చని పంటపొలాలు చూసుకుంటూ నడుస్తున్నారు.

పొలాలు బాగానే వున్నాయి కానీ సరైన వర్షాలు లేని కారణంగా, కొన్ని చోట్ల నీరు సరిగ్గా లేక, ఏపుగా ఎదగలేక, నీరసంగా గాలికి తలలూగిస్తున్నాయి.

పాడిగేదెలూ, ఆవులూ, నాగలికి కట్టి తోలుకు వెళ్లే ఎద్దుల జంట, ఇళ్ల ముందర తిరిగే కోళ్లూ, ఇంటి ముందు ముగ్గులూ, పొలాలకి వెళ్లే రైతులూ, స్త్రీలూ, పొలాల నుంచీ ఏవో పనుల కోసం వస్తూ వుండే రైతులూ పెద్దశబ్దంతో తిరిగే రెండు ట్రాక్టర్ల తో అంతా సందడిగా వుంది.

ఊరికి రెండు కిలో మీటర్ల దూరంలో రామాలయం, ఆ పక్కన శివాలయం వున్నాయి. గుడిలో నిత్యపూజా, నైవేద్యాలూ జరుగుతూంటాయి.

ఒక కిలో మీటర్ దూరంలో చిన్న హాస్పటల్ ఉంది. సామాన్యమైన, చిన్న చిన్న జబ్బులకీ, పురుళ్లకీ ఆ హాస్పటల్‌లో ఉండే డాక్టరు చూస్తారు. పెద్ద పెద్ద కంప్లైంట్లు వస్తే, గర్భిణీస్త్రీలకి సిజేరియన్‌లాంటి కేసులైతే అక్కడి డాక్టరు ఒక లేడీ డాక్టరుని పిలిపించి, పరీక్షించి, ఆవిడ సలహామీద పక్కనే వున్న పట్నంలోని హాస్పటల్‌కి పంపుతారు. మొత్తానికి ఆ ఊరి ప్రజలు అనారోగ్యం వచ్చినా, ఎక్కువ ఇబ్బంది పడకుండా రోజులు బాగానే గడిచిపోతున్నాయి.

"గవర్నమెంటు గుర్తింపు పొందిన ఓ గురుకులంలాంటి పాఠశాల ఉంది. పదవ తరగతి వరకూ ఉంది. నాలుగు కిలో మీటర్ల దూరంలో ఓ జూనియర్ కళాశాల వుంది" నాగరాజు తమ ఊరి విశేషాలు వివరంగా చెబుతున్నాడు కిశోర్‌కి. అందరూ వింటూ నడుస్తున్నారు. "కానీ పశువులకి జబ్బు చేస్తే, ఊళ్లోని రైతులందరం ఇబ్బంది పడుతూ వుంటాం కిశోర్ గారూ! వాటికి ఏదైనా అనారోగ్యం వస్తే పశువుల ఆసుపత్రికి తీసుకువెళ్లటం పెద్ద శ్రమ, ఖర్చుతో కూడిన పని మాకు. కానీ తప్పదు. పాడి పరిశ్రమకి ఆవులూ, గేదెలూ, వ్యవసాయంలో పొలం దున్నుకునేందుకు ఎద్దులూ, దున్నపోతులూ కావాలి. వాటిని పోషించక తప్పదు. వాటికి రోగాలు వస్తే శ్రమపడి, వైద్యం చేయించకా తప్పదు. కొన్ని కొన్ని పరిస్థితుల్లో, పశువుల డాక్టర్ని ఇక్కడికే పిలిపించి, వైద్యం చేయిస్తూ వుంటా".

వింటూ నడుస్తున్నాడు కిశోర్ "మరి నాగరాజుగారూ! పల్లెటూళ్లల్లో రాజకీయాలు చాలా భయంకరంగా ఉంటాయని అంటుటారు. కక్షలూ, కార్పణ్యాలూ, పగలూ, ప్రతీకారాలూ, ద్వేషాలూ తారాస్థాయిలో ఉంటాయని అంటారు. హత్యలూ, కొట్లాటలూ ఉంటాయని, ఆత్మహత్యలూ కూడా ఎక్కువైపోయాయని, పేపర్లలో చదువుతూ వుంటాం. మరి మీ ఊరి కథ ఆశ్చర్యంగా వుంది నాగరాజుగారూ! ఇన్ని సదుపాయాలు మీ ఊళ్లో ఉన్నాయంటే ఆశ్చర్యంగానే ఉంది. ఎంత మంచి ఊరు మీది అని ఆనందంగానూ ఉంది" అన్నాడు కిశోర్.

అందరూ నడుస్తున్నారు. మధ్య మధ్యలో శ్రీదేవి నడక, రాధతో మాట్లాడుతున్న తీరూ, నవ్వుతున్న తీరూ, ఆమె అందచందాలూ ఓర చూపులతో చూస్తూనే ఉన్నాడు కిశోర్.

'శ్రీదేవి అందంగా ఉంది. చదువుకున్నది. చక్కగా మాట్లాడుతుంది. మర్యాద, మన్నన తెలిసిన అమ్మాయి. ఈ అమ్మాయిని చూస్తుంటే తన మనసు ఎక్కడికో వెళ్లిపోతోంది! ఎందుకో ఈ స్పందన! అనుకున్నాడు కిశోర్. మనసు చేసే తమాషా అతణ్ణి దారి మళ్లిస్తోంది. మాట వినని మనసు అల్లరి పెడుతూంటే అందమైన ఊహలు ఉదయిస్తున్నాయతడిలో.

కిశోర్ క్రీగంటితో శ్రీదేవిని ఆరాధనగా చూస్తుండటాన్ని గమనించాడు రవివర్మ.

మనసులో నవ్వుకున్నాడు.

మధ్యలో ఆగారు. మళ్ళీ అందరికీ కొబ్బరి బొండాలు కొట్టిచ్చాడు వెంకటపతి రాజుగారి పాలేరు.

"మీరు విన్నట్లే పల్లెటూరి రాజకీయాలూ, గొడవలూ, అరుదుగా హత్యలూ, కొట్లాటలూ, పోట్లాటలూ, భూమి తగాదాలూ అవన్నీ ఇక్కడా ఉన్నాయి కిశోర్‌గారూ.

"ఆ మధ్య ఓ రైతు అప్పుల బాధ పడలేక ఆత్మహత్య చేసుకున్నాడు. కాకపోతే 'పర్సెంటేజ్' అంటారు చూడండి అలా ఇక్కడ జరిగే ఘోరాలు తక్కువగా ఉంటాయి.

"ఎన్నికల సమయంలో ఇక్కడా హడావిడిగానే ఉంటుంది. ఎన్నికల ప్రచారాలూ, సభలూ, సమావేశాలూ, వీలైతే కొట్లాటలూ, తాగించటాలూ, ఓట్లు కొనుక్కోవటాలూ ఇవన్నీ దేశంలో మామూలై పోయాయి. ఇక్కడ కూడా అంతే. ఎన్నికల్లో డబ్బు ఖర్చు పెట్టి, గెలిస్తే అంతకి నాలుగింతలు తాము పదవిలో ఉన్న కాలంలో సంపాదించాలనే ఆరాటం. అంతే గానీ ఈ దేశంలో రాజకీయ నాయకులకి దేశభక్తి నేతిబీరకాయలో నెయ్యిలాంటిదే.

"కాకపోతే చిన్న చిన్న రాజకీయాలూ, ఎంతో కొంత అభిప్రాయ భేదాలు ఈ ఊరి పెద్దల్లో ఉన్నా, అవసరంలోనూ, కష్ట సమయంలోనూ వెసులుబాటుతనం చూపిస్తారు. ఆ మంచితనం ఇంకా కాస్త మిగిలి ఉంది అనిపిస్తుంది." అన్నాడు నాగరాజు.

ఊళ్ళోని ఇతర సంగతులు విశేషాల గురించి మాట్లాడుకుంటూ ఇంటికి చేరుకున్నారు.

ఆ రోజు ఆదివారం. భోజనాలు చేసి కూర్చున్నారంతా. ఇంక ఆ రోజు ఎక్కడికీ వెళ్లాలనిపించక టి.వి.లో తెలుగు సినిమా చూస్తూ కూర్చున్నారు. శ్రీదేవి కూడా వచ్చింది అక్కడికి.

రుక్మిణమ్మ, కోడళ్ళూ కలిసి ఏవో పిండి వంటలు చేశారు. వంటింటి పని ముగించుకుని అందరూ వచ్చి కూర్చున్నారు. కాసేపటి తరువాత శ్రీదేవి లోపలికి వెళ్ళి, అందరికీ టీ చేసి తీసుకు వచ్చింది. అందరికీ ఇచ్చి, తనూ తీసుకుని కూర్చుంది.

రవివర్మ ఉన్నన్ని రోజులూ శ్రీదేవి ఎక్కువగా అక్కడే ఉంది. ఆడపిల్లలు లేని వెంకటపతి రాజు గారికి, రుక్మిణమ్మకీ కూడా శ్రీదేవి అంటే ఇష్టం. 'పెళ్ళయితే ఎలాగూ అత్తగారి ఇంటికి వెళ్ళిపోతుంది. అప్పటి వరకేగా ఈ సందడి' అనుకుంటారు.

రవివర్మకీ శ్రీదేవి అంటే ఇష్టమే! చెల్లెల్ని ప్రేమగా చూసుకుంటాడు రాధ, లక్ష్మి కూడా ఆమెతో స్నేహితుల్లాగానే ఉంటారు.

మర్నాడు- రవివర్మ, కిశోర్ రామాలయం వైపు బయలుదేరారు.

**చీకట్లో అరసున్నా!**

విద్యాశాఖాధికారిగా పనిచేస్తున్న కాలంలో సీఆర్ ఓ పాఠశాల తనిఖీకి వెళ్లారు. ఓ కుర్రవాడిని లేపి 'చీకటి' అనే పదాన్ని బోర్డుమీద రాయమన్నారు. అతను రాశాడు.



సీఆర్ ఏమీ అనకముందే అక్కడి ఉపాధ్యాయుడు ఒకరు 'ఓరి వెధవా.. చీకటిలో చీ తరవాత అరసున్నా పెట్టాలని తెలీదుట్రా?' అంటూ కుర్రవాడిపై ఒంటికాలిమీద లేచాడు.

ఆ గురుదేవుడి నైజం అర్థమైన సీఆర్ 'అసలే చీకటి అందులో ఇంకా అరసున్నా ఏం కనబడుతుంది లేవయ్యా! ఊరుకో!' అన్నారు మెత్తగా.

ఆ రోజు అందరికీ రంగారావుగారి ఇంట్లో భోజనం. అందరూ అక్కడే ఉన్నారు.

గుళ్లో పూజారికీ, అక్కడికి వచ్చిన తెలిసినవారికీ కిశోర్‌ని పరిచయం చేశాడు రవివర్మ. యుద్ధ విశేషాలు, సరిహద్దు సంగతులు అడిగి తెలుసుకున్నారు వాళ్లంతా.

దేవుడి దర్శనం చేసుకుని, గుళ్లో ఒక ప్రక్కగా కూర్చున్నారు ఇద్దరూ - కొబ్బరి చిప్ప కొట్టి ముక్కలు తింటూ.

కిశోర్ మనసు శ్రీదేవి చుట్టూనే తిరుగుతోంది. ఇంతగా మనసులో అలజడి రేపుతున్న ఆమెని తలచుకుంటేనే అతడి మనసు గాలిలోకి తేలిపోతోంది.

"కిశోర్!" పిలిచాడు రవివర్మ.

"ఊ" పరధ్యానంగా పలికాడు.

"నీ ఆలోచన అంతా శ్రీదేవి గురించే కదూ!" సూటిగానే అడిగాడు.

"నీకెలా తెలుసు? " ఆశ్చర్యపోయాడు కిశోర్.

"ఆ మాత్రం తెలుసుకోలేనా? " నవ్వాడు.

తనూ నవ్వేశాడు కిశోర్.

"అంతగా ఇష్టపడుతున్నావా? అయితే మా బాబాయిని అడగనా? "

"అసలు శ్రీదేవి అభిప్రాయం ఏమిటో? నేనంటే తనకి ఇంట్రస్టు ఉందో, లేదో!"

"ఆ విషయం నేను కనుక్కుంటాగా అయినా నీకేం తక్కువరా? ఆడపిల్ల. సామాన్యమైన కుటుంబంలో పెరిగింది. సూటిగా ఏం చెప్పగలదు? నేను శ్రీదేవినీ, బాబాయినీ అడుగుతాను. ఏమంటావు? "

కాసేపు ఆలోచించాడు కిశోర్. "సరే... నీ ఇష్టం!కానీ ఎవరినీ బలవంతం చెయ్యకు. నాకు అలా ఇష్టం ఉండదు."

"అలాగేలే. బలవంతం ఏమీ ఉండదు. అందరూ ఇష్టపడతారు. రెండు రోజుల్లో మనం వెళ్ళిపోతున్నాం. ఇన్ని రోజులుగా వాళ్లూ నిన్నూ చూస్తూనే ఉన్నారు. నీ సంగతులన్నీ వాళ్లకీ తెలుసుగా!" అన్నాడు.

> బలవంతం ఏమీ ఉండదు. అందరూ ఇష్టపడతారు. రెండు రోజుల్లో మనం వెళ్ళిపోతున్నాం. ఇన్ని రోజులుగా వాళ్లూ నిన్నూ చూస్తూనే ఉన్నారు. నీ సంగతులన్నీ వాళ్లకీ తెలుసుగా!

13

సాయంత్రం వేళ పని మనిషి మొక్కలకి నీళ్ళు పట్టి వెళ్లింది. శ్రీదేవి మొక్కల్లో తిరుగుతోంది. గేటుకి అటూ, ఇటూ పెద్ద కొబ్బరి చెట్లున్నాయి. మందారం, సంపెంగ, నందివర్ధనం ఇంకా రకరకాల పూల చెట్లుముందు వాకిలి నిండా ఉన్నాయి. రంగు రంగుల పూలతో, సువాసనతో ఆ ప్రదేశమంతా నిండిపోయింది.

"శ్రీదేవీ!" ఆమెకు చేరువగా వస్తూ పిలిచాడు రవివర్మ.

అతడి పిలుపు విని తలతిప్పి చూసిన శ్రీదేవి "ఏమిటన్నయ్యా" అంది.

"కిశోర్ గురించి నీ అభిప్రాయమేమిటి? " ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా సూటిగానే అడిగాడు.

తన పేరు వినబడి విషయం తన గురించేనని తెలిసిన కుతూహలం, శ్రీదేవి అభిప్రాయం ఏమిటో తెలుసుకోవాలన్న కోరిక కిశోర్‌ని అక్కడే ఉండేటట్లు చేశాయి - చాటుగా వినడం సభ్యత కాదని తెలిసినా. కిశోర్ అక్కడ ఉన్నట్లు వాళ్లకు తెలిదు.

"కిశోర్‌ని గురించిన అభిప్రాయం నాకేం ఉంటుంది? " కొంత అనాసక్తతే ధ్వనించింది శ్రీదేవి మాటల్లో.

"ఏమీ లేదా? "

"ఏముంటుందన్నయ్యా? అతను నీకు స్నేహితుడు, నీ కొలీగ్. నీతోపాటు మన ఊరు చూడాలని వచ్చాడు. మంచివాడే, అయినా ఎందుకడుగుతున్నావు? " అంది కాస్త ఆశ్చర్యంగా.

"ఎందుకంటే కిశోర్‌కి నువ్వు చాలా నచ్చావు. నీ అందచందాలూ, నీ పద్ధతులూ, నీ మాట తీరూ అన్నీ వాడికి చాలా నచ్చాయి. నిన్ను చాలా ఇష్టపడుతున్నాడు. నీకూ వాడు నచ్చితే బాబాయితో కూడా మాట్లాడి..."

"మా ఇద్దరికీ పెళ్లి చెయ్యాలి అంటావు!" రవివర్మ మాటల మధ్యలోనే అందుకుని అంది.

"అవును." నవ్వుతూ తలూపాడు.

"సారీ అన్నయ్యా! నాకు మీ కిశోర్ మీద అటువంటి ఆలోచనా లేదు, అభిప్రాయమూ లేదు, పైగా మీ ఆర్మీలో వున్నాడు. వాళ్ల జీవితమే గ్యారంటీ లేదు. ప్రతిక్షణమూ భయమే. నిన్ను చూస్తూనే వున్నాం కదా!"

"పిచ్చి శ్రీదేవి! అసలు జీవితంపై గ్యారంటీ ఎవరికుంటుంది? మరుక్షణంలో ఏం జరుగుతుందో మనకి తెలియదు. బతికిన నాలుగు రోజులూ దేశం కోసం బతకటంలో ఎంత ఆనందం ఉందో తెలుసా? "

"అవన్నీ నాకు తెలియవన్నయ్యా! మీ ఆర్మీవాళ్ల జీవితానికీ, బయట, మా సివిలియన్ జీవితాలకీ చాలా తేడా వుంటుంది. నాకు ఆ రకం జీవితం నచ్చదు." మెల్లగానే చెప్పినా, తన అభిప్రాయాన్ని స్పష్టంగానే తెలియచేసింది. మాట్లాడలేదు రవివర్మ.

"నా ఆలోచనలు వేరన్నయ్యా! బాగా చదువుకున్న ఏ ఇంజినీర్నో పెళ్లి చేసుకుని విదేశాలకి వెళ్లాలనే కోరిక ఉంది" అని ఇంకేదో చెప్పబోయేంతలో శ్రీదేవి తండ్రి రంగారావు వచ్చాడు అక్కడికి. - "ఏమిటిరా రవీ!" అంటూ.

"ఏం లేదు బాబాయి!" అన్నాడు. విషయం ముగిసిపోయినట్టే. ఇంక తను బాబాయితో చెప్పేంత విషయమేమీ కాదు అనుకున్నాడు రవివర్మ.

"ఏమిటమ్మా సంగతి? " కూతురిని అడిగారు మొత్తానికి వాళ్లు ఏదో ముఖ్యమైన విషయమే మాట్లాకుంటున్నారు అనిపించింది ఆయనకి.

కాస్త సిగ్గూ, అభిమానంగా అనిపించినా విషయం చెప్పింది శ్రీదేవి.

"అదా! ఒరే రవీ! నీకు అసలు బుద్ధి లేదురా!" అన్న కొడుకు కావడంతో చనువుగా అన్నాడాయన.

"ఏమైంది బాబాయి? "

"లేకపోతే ఏంటిరా! మీ అమ్మా, నాన్నా ఏమీ అనలేదుగానీ అసలు నువ్వు మిలిటరీలో చేరటం నాకు ఇష్టం లేదు. మీ నాన్నకి నేను చెప్పినా వినిపించుకోలేదు. అప్పటి నుంచీ నువ్వు ఎప్పుడో వస్తావు, ఎప్పుడో వెళ్తావు. నీ భార్య, కొడుకూ ఇక్కడ, నువ్వు నీ ఉద్యోగం మూలంగా ఎక్కడెక్కడో వుంటావు. అటువంటిది ఇప్పుడు మీ ఆర్మీవాడికి నా కూతురిని ఎలా ఇస్తాననుకున్నావు? అయినా అతనికి నా అనేవాళ్ళు ఎవరూ లేరన్నావు. ఒకరకంగా అనాథ అతను! తాడూ, బొంగరం లేనివాడు. మీ ఆర్మీలో ఉద్యోగం ఒక్కటే మీ కిశోర్‌కి ఆధారం. అలాంటి వాడికి నా కూతురిని ఇవ్వాల్సిన అవసరం ఏమిటిరా? .

రేపు అదృష్టం బాగుండక, ఏ కాలో, చెయ్యో విరిగితే ఆ ఉద్యోగం కాస్తా ఊడిపోతుంది. అతని బతుకే అతనికి బరువవు

## సూపర్ 'ఇ'



ఇ విటమిన్‌ను మిగతా విటమిన్ ఇంకోటి లేదయా' అంటే ఇంతకీ ఏ 'విటమిన్ చెప్పవయ్యా' అని అడిగాడట. అంతేకదా మరి. ఎందుకంటే అన్ని విటమిన్లనీ మించినది 'ఇ' విటమిన్ అని పరిశోధనలు తెలుస్తున్నాయి. 65 దేశాలలోని 11,000 మందిపై అమెరికాలోని ఓ రీసెర్చి సంస్థ పరిశోధనలు చేసింది. ఈ పరిశోధనల ప్రకారం రోజూ తప్పనిసరిగా 'ఇ' విటమిన్ తీసుకునేవారికి గుండె జబ్బు వచ్చే అవకాశం ఇతరుల కన్నా 41 శాతం తక్కువగా ఉంటుందని తేలింది. విటమిన్ 'ఇ'ని క్రమం తప్పకుండా సేవిస్తే గుండెపోటు ఆమడదూరంలో ఉంటుందట. పొగ తాగటం వల్ల కలిగే నష్టం తగ్గుతుందట. 'ఇ' విటమిన్ పాలకూరలో, వేరుశెనగల్లో అధికంగా 100 యూనిట్లు 'ఇ' విటమిన్ కావాలంటే పాలకూరనో, వేరుసెనగలనో 2.5 కిలోలు తూల్చి ఉంటుంది. ఆరోగ్యం బాగానే ఉన్నా, రోజూ వ్యాయామం చేస్తూనే ఉన్నా సమతౌల్య ఆహారం తీసుకుంటూనే ఉన్నా రోజూ విటమిన్ 'ఇ' తీసుకుంటే వందేళ్లు హాయిగా బతకవచ్చని పరిశోధకులు అంటున్నారు.

తుంది. ఇంక పెళ్లి చేసుకుంటే పెళ్లాన్ని ఎలా పోషిస్తాడు? ఆ పెళ్లాం ఎలా బతుకుతుంది? అసలు నువ్వు ఇవన్నీ ఆలోచించావా? "కాస్త గట్టిగానే అన్నాడు రంగారావు.

"బాబాయ్! చాలా దారుణంగా మాట్లాడుతున్నావు నువ్వు! ఆర్మీ వాళ్ళ మీద నీకు ఎందుకంత అయిష్టం? తేలిక భావం? దేశంలో ముందుగా గౌరవించాల్సిందీ, ప్రేమించాల్సిందీ వాళ్లనే. వాళ్లే అహర్నిశలూ మన దేశాన్ని దేశ ప్రజల్ని కాపాడుతున్నారని తెలుసా? వాళ్ల తరువాతే ఏ నాయకుడైనా, ఏ రాజకీయ నాయకుడైనా" కోపం వచ్చింది రవివర్మకి.

"తెలుసురా! తెలుసు. మీ ఆర్మీ వాళ్ళంటే నాకు అయిష్టమూ లేదు, ద్వేషమూ లేదు, అగౌరవం అంతకంటే లేదు. పైగా చాలా గౌరవం కూడా. ఒకవేళ నిన్ను ఏమైనా నొప్పిస్తే నన్ను క్షమించరా!" తన తొందరపాటు తెలుసుకుని బాధపడ్డాడు రంగారావు.

"ఛ!ఛ అంతమాట ఎందుకులే బాబాయ్! మా ఆర్మీ వాళ్లనీ, మా కిశోర్‌నీ అంటే నాకు కోపం వచ్చింది. ఆర్మీ వాళ్ల జీవితాలే కాదు అసలు ఏ ప్రాణి జీవితం మరుక్షణంలో ఏమవుతుందో ఏం గ్యారంటీ వుంది? ఎగిరే పక్షి ప్రమాదవశాత్తూ చచ్చిపోవచ్చు లేకపోతే రెక్కలు విరగొచ్చు మరి దాని బ్రతుకేమిటి? రోడ్డు మీద వెళ్లే మామూలు మనిషికీ ప్రమాదం జరగవచ్చు కాలో చెయ్యో విరగచ్చు. లేకపోతే ప్రాణమూ పోవచ్చు అలా జరగదని నువ్వేమైనా గ్యారంటీ ఇవ్వగలవా బాబాయ్? కిశోర్ అనాథే కావచ్చు కానీ వాడు పుడుతూనే అనాథ కాలేదు, అనాథగానూ పెరగలేదు. తల్లితండ్రులు, చెల్లెలు మధ్య పెరిగాడు. వాడు ఆర్మీలో వుండగా వాళ్ల అమ్మా, నాన్నా, చెల్లెలూ శ్రీశైలం వెళ్తూ యాక్సిడెంటు జరిగి చనిపోయారు. వాడు పెళ్లి చేసుకుంటే వాడి పెళ్లాం వైపు వాళ్లందరూ వాడి వాళ్లు కారా? ఏదైనా మన భావనలోనే ఉంటుంది" రవివర్మ కాస్త సీరియస్‌గానే అన్నాడు.

"రవీ! ఏమైనా చెప్పు! నా స్వార్థం నాకుంది. శ్రీదేవికి పెళ్లి సంబంధాలు చూస్తున్నాం. ఇప్పటికి చాలానే చూశాం. దాని కోరికలు దానివి. కొన్ని సంబంధాలు దానికి నచ్చటం లేదు. కొంత మందికి శ్రీదేవి పల్లెటూరి పిల్ల అని, విదేశాలకి వెళ్లితే కష్టమని నచ్చటం లేదు. పిల్లల కోరికలు తీర్చటం తల్లితండ్రులుగా మా బాధ్యతరా! పెద్ద దానికి కూడా మంచి సంబంధం చేశాను. అది సుఖంగా వుంది. శ్రీదేవికి కూడా ఏ అమెరికా సంబంధమైనా చెయ్యాలని నా కోరిక. దాని కోరిక కూడా అదే.

మంచి ఇంజినీరింగ్ చదువూ, అందచందాలూ, మంచి సంపాదనా అన్నీ వున్న వాళ్లనే చూస్తాను కాస్త ఆలస్యమైనా సరే. అంతేగానీ మామూలు సంబంధం చెయ్యను" ఖరాకండిగా చెప్పాడు రంగారావు.

ఇంక ఈ విషయంలో మాట్లాడడానికి ఏమీలేదనిపించింది రవివర్మకి.

అక్కడే దూరంగా వాళ్లకి కనబడకుండా నిలబడి, వాళ్ల సంభాషణ విన్న కిశోర్ శ్రీదేవి విషయంలో తనకిక ఎటువంటి ఆశా వుండకూడదు అనుకున్నాడు. 'అసలు శ్రీదేవికే తన మీద అటువంటి అభిప్రాయం లేదు. తన జీవితమంటే చులకన వ్యక్తం చేసింది. ఇంక ఈ విషయంలో ఎవరు చేయగలిగిందేమీ లేదు' అనుకున్నాడు.




సెలవు పూర్తయిపోవటంతో తిరిగి వెళ్లిపోయారు కిశోర్, రవివర్మ. వెళ్లేముందు రవివర్మ ఇంట్లోని వారందరూ అతడికి భారమైన హృదయంతో వీడ్కోలు పలికారు. రవివర్మతో పాటు కిశోర్‌కి కూడ వాళ్లని వదలి వెళ్లటం దిగులుగా, విచారంగా అన్పించింది.

రవివర్మ శ్రీదేవితో, రంగారావుతో మాట్లాడిన తరువాత ఉన్న నాలుగు రోజులు ఆ కుటుంబంలోని వాళ్లు మాత్రం కిశోరంటే కొంత అనాసక్తంగానే వున్నారు. శ్రీదేవి ఆ నాలుగు రోజులూ రవివర్మ ఇంటికి రాలేదు. రవివర్మే వెళ్లొస్తూ వుండేవాడు.

మొదట తను వచ్చినప్పుడు చూపించిన గౌరవం, మర్యాద తలుచుకొని మనసులో మాట రవివర్మ ద్వారా బయటపెట్టి, వాళ్ల దృష్టిలో చులకనై పోయాననిపించింది కిశోర్‌కి. వాళ్ల ప్రవర్తనలోని మార్పుని గ్రహించలేని అమాయకుడేం కాదు. అనవసరంగా తను బయటపడిపోయానేమోనని కూడా అనుకున్నాడు. ఈ విషయం అసలు ప్రస్తావించకుండా వుండివుంటే బాగుండేదేమో! ఎక్కడో కొండకి నిచ్చెన వేశాడు తను! అలా ఎక్కడం సాధ్యం కాదని తెలుసుకోలేకపోవటం కేవలం తన అజ్ఞానమే! తనెందుకు అనవసరంగా ఆశపడ్డాడో అర్థంకాని విషయమే. శ్రీదేవిని చూసిన క్షణం నుంచీ తనలో ఏదో విపరీత స్పందన, ప్రేమ, ఆకర్షణ. అది సహజమేనా? ఒక స్త్రీని చూసి అలా స్పందించి, పరవశించి, ఆమెతో జీవితం గడపాలనుకోవటం సహజమే. కానీ ప్రయోజనం లేని స్పందనే అయ్యిందది.

డ్యూటీలో చేరిన తరువాత మళ్లీ అదొక ప్రపంచం. కాలం ఎలా పరుగెడుతుందో తెలియదు. డ్యూటీలో ఉన్నంతసేపూ కర్తవ్యం, బాధ్యత తప్ప, మరొకటి గుర్తుకు రాదు. బూటు కాళ్ల చప్పుళ్లు, తుపాకులు, బాంబుల మోతలూ, అప్పుడప్పుడూ అమాయక ప్రజల ఆర్తనాదాలూ! ఎన్నో ఎన్నెన్నో!

నిరంతరం కర్తవ్య భారంతో గడిచే జీవితంలో కూడా కాస్త విశ్రాంతి లేదా ఖాళీ సమయం దొరికితే ఆ సమయంలో కిశోర్ మనసెందుకో కలుక్కుమంటుంటుంది.

## సతికంటే శునకం మిన్న

అతి సర్వత్ర వర్జయేత్ అన్నారు పెద్దలు. ఎంత మంచి పనికైనా ఇది వర్తించక తప్పదు. జీవ కారుణ్యం హర్షణీయమే కానీ అది మితిమీరి నా కడుపుకే ఎసరు పెడుతోందంటూ ఓ వృద్ధ సతీమణి గగ్గోలు పెడుతోంది. అంతటితో ఆగక ఆవిడ కోర్టు గడప కూడా తొక్కింది- విడాకులిప్పించమంటూ. ఆవిడగారి పేరు ఎలిజా బార్బు (70), భర్త పేరు మిర్సియా. రుమేనియాకు చెందిన ఈ వృద్ధ దంపతులకు యాభై ఏళ్ళ వైవాహిక జీవితం సాఫీగానే గడచిపోయింది. ప్రస్తుతం పింఛనుమీద జీవనం సాగిస్తున్నారు. ఈ మధ్య మిర్సియాకు ఎందుకోగానీ, వీధి కుక్కల మీద వల్లమాలిన జాలి, దయ పుట్టుకొచ్చేశాయి. దాంతో ఆయనగారు కొన్నాళ్ల క్రితం వాటికి కాస్త కాస్తగా తిండి పెట్టడం మొదలెట్టాడు. క్రమంగా ఆ అలవాటు పెరిగి పెరిగి తన ఆకలి, ఇల్లాలి ఆకలి గురించి పట్టించుకోకుండా ప్రస్తుతం ఓ ఇరవైకి పైగా వీధి కుక్కల్ని రోజూ ముప్పూటలా మేపుతున్నాడు. రోజుల తరబడి ఆకలితో నకనకలాడలేక ఆ వృద్ధ ఇల్లాలు అవస్థలు పడీ పడీ- ఇక ఈ చాదస్తపు మొగుడుతో వేగలేను, ఈ ఆకలినీ తట్టు కోలేను. యాభై ఏళ్ళ దాంపత్య జీవితాన్నీ ఒగ్గేసుకుంటాను. నన్నాదుకుని విడాకులిప్పించి క్షుద్బాధ తీర్చండంటూ కోర్టువారిని శరణుజొచ్చింది. మాజీ డిక్టేటర్ నికొలె సెసెస్క్యూ జంతు ప్రేమికుడు కావడంతో ఆయన అప్పట్లో వీధి కుక్కల సంహారానికి ఒప్పుకోలేదు. దాంతో వాటి సంఖ్య పెరిగిపోయి ఇప్పుడు రుమేనియా నగరాలలో ఓ పెద్ద సమస్యై కూర్చుందట.



## హమ్‌తుమ్ జైల్‌మే బంద్ హో...

మతిమరుపుతో మహా ఇబ్బందులెదురవుతుంటాయని అందరికీ తెలిసిందే. ఆ మతిమరుపు ఉన్న వ్యక్తికే ఇబ్బందులు పరిమితం కాక ఒక్కోసారి ఇతరులనూ ఇరకాటంలో పడేసి ఉసూరుమనిపిస్తాయి. ఆస్ట్రియాలో ఓ పదహారేళ్ళ అమ్మాయి విషయంలో అదే జరిగింది. జైలు సిబ్బంది మతిమరుపు వల్ల ఆ అమ్మాయి ఓ రాత్రంతా జైలులో గడపాల్సి వచ్చింది. అయితే ఒంటరిగా కాదు లెండి- బోయ్‌ఫ్రెండ్ సమక్షంలో. అది బాగానే ఉన్నా ఇంట్లో వాళ్లు ఎంత కంగారు పడుతుంటారోనని ఆ టీనేజి అమ్మాయి విచారంగా నిట్టూరుస్తూ గడిపిందట. 20ఏళ్ళ బోయ్‌ఫ్రెండ్ మాదక ద్రవ్యాల కేసులో రెండేళ్ళ జైలు శిక్ష అనుభవిస్తుంటే చూడడానికొచ్చి అతడితో కబుర్లు చెప్పుకుంటున్న ఆమెకు కాలమే తెలియలేదట. రెండు గంటలు దాటి పోయాక సమయం చూసుకుని నాలుక్కరుచుకుందట. మిలాఖత్‌కు గంట మాత్రమే అనుమతించే జైలు సిబ్బంది కోసం దిక్కులు చూసిందటగానీ ఎవరూ కనిపించలేదట. వాళ్లు ఆ అమ్మడి సంగతి మరచిపోయి ఎంచక్కా జైలు ద్వారబంధాల్ని మూసేసి తాళం కప్పలు బిగించేసి వెళ్ళిపోయార్ట. అయ్యో సెల్ ఫోన్ కూడా లాగేసుకున్నారు. ఇంటికి కబురెలా చేరవేసేదని ఆ అమ్మడు బాధపడుతూనే బోయ్‌ఫ్రెండ్‌తో పాటు తెల్లారి సిబ్బంది వచ్చేదాక ఉసూరుమంటూ నిరీక్షించిందట. పొద్దున జైలు సిబ్బంది వచ్చి తలుపు తెరచి ఆ యువజంటను చూసి బోలెడంత ఆశ్చర్యంతో నోరెళ్ళబెట్టి ఆ అమ్మడిని పంపించేశారట.



# వాక్

## కడుపు తిప్పల రికార్డులు

మనిషికో చిత్తము అన్నట్లుగానే మనిషికో సరదా దురద కూడా ఉంటుంది. ఆ దురద తీరిపోయేదాక చిత్తం కుదురుగా నిలువనీయదు. అది ఎంత ఎక్కువగా ఉంటే అంత ఎక్కువ స్థాయిలో వింతలు, రికార్డులు సృష్టించబడతాయి. అలాంటి సరదా దురద అమితంగా ఉన్న బ్రెజిలియన్ మంచులో కూరుకుపోయి అందరిచేతా ఔరా అన్పించి ప్రపంచ రికార్డు సృష్టించాడు. గిల్బర్టో క్రేజ్ (42) అనే అతగాడు ఒక గంటా ఆరు నిమిషాల ఇరవై నాలుగు సెకండ్లు ఐస్‌లో ఉండిపోయి ఏమాత్రం గడ్డ కట్టకుండా నింపాదిగా బయటకొచ్చాడు. రిబీరోప్రెటో అనే నగరంలోని ఒక షాపింగ్ మాల్‌లో ఏర్పాటు చేసిన పారదర్శకపు పెట్టెలో నింపిన ఐస్‌లో తల మాత్రం బయటకు పెట్టి ఈ ఫీట్ నిర్వహించాడు. ఇదే మాదిరి ఫీట్‌ను గతంలో చేసి సృష్టించిన తన రికార్డును తానే బద్దలు కొట్టుకుని సరికొత్త రికార్డు సృష్టించాడు. క్రజ్ నాలుగున్నర గంటల్లో 14000 బస్కీలు తీసి, 100 గంటలపాటు మేలుకుని ఉండి, ఒక గంట పాటు రెప్ప వేయకుండా చూసి, 42 గంటల పాటు ఏకబిగిన బట్టలు ఇస్త్రీ చేసి రికార్డులు సృష్టించాడు. ఈ రికార్డుల సరదా గురించి అడిగితే, 'మహాప్రభో ఇది సరదా కాదు. పేదరికంలో మగ్గుతూ జీవన భృతి కోసం రికార్డుల బ్రహ్మగా మారాన'ంటూ ముక్తాయింపు ఇచ్చాడు. బహుశా ఇదీ ఓ రికార్డేనేమో.



## అహోహ్హో... కందిరీగ భోజనంబు

ఇది మరో సరదారాయుడి కథ. చైనాకు చెందిన ఇతగాడి పేరు జోంగ్ జీషెంగ్ (30). షౌగాన్ నగరానికి చెందినవాడు. జీషెంగ్ సరదా జిహ్వా చాపల్యానికి చెందింది. కందిరీగల వేపుడంటే లొట్టలేసుకోవడం అతడి చాపల్యమట. ఝుమ్మని రొద పెడుతూ, సూది మొనలాంటి కొండెంతో కసుక్కున కుట్టే కందిరీగల్ని పట్టుకోవడంలో అతగాడు నిష్ణాతుడు.

కందిరీగ తుట్టెల్ని చేరి ఒక ప్లాస్టిక్ బ్యాగు, వెదురు కర్ర చేత బట్టి కాసింత పొగబెట్టి ఆ కీటకాల్ని బయటకు రప్పించి ఐదు నిమిషాల్లోపే వాటిని బంధించెయ్యడం జీషింగ్‌కు చేయి తిరిగిన ఆటట. కందిరీగల తుట్టెను తియ్యడం గుమ్మడికాయను కోసినంత తేలిక నాకు. వాటిని పట్టుకోవడం ఈగల్ని పట్టుకున్నంత సులభమని చెప్పుకునే జీషెంగ్ పదకొండేళ్ళ వయసులోనే తన తాతనుంచి ఆ విన్యాసం నేర్చుకున్నాడట. కందిరీగల్ని పట్టుకున్నందుకు సొమ్ము వసూలు చేయటం కానీ, ఆ కీటకాల్ని పట్టుకుపోవడానికి అనుమతించమని అడుగుతాడట. ఆనక ఇంటికి వెళ్ళి వాటిని వేయించుకుని ఆరగించేస్తాడట. అంతేకాదండోయ్ కందిరీగల్ని, వాటి ప్యూపాల్ని మద్యంలో కలుపుకుని జుర్రెయ్యడం కూడా ఆయనగారికి మహా సరదా అట.






జీవితమంటే అనురక్తిపోయి, విరక్తి కలుగుతోంది. ఓ స్త్రీ మీద తను అంతగా మనసు పారేసుకుంది ఇప్పుడే. తన మనసుని కదిలించిందీ శ్రీదేవి మాత్రమే. ఆ శ్రీదేవి మనసులో తనకు చోటు సంపాదించడానికి తను చేయగలిగింది ఏమీ లేదని సరిపెట్టుకుంటున్నా ఆమె గుర్తుకు రాగానే తన మనసు కలతపడుతోంది. ఎంత వద్దనుకున్నా స్మృతి పథంలో ఆమె రూపం చెర గిపోవడం లేదు. ఆమె గురించిన ఆలోచనలతో సత మతమవుతుంటాడు.

"ఏమిటిరా కిశోర్ అంత దీర్ఘాలోచన? " ఇంట్లోని వా ళ్లందరికి ఉత్తరాలు రాయడం ముగించిన రవివర్మ కిశోర్ ని చూసి అతడి మనసు ఎక్కడో ఉందని గ్రహించి అ డిగాడు.

రవివర్మలా తనకెటువంటి బంధాలూ, అనుబంధాలూ, రక్త సంబంధాలూ ఏమీలేవు. ఒకరకంగా నిశ్చింత! మరొక రకంగా ఒంటరితనంలోని మూగ వేదన.

"ఏం లేదురా!" అన్నాడు. చేతిలో డ్రింకు గ్లాసు వుంది. వర్మకూడా ఒక గ్లాసులో డ్రింకు పోసుకుని వచ్చాడు. కిశోర్ వంకే చూస్తూ, నీ మాటలు నమ్మమం టావా? అన్నట్లు "ఏంలేదా" అన్నాడు చిన్నగా నవ్వి.

"నువ్వీ మధ్య బాగా డిప్రెసివ్‌గా ఉంటున్నావు. ఊరినుంచి వచ్చినప్పటి నుంచి మరీను."

"అదేం లేదులే!" చేతిలోని గ్లాసుని తమాషాగా, మెల్లగా తిప్పుతూ దాన్నే చూస్తూ అన్నాడు కిశోర్.

"ఆహా అలాగా నువ్వేంలేదన్నంత మాత్రాన నమ్మే స్తానా? నువ్విలా ఉండడానికి కారణం కూడ నాకు తెలుసు." డ్రింక్ కొద్దిగా గుటకేసి అన్నాడు రవివర్మ.

"కారణమూ లేదు, కాకరకాయ లేదు అంతా నీ ఊహ."

"చూడు కిశోర్! శ్రీదేవిని చూసి ఇష్టం పెంచుకు న్నావు. నిజమే. మరి తను ఇష్టపడలేదు. వదిలెయ్యి. మ్యారెజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్' అన్న సామెత ఉంది కదా! అసలు నీకో విషయం తెలుసా? "

'ఏమిటి? ' అన్నట్టు చూశాడు కిశోర్. అలా చూస్తూ నే గ్లాసులోని ద్రవాన్ని రెండు గుటకలు వేశాడు.

"శ్రీదేవి గురించి ఆలోచించకు. దాన్ని మర్చిపో. తను ఎన్నో కలల్లో తేలిపోతోంది. దాని కోరికలు ఎన్నో! తీరేవి కొన్నైనా వుంటాయాని అనిపిస్తోంది నాకు."

"అలా ఎందుకనుకుంటావు వర్మా! తీరు తాయేమో! కోరికలు వుండటం, ఆశలు వుండటం తప్పకాదుగా"

"కోరికలు వుండటం, ఆశలు వుండటం తప్పుకాదు, నేరమూ కాదు. అవి వుండాలి కూడా. కానీ నువ్వు ఎక్కడ నిలబడ్డావో తెలుసుకుని ఆ తరువాత ఆకాశాన్ని అందు కోవటానికి ప్రయత్నించు. బాగుంటుంది. మనిషి అంటే మనిషి తయారు చేసిన ప్రాణి కాదురా! మనిషి నుంచి తయారైన ప్రాణి మాత్రమే అందచందాలు మనం కావాలనుకుంటే మనకి నచ్చినట్లుగా వచ్చేవి కావు. ఉన్నవాటిని మెరుగుపరుచుకోవటమే మనిషి ప్రయత్నం."

"ఇప్పుడిదంతా నాకెందుకు చెబుతు న్నట్టు?" అర్థం కానట్లు ముఖం పెట్టాడు కిశోర్

"షటప్! మాట్లాడకుండా విను!" వర్మచే తిలో గ్లాసు ఖాళీ పూర్తి అయింది. మళ్లీ కొద్దిగా నింపుకున్నాడు.

'వీడికి కాస్త ఎక్కింది!' అనుకున్నాడు కిశోర్.

"శ్రీదేవి కోరికలకి అంతులేదురా కిశోర్! ఆరు అడుగుల అందగాడూ, సరస్వతీ దేవి వరించిన చదువుల కోవిదుడు, లక్ష్మీ పుత్రుడు, మనదేశం కాకుండా విదేశాల్లో ఏ అమెరికా, ఇంగ్లాండులోనో వుండేవాడూ -ఇలా ఎన్నో కోరికల్ని నింపుకుని అవన్నీ ఉన్నవాడిని వెతుక్కుంటోంది. ఎక్కడా దాని కోరికల లిస్టుని కొంచెం కూడా సడలించా లనే ఉద్దేశ్యం కూడా లేదు. అందుకే దాని పెళ్లి కుదరటం ఆలస్యమవుతోంది. దానికి సపోర్టు మా బాబాయి. చూడు కిశోర్! నువ్వు ఎక్కువగా ఆలోచించి, మనసు పారే సుకునేంత అర్హత శ్రీదేవికి లేదు. సంస్కారం అనేది ఒకటి ఉండాలి కదా! అనవసరంగా ఎక్కువగా ఆలోచించి మనసు పాడుచేసుకోకు" జ్ఞానబోధ చేస్తున్న ట్లు అన్నాడు.

పెద్దగా నవ్వేశాడు కిశోర్.

"ఎందుకంత నవ్వు?"

"సరే గురువుగారూ! ఇంతకష్టపడి నాకు బోధ చేశారు. నాకూ జ్ఞానోదయం అయిన ట్టే ఉంది. 'మనకి రాదు' 'మనదికాదు' అన్న దాన్ని గురించి తాపత్రయపడి, మనసు పాడు చేసుకోవటం అవివేకమే. నాకూ అర్థ మైంది."

"గుడ్‌బాయ్! ఈ సందర్భంలో ఇంకొక్క పెగ్గు గ్లాసులో వెయ్యి మిత్రమా!" అన్నాడు రవివర్మ నాటకీయంగా.




కార్గిల్ యుద్ధం, టెర్రరిస్టుల విధ్వంసం, బాంబుల వర్షం వెరసి కాశ్మీర్ అంతా బీభ త్సంగా వుంది. సైనికులకి ఊపిరాడని బాధ్యతలు. సరిహద్దుల్లో అహోరాత్రులూ కాపలా. అక్కడి ఘటనలో ప్రజల్లో విపరీ తమైన భీతిని కలిగిస్తున్నాయి. భయాందో ళనల్ని రేకెత్తిస్తున్నాయి. ప్రజలు ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని బ్రతుకుతున్నారు. కొన్ని ప్రదేశాల్లో పాఠశాలలు తెరవటానికి భయపడి మూసేశారు. దేవాలయాల్లో, గురుద్వారాల్లో సైనికుల కాపలా వుంది. కీలక ప్రాంతాల్లో సైనిక బందోబస్తు ఎక్కు వగానే వుంటోంది. అయినా ప్రజలు భయ పడుతున్నారు.

అస్తమానం తిరిగే సైనిక వాహనాలూ, అంబులెన్స్‌లూ, అప్పుడప్పుడూ వినిపించే బాంబుల ధ్వని ఉద్రిక్తంగా వుంది వాతావ రణమంతా.

రవివర్మ, కిశోర్, అజిత్‌సింగ్, చిదంబరం

నలుగురు కలిసి ఒక టెంటులో ఉంటున్నారు. నలుగురూ మంచి స్నేహితులు. ఎప్పుడు ఆ కుటీరానికి వస్తారో వాళ్లకే తెలియదు. ఎప్పుడు తిండి తింటారో, ఎన్ని గంటలు నిద్రపోతారో తెలియదు. ఎప్పుడు కబురు వస్తే అప్పుడు పరుగులు పెట్టవలసిందే! అర్ధరాత్రి పన్నెండూ, ఒంటిగంటా ఎంతైనా కావచ్చు వాళ్లు గుడారానికి చేరేసరికి. ఒక్కోసారి పోరాట ప్రాంతానికి వెళితే మళ్లీ నలుగురూ తిరిగి కలుస్తారో లేదో తెలియని అనిశ్చిత పరిస్థితి!

అయినా వాళ్లకి బాధలేదు, ఉండదు. క్షణమైనా తప్పని కర్తవ్యం ఆకలి తీరని కడుపు, సరిపోని నిద్ర గురించి ఆలోచించనీయదు. దేశాన్ని రక్షించాలనే బాధ్యత, శత్రువుని తుదముట్టించాలనే కర్తవ్యం ఎప్పుడూ మెదడును అంటి పెట్టుకొని ఉంటాయి. అలుపెరుగని బాధ్యత, మరువని కర్తవ్యం ఒక్కటే తన ధ్యేయంగా ప్రవర్తిస్తూ ప్రాణాల్ని కూడా లెక్కచెయ్యకుండా, చలిలో, వానలో, ఎండలో బ్రతుకుతూ ఈ దేశానికి కాపలా కాసే సైనికుడిలో ఒక్కటే ఆలోచన దేశరక్షణ! శత్రువుల సంహారం! తోటి సైనికుడికి గాయమైతే ఏదైనా సహాయం చెయ్యాలనే బాధ్యత తప్ప, తన వాళ్లకి ఏ అనారోగ్యం వచ్చినా వెంటనే వెళ్లలేని పరిస్థితి ఉన్నా బాధపడడు. ఆ త్యాగమూర్తులు మన దేశాన్ని అహర్నిశలూ కాపలా కాసి, రక్షిస్తూవుంటే- మనలో కొందరికి బాధ్యత, కర్తవ్యం అంటే ఏమిటో తెలియదు. దేశానికి ఏదైనా మంచి చెయ్యాలనే ఆలోచన అంతకంటే వుండదు.

ఆ టెంట్‌లో ఉన్న నలుగురిలో కిశోర్ ఒక్కడే బ్రహ్మచారి. టెంట్‌లో వుండే కొద్దిపాటి సమయంలోనే కొంచెమైనా తీరిక చేసుకుని, తమవారి కోసం తాపత్రయం, ఆరాటం, ఆనందం వ్యక్తం చేస్తుంటారు ముగ్గురూ. రవివర్మ ఆ ఉన్న కొద్ది సమయంలో తల్లి తండ్రులకీ, భార్యకీ, అప్పుడప్పుడూ అత్తమామలకీ ఉత్తరాలు రాస్తూ ఉంటాడు.

వాళ్ల దగ్గరినుంచి కొత్త ఉత్తరం వచ్చేవరకూ అంతకు ముందు వచ్చిన పాత ఉత్తరాల్నే చదువుకుంటాడు. కొడుకు చేసే చిలిపి అల్లరి, భార్య రాధ వ్యక్తం చేసే అనురాగం, తల్లితండ్రుల ప్రేమ నిండిన ఆ ఉత్తరాలు చదివినప్పుడల్లా అతడికి కొత్త ఊపిరి వచ్చినట్లుంటుంది. అవే అతడికి ఆనందంతో పాటు, కొండంత ధైర్యాన్ని ఇస్తూవుంటాయి.

అజిత్‌సింగ్‌కి తల్లి వుంది. తండ్రి కూడా కూడా సైనికుడే! భారత్, బంగ్లాదేశ్ యుద్ధ సమయంలో మరణించాడు. అప్పటికి అజిత్‌సింగ్‌కి నాలుగేళ్లు అతని అన్నకి ఆరేళ్లు. తల్లి వాళ్లని పెంచటానికి చాలా కష్టపడింది. ఉన్న నాలుగు ఎకరాల పొలం కష్టపడి సాగు చేసుకుంటూ వాళ్లని పెంచింది. అజిత్‌సింగ్, అతడి అన్నయ్య సుర్జీత్‌సింగ్ ఇద్దరూ భారత సైన్యంలో చేరారు. పాకిస్థాన్‌తో ఆరేళ్ల క్రితం జరిగిన యుద్ధంలో సూర్జిత్ ఎడమకాలును పోగొట్టుకుని, సైన్యం నుంచి వైదొలగాడు. ప్రస్తుతం జయపూర్ కాలు ఆసరాతో ఊళ్లో వ్యవసాయం చేసుకుంటున్నాడు. అతడికి భార్యా, ఒక కొడుకు.

అజిత్‌సింగ్ అందమైన భార్య అమృత, ముద్దులొలికే కూతురు సీమను తలుచుకుని మురిసిపోతాడు, ఆనందపడిపోతాడు.!

"జీవితం ఎంత అందమైంది భాయీ! ఈ టెర్రరిస్టుల పీడ వదిలిపోతుంది. మన దేశం హాయిగా, స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకుంటుంది. అప్పుడు మనకి అంతా ఆనందమే!" అంటాడు. ఎంతటి పాజిటివ్ థింకింగ్! రేపటి మీద, భవిష్యత్తు మీద ఎంత చక్కటి ఆశ అనిపిస్తుంది కిశోర్‌కి. ఆ పాజిటివ్ థింకింగ్‌కి ముగ్ధుడవుతుంటాడు.

చిదంబరం తమిళనాడు నుంచి వచ్చాడు. భార్యా, ఇద్దరూ పిల్లలూ, ముసలి తల్లిదండ్రులు తమిళనాడులో ఒక చిన్న పట్టణంలో ఉంటారు. చిదంబరం భార్య ఆ ఊళ్లోనే

టీచరుగా ఉద్యోగం చేస్తోంది. ఇద్దరు కూతుళ్లూ స్కూలుకి వెళ్తున్నారు.

తనకి ఎవరూ లేరు. ఎవరిగురించిన ఆ లోచనా లేదు. తనని గురించి ఆలోచించుకుంటే తనకి ఏ ఆలోచనా లేదు - ఒక్క శంకరం మాష్టారి గురించి తప్ప. సక్రమమైన మార్గంలో తనని నడిపించి, ఒక మనిషిగా, ఒక బాధ్యత గల పౌరుడిగా మలచిన ఒకే ఒక వ్యక్తి శంకరం మాష్టారు. ఆయన తనకి దైవం! ఆయనే లేకపోతే తనకి ఈ మాత్రం సంస్కారం ఎక్కడిది? శంకరం మాష్టారు ఇప్పుడు ఎక్కడ ఉన్నారో? ఎలా ఉన్నారో? ఏం చేస్తున్నారో! ఈ సారి ఎప్పుడైనా ఆయన ఆచూకి తెలుసుకుని కలవాలి. "మాష్టారూ! మీ మూలంగానే నేను ఇంతవాడిని అయ్యాను!" అని ఆయనికి చెప్పుకోవాలని వుంది. ఆలోచనలతో అలుపు వచ్చింది. కళ్లు మూతలు పడుతున్నాయి. నిద్ర ఆవరించింది కిశోర్‌ని.

* * *

ఆ రోజు రాత్రి భోజనాలు చేశారు. అజిత్ సింగ్, చిదంబరం నిద్రలోకి జారుకున్నారు.

"కిశోర్!" పిలిచాడు రవివర్మ. సిగరెట్టు వెలిగించుకుని. విపరీతమైన చలిగా ఉంది.

"ఏమిటిరా? " అన్నాడు కిశోర్. చలి తట్టుకోవడానికి నిలువెల్లా ఉన్ని దుస్తులు ధరించి వున్నాడు.

"రాధ నుంచి ఉత్తరం వచ్చిందిరా!' అన్నాడు.

"అలాగా! ఎలా ఉన్నారందరూ? "

"అందరూ బాగున్నారు. విశేషమేమిటంటే..." ఆగిపోయాడు రవివర్మ.

"ఊ ఏమిటి? "

"ఇన్నాళ్లకి... నువ్వు శ్రీదేవిని చూసి, మూడేళ్లైందికదూ! మధ్యలో నేనైనా ఒకేసారి మా ఊరికి వెళ్లి వచ్చాను"

"సరే సంగతేమిటి బాబూ!" విసుక్కొంటున్నట్లు అన్నాడు.

"శ్రీదేవికి పెళ్లి అయింది. ముప్పైఏళ్లు దగ్గరపడుతుండగా మొత్తానికి అది కోరుకున్నట్టుగానే అమెరికాలో వుంటున్న అబ్బాయిని చేసుకుని, అక్కడికి ఎగిరి పోయింది."

"అలాగా! గుడ్! ఆలస్యమైతేనేం? మొత్తానికి అనుకున్నది సాధించిందిగా! గ్రేట్!" అన్నాడు కిశోర్ అభినందన పూర్వకంగా.

"నిజమే గ్రేటే! కానీ ఆ కూతురి కోరిక కోసం మా బాబాయి రెండెకరాల ఖరీదైన పొలం అమ్మాల్సి వచ్చింది. చెల్లెలికి అంతఖర్చు పెట్టావు నాన్నా! నాకూ దానికి పెట్టి

## బ్రహ్మచారి కాదు..



ఓసారి ఓ సభలో కట్టమంచివారు పాల్గొన్నారు. అందులోని వక్తలు చాలామంది కట్టమంచిని ఎడాపెడా పొగిడేశారు. పండితుడనీ, విద్యావేత్తనీ, బ్రహ్మచారి అనీ ఇలా.. ఇలా.. ఊదర కొట్టేశారు.

ఆ తర్వాత కట్టమంచి ప్రసంగిస్తూ 'వక్తలు నన్ను బాగా పొగిడారు.. కృతజ్ఞతలు. అయితే బ్రహ్మచారని అన్నారు. ఆ పదాన్ని 'అవివాహితుడు'గా సవరించుకోవాలని ప్రార్థన' అన్నారు ముసిముసి నవ్వులతో.

వక్తలతోపాటు సభలోని వారంతా ఫక్కున నవ్వారు.

నంత డబ్బు ఇవ్వు అని పెద్దకూతురు పెడుతున్న పేచీతో మా బాబాయి సతమతమవుతున్నాడుట".

"అంతే, కొన్ని కావాలనుకుంటే కొన్ని ఇబ్బందులు తప్పవు మరి." అన్నాడు కిశోర్.

శ్రీదేవిని గురించి వినేసరికి కిశోర్ మనసు కాసేపు కదిలింది. 'ఎందుకు, ప్రయోజనం లేని విషయాన్ని గురించి ఆలోచించటం, బాధ పడటం పూర్తిగా వృథా శ్రమే!' అనిపించింది ఆ తరువాత.

"శ్రీదేవి బాగానే స్థిరపడిపోయింది. అనుకున్నది సాధించింది. నువ్వే పెళ్లి చేసుకోకుండా వున్నావు" అన్నాడు వర్మ. అతడి స్వరంతో కాస్త బాధ ధ్వనించింది.

"వర్మా! నాది ఒన్‌సైడ్ ఉన్న ప్రేమ మాత్రమే. ఎవరి జీవితం వారిది. త్యాగాలూ, విరహాలూ ఇలాంటి లక్షణాలు నాకేమీ లేవు. శ్రీదేవిని నేను ఇష్టపడ్డమాట వాస్తవం. తను ఒప్పుకుంటే పెళ్లి చేసుకోవాలనుకున్నమాట కూడా సత్యమే కానీ తనకి ఇష్టంలేదు. అంతమాత్రాన నాకేదో అన్యాయం జరిగిపోయిందని, నేను కృంగిపోలేదు, పోను కూడా. ఇక పెళ్లంటావా, గాలి మళ్లిన రోజున చేసుకుంటానులే"

"ఎప్పుడు! నువ్వు ముసలివాడివయ్యాకా ? "

"ఏమో! అప్పటికే వస్తుందేమో టైము!" జోక్‌గా అన్నాడు.

"పోరా! నీదంతా వింత పోకడ..." ఇంకేమీ అనలేక నిద్రకి ఉపక్రమించాడు రవివర్మ.

కొంతకాలనికి కార్గిల్ యుద్ధం సద్దుమణిగింది. మన సైనికులు ఉగ్రవాదుల్ని మట్టుపెట్టి, వాళ్ల వాళ్ల స్థావరాల్లోని యుద్ధ సామాగ్రిని స్వాధీనం చేసుకున్నారు.

కానీ అహరహమూ అప్రమత్తంగా వుంటున్నారు. జాగ్రత్తగా కాపలా కాస్తున్నారు. ఉద్రిక్తత కాస్త తగ్గింది.

ఒక పక్క 'శాంతి', 'స్నేహం' అంటూ, హద్దులూ, సరిహద్దులూ అంటూ బస్సుసౌకర్యం ఒప్పందం చేసుకొని ఏదో సాధిస్తున్నాం' అనుకుంటున్నాయి రెండు దేశాల ప్రభుత్వాలూ. మరొక ప్రక్క బాంబుల శబ్దాలూ, దాడులూ, అమాయక ప్రజల భయాలూ, మరణాలూ, సైనికుల వీరమరణాలూ జరుగుతూనే వున్నాయి.

కిశోర్, వర్మ, అజిత్‌సింగ్‌లతో పాటు వుంటున్న చిదంబరం ఉగ్రవాదుల దాడికి బలయిపోయాడు. బాధపడటం తప్ప, ఏమీ చేయలేని పరిస్థితి. అతని భౌతిక కాయాన్ని వాళ్ల ఊరికి పంపించారు. అన్ని సైనిక లాంఛనాలతో అంత్యక్రియలు జరిగాయి.

అజిత్‌సింగ్‌ని మరొక బ్యాచ్‌కి తరలించారు.

నెలలూ, సంవత్సరాలూ గడిచిపోతూనే వున్నాయి. రెండు ప్రభుత్వాలూ మారుతూనే ఉన్నాయి. మాటల్లోనే కానీ చేతల్లో ఆచరణ లేని ప్రభుత్వాలూ ఇరువైపులా శాంతి పావురాలు ఎగరేస్తూనే ఉన్నాయి. అయినా ఏ మార్పూ లేదు.

**ఎవరి జీవితం వారిది. త్యాగాలూ, విరహాలూ ఇలాంటి లక్షణాలు నాకేమీ లేవు. శ్రీదేవిని నేను ఇష్టపడ్డ మాట వాస్తవం. తను ఒప్పుకుంటే పెళ్లి చేసుకోవాలనుకున్న మాట కూడా సత్యమే కానీ...**

'ఎన్నెన్ని జ్ఞాపకాలు! ఎన్నెన్ని అనుభవాలూ! ఆనందం విచారం, చీకటి వెలుగుల్లా అతణ్ణి వెన్నంటే వున్నాయి. గతం గురించిన ఆలోచనల్లోనుంచి వర్తమానంలోకి వచ్చాడు కిశోర్. టెంటు బయట కూర్చుని వున్నాడు. ఆకాశంలో చంద్రుడు కదలిపోతున్నాడు. అది ప్లానెట్ గానీ, భగవంతుడు గానీ - ఆ ప్రయాణం ఆగిపోకూడదు. అలుపూ వుండకూడదు అలా జరిగిపోతూనే వుంటుంది కాలం. కాలంలో మార్పు రాదు. రకరకాల మార్పులూ మానవ జీవితంలోనే మనిషి తన నమ్మకాల్నీ, అలవాట్లనీ, ఆచారాల్నీ, ఆలోచనల్నీ మార్చుకుంటూనే వుంటాడు. మరో వైపు కాలం మారింది, మారిపోతున్నది అనుకుంటాడు. ఎంత జ్ఞానం, శక్తీ సంపాదించినా భగవంతుడి ముందు మనిషి అల్పజీవి, అజ్ఞాని మాత్రమే... అలా ఆలోచిస్తూనే, ప్చ్ ఎందుకో తనకి ఈ వేదాంతం అనుకున్నాడు కిశోర్.

గుజరాత్‌లో పెను భూకంపం బాధితులకు అవసరమైన సహాయక చర్యల కోసం ఆర్మీని కూడా తరలించారు. అలా పంపిన వారిలో కిశోర్ కూడా వున్నాడు. అనుకోకుండా అక్కడ కలిసిన శంకరం మాష్టారినీ, పాపనీ రైలు ఎక్కించి వచ్చాడు.

శంకరం మాష్టారు దేముడు. ఎక్కడో ఆంధ్రప్రదేశ్‌లో వుండి భూకంపం జరిగిందని తెలుసుకొని, ఇక్కడకి వచ్చి బాధితులకి తనకి చేతనైనంత సహాయం చేశారు. అంతేకాదు, అనాథగా మిగిలిన పసిపాపని పెంచుకోవటానికి తీసుకువెళ్లారంటే ఆయనది ఎంత గొప్ప మనసు!

'తన అదృష్టం బాగుంది, ఎంతో కాలంగా శంకరం మాష్టారిని చూడాలనీ, కలవాలనీ మనసులో కోరిక. ఆ కోరిక అనుకోకుండా ఇక్కడ ఈ రకంగా తీరింది. దేముడు చాలా దయామయుడు, చాలా తమాషాలూ చేస్తాడు. ఆలోచనల నుంచి బయటపడ్డాడు. నిద్రవస్తున్నట్టుగా వుంది. టైము చూసుకున్నాడు. అర్థరాత్రి రెండున్నర గంటలు దాటింది. టెంట్‌లోకి వచ్చి పక్కమీద వాలాడు. కొంతసేపటికి కునుకు పట్టింది. పైన చంద్రుడు అందంగా ఆకాశాన్ని ఏలుతూనే ఉన్నాడు.




మర్నాడు ఉదయమే మళ్లీ భూకంపం వచ్చిన స్థలానికి చేరుకున్నాడు కిశోర్.

భయంకరమైన పరిస్థితులు కూడా కాలంతోపాటు సద్దుమణుగుతూంటాయి. ప్రమాదవశాత్తూ కిందపడటం జరిగితే శక్తిని కూడదీసుకుని పైకిలేచి, నడక ప్రారంభించటమూ సహజమే!.

కిందపడిపోయిన మానవుడు బతుకు మీద కోరికతో, రేపటి మీద ఆశతో యాంత్రికంగానైనా, తప్పని సరిగా తన కర్తవ్యం గుర్తు చేసుకుంటాడు.

అక్కడ శవాలు ఏరివేత ఇంకా జరుగుతూనే ఉంది. అవి కుళ్లిపోయిన దుర్వాసనతో ఆ ప్రదేశమంతా నిండిపోయింది. భరించటం కష్టమే అయినా తప్పదు. మానవ ధర్మం ఒకటుందని నమ్మే మనుష్యులకి తమ డ్యూటీయే తమ ధ్యేయం. అది తన ఉద్యోగ ధర్మం కూడా అనుకుని సిన్సియర్‌గా పనిచేసే కిశోర్‌లాంటి వారూ, మానవతా దృక్పథంతో పనులు చేసేవారూ అక్కడ చాలా మంది ఉన్నారు. ఆ పనులు చేసిన తరువాత తిండి తినాలనిపించదు, ఎంత కాదనుకున్నా ఒక రకమైన అసహ్యం

కలుగుతుంది. అది మనసులోనుంచి బయటికి రాదు.

క్రేన్ల సహాయంతో కూలిపోయిన గృహాల తాలూకు శిథిలాలను తొలగించి, అక్కడి ప్రదేశాల్ని చక్కదిద్దుతూనే వున్నారు.

విపత్తు కొన్ని క్షణాల్లో, కొన్ని సెకనులలో జరిగిపోయింది. ఆ కాస్తపాటి సమయంలోనే పెనువిధ్వంసం సృష్టించిపోయింది. ఆ వినాశనాన్ని చక్కదిద్దటానికి ఎంతకాలం పడుతుందో!

రోజుకో ప్రదేశంలో సహాయక చర్యలో పాల్గొంటున్నాడు కిశోర్. ఆదేవిధంగా ఆ రోజు మరొక ప్రదేశానికి వచ్చాడు. అక్కడికి ఇంతకుముందు రెండుసార్లు వచ్చాడు. ఆ రోజు అక్కడ వేసిన టెంట్లనీ, అక్కడి వాళ్లని పరామర్శిస్తూ పని చేస్తున్నాడు. ఒక టెంటు బయట ఒంటరిగా కూర్చుని కళ్లు తుడుచుకుంటున్న ఓ యువతి చూశాడు.

కొద్దిగా ఆశ్చర్యం వేసింది కిశోర్‌కి. 'ఆ పక్కకి ఒకటి, రెండుసార్లు వచ్చాడు తను! ఈమె కనిపించలేదే!' అనుకున్నాడు. యూనిఫామ్‌లో అక్కడికి వచ్చిన కిశోర్‌ని చూసి, పమిటకొంగుతో ముఖం తుడుచుకుని, లేచి నిలబడిందా యువతి.

"నమస్తే! నన్ను చూసి నిలబడతారేమిటి? కూర్చోండి" అన్నాడు హిందీలో.

"నమస్కారం" అందామె కూర్చుంటూ.

తనూ అక్కడే ఓ రాయిమీద కూర్చున్నాడు.

"మీరిక్కడి వాళ్లేనా"? అడిగాడు ఆమె కట్టు బొట్టు గమనిస్తూ..

"మేము తెలుగువాళ్లం!" హిందీలో జవాబిచ్చింది.

"అలాగా! ఇంకేం! తెలుగులోనే మాట్లాడండి. నేనూ తెలుగువాడినే" అన్నాడు.

"..." ఏం మాట్లాడలేదు ఆ యువతి. కళ్లల్లో నీళ్లు మాత్రం ఉబికి వస్తున్నాయి మేమున్నామంటూ.

"మీ పేరు? " అడిగాడు కిశోర్.

"ఉష!"

"బాగుంది మీ పేరు. నా పేరు కిశోర్!" అని, "ఉండండి అక్కడ టీ వుంది తీసుకువస్తాను. ముందు మీరు కళ్లు తుడుచుకోండి' ' అని, దూరంగా టీ తయారుచేస్తున్న వాళ్ల దగ్గరికి వెళ్లి, రెండు ప్లాస్టిక్ కప్పులతో టీ తీసుకువచ్చాడు.

"నేను ఈ చుట్టుప్రక్కల తిరుగుతూనే వున్నాను గానీ మిమ్మల్ని గమనించలేదు" అన్నాడు.

"నేను మిమ్మల్ని గమనించాను. మీరు ఎంతో కష్టపడుతున్నారు. మీ దీక్షా, మీరు చేసే సర్వీసూ చాలా గొప్పవి. మీ తల్లితండ్రులు చాలా అదృష్టవంతులు".

కిశోర్ నవ్వాడు తమాషాగా!

"ఎందుకు నవ్వుతారు? "

"మీరు కూడా అలా నవ్వాలని. నాదేముందండీ ఉషగారూ! ఇక్కడి బాధితులకి సహాయం చెయ్యమని ప్రభుత్వం నన్ను పంపింది. నా డ్యూటీ నేను చేస్తున్నాను. అదిసరే! మీ సంగతి చెప్పండి. ఈ భూకంపంలో మీ వాళ్లందర్ని పోగొట్టుకున్నారా? అందుకే ఒంటరిగా కూర్చుని, ఇలా బాధపడుతున్నారా? "

ఉష అవునన్నట్లు తల ఊపింది.

"ఇక్కడ మా అత్తగారూ, మామగారూ, మావారూ, నేనూ వుంటున్నాం. కూరగాయల కోసమని నేను ఇంట్లోనుంచి మార్కెట్టుకి వచ్చాను. కూరలు తీసుకుంటూ ఉండగా భూకంపం వచ్చింది. జనం గోల, అరుపులూ, ఏడుపులూ ఆ బుట్ట అక్కడే వదిలేసి, పరుగులు పెడుతూ వచ్చాను. కానీ ఏం లాభం! అప్పటికే మా ఇంటితో సహా అక్కడి ఇళ్లన్నీ భయంకరంగా కూలిపోయాయి. మా వాళ్లంతా సజీవ సమాధై పోయారు. వాళ్ల శవాల్ని తియ్యటానికి రెండురోజులు పట్టింది" చెప్పింది.

"భూకంపం వచ్చిన రోజు నిజంగా చాలా దురదృష్టకరమైన రోజు. జరిగిందంతా విధి

# పురాతన అపార్ట్‌మెంటులు

ఇవి నిర్మాణంలో ఉన్న ఇళ్లో లేక సగం కూలిన అపార్ట్‌మెంటులో కావు. మధ్యరాతి యుగంనాటి మానవులు మనుగడ సాగించిన గృహ సముదాయమిది. అమెరికాలోని కొలరాడోలో ప్యూబ్లో ఇండియన్స్ జాతి పూర్వీకుల నాగరికతకు ఈ నిర్మాణాలు అద్దం పడుతున్నాయి. 1073-1273 కాలంలో ఎలాంటి లోహ పరికరాలు, సామాగ్రి సహాయం లేకుండా ఒక కొండ అంచు కింద అపార్ట్‌మెంటుల మాదిరిగా ఉన్న ఈ కట్టడాలను నిర్మించారు. వీటిలో దాదాపు 200 గదులున్నాయి. ఇవి కాక స్టోరేజ్ గదులు, ప్రత్యేక ఉత్సవాలు జరుపుకోవడానికి అనువైన గదులు కూడా ఉన్నాయి. ఇక్కడ 400 మంది నివసించి ఉండవచ్చని భావిస్తున్నారు. 1888లో వీటిని కనుగొన్నారు.



వైపరీత్యం. 'శివుడి ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు' అంటారు. మీ విషయంలో, ఈ లోకంలో మీరు జీవించివుండాలని భగవంతుడి నిర్ణయం. మీ భవిష్యత్తు ఏమిటో! ముందుముందు ఎలా గడపాలో ఆలోచించండి. బాధపడటం మానేసి ధైర్యం తెచ్చుకోండి"

"ఏం ధైర్యమండీ! ఏం చూసుకుని? " నిరాశ ధ్వనించిందామె కంఠంలో.

"అదిగో అదే వద్దు. ఇంత చేసిన భగవంతుడు మీకు ఏదో దోవ నిర్ణయించే వుంటాడు. మనమే ప్రయత్నం చెయ్యాలి, కష్టపడాలి, తెలుసుకోవాలి"

"......." మాట్లాడలేదు ఉష.

"మీ సంగతి వివరంగా చెప్పండి. మీ వాళ్లు ఎవరైనా వున్నారా? వుంటే అక్కడికి మిమ్మల్ని పంపించటమో, లేకపోతే వాళ్లని ఇక్కడికి పిలిపించటమో చేద్దాం".

"మా వాళ్లు ఎవ్వరూ లేరు..."

కొద్దిగా ఆశ్చర్యపోయాడు కిశోర్. "ఎవ్వరూ లేరా? అంటే మీ తల్లితండ్రులు గానీ, అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్లూ గానీ ...? " మిగతాది పూర్తి చెయ్యలేదు.

"లేరు. నేను పుట్టిన రెండేళ్లకి మా అమ్మకి ఏదో జబ్బుచేసి చనిపోయిందట. మా నాన్న నన్ను మా అమ్మమ్మకి ఇచ్చేసి, "ఈ పిల్లని మీరే పెంచుకోండి. మీ అమ్మాయి లేకుండా ఈ పిల్లని పెంచటం నా వల్ల కాదు" అని వదిలేసిపోయారట. ఆ తరువాత, కొద్దికాలానికే ఆయన మరో పెళ్లి చేసుకుని ఎటో వెళ్లిపోయారట. మా అమ్మమ్మ నన్ను బాగానే పెంచింది. నా దురదృష్టం కొద్దీ నాకు పన్నెండేళ్ల వయసులో ఆవిడా చనిపోయింది. ఇంక మా మేనమామ, అత్తయ్య నన్ను వీధిలోకి నెట్టలేక ఇంట్లో వుండనిచ్చారు. ఆస్తులు లేని దాన్ని. నేను ఇంట్లో వుండటం ఖర్చు. కష్టపడి డిగ్రీ వరకూ చదువుకున్నాను. ఇంట్లో పనులన్నీ చేసి, ఎవ్వరికీ ఏ ఇబ్బందీ లేకుండా చూసుకునే దాన్ని కనుకనేమో చదువుకోనిచ్చారు. డిగ్రీ పూర్తి చేశాక ఒక స్కూల్లో టీచరు ఉద్యోగం దొరికింది. జీతమంతా మామయ్యకి ఇచ్చేదాన్ని. ఎంతో కొంత డబ్బు సంపాదిస్తున్నాను గనుక నా పెళ్లి గురించి చాలాకాలం పట్టించుకోలేదు. ఈమధ్యనే ఒక ఆరునెలల క్రితం మా మామయ్యకి తెలిసిన వాళ్ల ద్వారా సంబంధం కుదిరి పెళ్లయింది. నేను సంపాదించే డబ్బులు పోతాయని మొదట మా మామయ్య నా పెళ్లికి ఒప్పుకోలేదు. తరువాత మధ్యవర్తులూ, చుట్టాలూ మందలించటంతో ఒప్పుకున్నాడు. మావారి పేరు ప్రభాకర్. ఆయన ఇక్కడ ఉద్యోగం చేస్తుడంతో మా అత్తగారినీ, మా మామగారినీ తీసుకువచ్చారు. అందరూ మంచివాళ్లు. ప్రేమా, అభిమానాలు వున్నవాళ్లు. 'నేను చాలా అదృష్టవంతురాల్ని' అనుకున్నాను.

మెల్లగా ఆంధ్రాకు ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్లిపోదాం అనుకున్నారు ప్రభాకర్. ప్రభాకర్ కూడా చాలా మంచివారు. కానీ ఇక్కడ కూడా నా దురదృష్టమే గెలిచింది. నన్ను ఒంటరిదాన్ని చేసి, వాళ్ళు ముగ్గురూ ఈ లోకాన్నే విడిచిపోయారు" చెబుతూ వెక్కి వెక్కి ఏడ్చింది ఉష - నిలువెల్లా బాధ కమ్మేసుకోగా.

ఆమె కథ విన్న కిశోర్ హృదయం ద్రవించింది. 'పాపం! ఎన్ని బాధలు పడిందో!' అనుకున్నాడు.

"పోనీ ఇప్పుడు.. మీ మామయ్యా, అత్తయ్యల దగ్గరికి వెళ్తారా? "

"వెళ్లను అన్నట్లు తల అడ్డంగా ఊపింది."

"ఏం? "

"వాళ్ళు నా పెళ్ళి తరువాత నన్ను ఇక్కడికి పంపుతూ చెప్పారు. "ఇంక నువ్వు భవిష్యత్తులో మానుంచి ఏమీ ఆశించకూడదు. ఇప్పటివరకూ మేము నీకు చేసిందే ఎక్కువ. ఇంక నీ దోవ నీది" అంది మా అత్తయ్య. అయినా అనుకోకుండా ఇలా జరి



దానికి చాలా బాధగా ఉంది. కానీ- ఆత్మహత్య చేసుకోవాలని గానీ చచ్చిపోవాలని గానీ లేదు. ఆ ధైర్యమూ లేదు"

ఆ మాటతో కాస్త ఆనందపడ్డాడు కిశోర్.

"గుడ్... ఉషగారూ! అది చాలు... ఆత్మహత్య చేసుకోవడానికంటే బ్రతకటానికి ధైర్యం కావాలి. బ్రతకాలి అనే ఆలోచనా, స్థిరమైన నిర్ణయం, కోరికా కావాలి."

మాట్లాడలేదు ఉష.

"ప్రస్తుతం... మీరు బ్రతకటానికి డబ్బు కావాలి. అది సంపాదించుకోవటానికి ఓ పని కావాలి. చిన్న ఉద్యోగమైనా కావాలి."

"అవును."

"రేపు మీ వారి ఆఫీసుకి వెళ్దాం. వాళ్లేమంటారో చూద్దాం."

"అలాగే... కానీ... మా వారి సర్టిఫికెట్లు గానీ, అప్పాయింటుమెంటు లెటర్‌గానీ, నా సర్టిఫికెట్లు గానీ ఏమీ లేవు... అసలు మా ఇల్లు ఉన్న చోటు కూడా నేను సరిగ్గా గుర్తు పట్టలేక పోతున్నాను. మావాళ్ల మృతదేహాలు ఉన్న చోట వెదికితే నాకు ఏమీ కనిపించలేదు. రేపు ఆఫీసులో వాళ్ళు ఏదైనా అడిగితే ఎలా?"

"ఎలా అంటే, జరిగిందే చెబుదాం ఉషగారూ! వాళ్ల ఫైల్సులో మీవారి పేరుంటుందిగా. మీ క్వాలిఫికేషన్ చెప్పండి చూద్దాం. ప్రయత్నం చెయ్యటంలో తప్పు లేదుగా!"

'అలాగే' అన్నట్టు తలూపింది ఉష.

* * *

మర్నాడు తను చేయవలసిన పనులు ముగించాక కిశోర్, ఉషను ఆమె భర్త ప్రభాకర్

గింది గనుక నా దుస్థితి తెలుపుతూ రెండు ఉత్తరాలు రాశాను. రెండుసార్లు ఫోన్ చేశాను. ఇది జరిగి దాదాపు నెల రోజులయింది. రెండోసారి ఫోన్ చేసినప్పుడు మా అత్తయ్య పలికింది. ఎవరి ఖర్మ వారిది ఇంక మేము నిన్ను భరించలేమంది. అందుకే ఇంక అక్కడికి వెళ్ళాలని లేదు. ఏం చెయ్యాలో ఏమీ తెలియటం లేదు" అంది చాలా దిగులుగా.

"జరిగిందేదో జరిగిపోయింది. మీరు ధైర్యంగా ఉండండి" అని కాసేపు ఆగి, "మీ వారి ఆఫీసు ఎక్కడ?" అడిగాడు కిశోర్.

అడ్రసు చెప్పింది ఉష.

"మీరు కష్టపడతారా?"

"కష్టపడతాను కిశోర్ గారూ! జరిగిన

## నడకే నివారణోపాయం

'సర్వరోగ నివారిణి'ని చంకలో పెట్టుకుని డాక్టర్ చుట్టూ తిరగటం అంటే ఇదే అంటున్నాడు ఓ అమెరికా సర్జన్. గుండె జబ్బులు, కాన్సర్లు, ఆర్థ్రైటిస్, డిప్రెషన్, డయాబిటిస్ వంటి రోగాలన్నిటికీ ఒకటే మందు అంటాడీయన. అదేమిటంటే, రోజుకు ముప్ఫయి నిముషాల 'శారీరక వ్యాయామం' అంటాడు. రోజూ చేయకపోయినా కనీసం వారానికి నాలుగు రోజులు, రోజుకు అరగంట వ్యాయామం చేస్తే అన్ని రోగాలూ ఆమడ దూరంలో ఉంటాయని ఎక్సర్‌సైజ్ చేస్తూ మరీ చెప్తున్నాడు. రోజూ అరగంట నడవటం వల్ల, చురుకుగా పనులు చేయటం వల్ల సంవత్సరానికి అరకిలో బరువు తగ్గుతుందట. ఈ తగ్గే బరువు కూడా అదనంగా చేర్చుకున్న కొవ్వేనట. మితంగా తింటూ సరిపడంత వ్యాయామం చేస్తూంటే బరువు పరిమితుల్లో ఉండి ఆరోగ్యం అదుపులో ఉంటుందంటాడు. ఇంకా రోజూ, మామూలు కన్నా అదనంగా కేలరీలు ఖర్చు చేసేందుకు ఈయన బోలెడన్ని సలహాలిస్తున్నాడు. బ్రేక్‌ఫాస్టుని సగం తగ్గించుకోమంటున్నాడు. వాహనాన్ని ఆఫీసుకి కాస్త దూరంగా పార్కు చేయటం వల్ల నాలుగు అడుగులు ఎక్కువ వేసే అవకాశం ఉంటుందంటాడు. లిఫ్ట్ వాడకుండా మెట్లెక్కమంటాడు. రోజుకు అరగంట నడుస్తారో, బద్ధకించి అనారోగ్యం పాలయి మందులపై బతుకుతారో నిర్ణయించుకోండని సవాలు విసుర్తున్నాడు ఆ అమెరికా సర్జన్.



పని చేసిన ఆఫీసుకి తీసుకు వెళ్ళాడు.

ఆఫీసులో అక్కడి మేనేజరుని కలుసుకున్నారు. భూకంపంలో ప్రభాకర్ కుటుంబమంతా చనిపోయారనే ఆఫీసు వాళ్ళు అనుకున్నారు.

ఉష గురించి అన్ని విషయాలు వివరించాడు కిశోర్.

ఆమె డిగ్రీ సర్టిఫికెట్లూ, ఇతర సర్టిఫికెట్లూ అన్నీ సమాధి అయిపోయాయి. డూప్లికేటు సర్టిఫికెట్లు కావాలన్నా ఉష తను చదివిన కాలేజీకి వెళ్ళి వివరాలు చెబితే వారు యూనివర్సిటీ నుంచి తెప్పించే అవకాశం కల్పించటమో, లేదా వారే తెప్పించటమో జరుగుతుంది. కానీ... ఇదంతా జరగటానికి చాలా సమయం పడుతుంది. తను బ్రతకటమే ఓ సమస్యగా ఉంటే ఇవన్నీ ఎలా జరుగుతాయి! అంతకాలమూ ఎలా బ్రతకటం...' మేనేజిమెంటువారు ఏమీ అడగకుండానే ఉష ఆలోచనలో పడింది.

కానీ... ప్రభాకర్ వివరాలు ఆఫీసులో ఉన్నాయి. మనావ దృక్పథంతో వాళ్ళ పై అధికారులతో మాట్లడి ఉషకి ఉద్యోగం ఇవ్వడానికి సిద్ధపడ్డారు. "ఇక్కడే చేస్తారా? " అని మేనేజరు అడిగిన ప్రశ్నకి "ఇక్కడ వద్దండీ!" అంది కొంత బాధపడుతూ.

"పోనీ... ఉషగారూ! హైదరాబాద్ వెళ్తారా? " అడిగాడు మేనేజరు.

ఉష కిశోర్ వంక చూసింది అయోమయంగా. "హైదరాబాద్ బాగానే ఉంటుందండీ. అక్కడ మా శంకరం మాస్టారు ఉన్నారు. ఆయనకి మిమ్మల్ని పరిచయం చేస్తాను" అన్నాడు కిశోర్. సరేనంది ఉష.

హైదరాబాద్‌లో ఆమెకు ఉద్యోగం ఇస్తు న్నట్లుగా లెటర్ ఇచ్చారు ఆ కంపెనీ వారు. ప్రభాకర్‌కు రావలసిన ఒక నెల జీతం కూడా ఇచ్చారు ఆమెకి.

జరిగిన విషాదంలో చిన్న సంతోషం...! తను బతకటానికి ఒక ఆధారం. ఉష మన సులో ఎక్కడో, ఏ మూలో కించిత్ ఆనందం! కిశోర్ మీద కృతజ్ఞత!

"కిశోర్‌గారూ! మీకు ఎలా కృతజ్ఞతలు చెప్పాలో నాకు తెలియటం లేదండీ! పోయిన వాళ్లని గురించి బాధపడటం తప్ప, భవిష్య త్తులో ఎలా బ్రతకాలి? అన్న ఆలోచన కూడా రాలేదు. నాకు బ్రతకటానికి ఓ దారి చూపించారు".

ఉష కళ్ళు నీళ్లతో నిండిపోయాయి.

"ఛ... ఛ... బాధ పడకండి! ఇందులో నేను చేసిందేమీ లేదు. మీ వారికి మంచి పేరుంది. ఆఫీసువాళ్లూ మానవత్వం ఉన్న వాళ్ళు. మీకు వాళ్లు సహాయం చేశారు. ఉష గారూ! జరిగింది ఘోరమైన విపత్తు. దానికి బలైనవారు ఎవరూ తిరిగి రాలేరు. జ్ఞాపకాలు మాత్రమే మనకి మిగిలిపోతాయి. మీ విష యంలో విధి మిగిల్చిన విషాదంలో కాస్తం త ఓదార్పు మీకు మీ వారి ఆఫీసులో ఉద్యో గం దొరకటం. అది చాలా అదృష్టం"అన్నాడు.

ఉష మాట్లాడలేదు. ఆమెకు మాటలు రావటం లేదు.

"ఉషగారూ! మనం వీలైనంత త్వరలో హైదరాబాద్ వెళ్దాం. నేను ఇక్కడికి వచ్చిన పని కూడా అయిపోవచ్చింది. తిరిగి జమ్మూ వెళ్లిపోవాలి..."

"అలాగే" అంది.

రెండు రోజులు కిశోర్ పని ఒత్తిడిలో ఉన్నాడు. తరువాత ఉషని గురించి జరిగిన విషయం ఛైర్‌పర్సన్ రామ్‌లాల్‌తో చెప్పాడు.

"కిశోర్! నువ్వు సామాన్యుడివి కాదోయ్! ఎన్నెన్ని పనులు చేస్తున్నావు. నిజంగా నువ్వు చాలా గ్రేట్!" ఆనందపడి పోయాడాయన.

"అంతగా పొగడకండి సార్! ఏదో నాకు చేతనైన ప్రయత్నం చేశాను. ఉషగారి అదృష్టం బాగుంది. అన్నిటికంటే ఆవిడ భర్త ప్రభాకర్‌గారికి ఆఫీసులో మంచిపేరు వుంది. ఆయన మంచితనమే ఉషగారికి సహాయ పడింది."

"కిశోర్! మరి ఉష హైదరాబాద్‌లో ఒంట రిగా బతుకగలదంటావా? "

"మా మాష్టారు వున్నారు కదా సార్! అదే ధైర్యం! కాస్త పెద్ద దిక్కుగా వుంటారు ఆయ నే. ఇక్కడికి దూరంగా ఉంటే జరిగిన విషా దం నుంచి ఉషగారి మనసుకి కాస్త ఊరట" అన్నాడు.

"అవును. నిజమే నా అనేవాళ్లు ఎవ్వరూ లేని ఒంటరి వాళ్లకి ఏ ఊరైనా ఒక్కటే" అన్నాడు రామ్‌లాల్.

"సార్! నేను ఇక్కడికి వచ్చిన పని అయి పోవచ్చింది. పరిస్థితులు మెల్లమెల్లగా చక్కబ డుతున్నాయి. నేను మళ్లీ పది రోజుల లోపల వెళ్లిపోవాలి. ఈలోగానే ఉషగారిని తీసుకుని హైదరాబాద్ వెళ్లి, మా మాష్టారికి పరిచయం చేస్తాను. ఆమె ఉద్యోగంలో చేరేంతవరకూ వుండి నేను వెళ్లిపోతాను"

"మంచిది కిశోర్! మీకు మంచి జరగాలని భగవంతుడిని కోరుకుంటున్నాను" అన్నాడు రామ్‌లాల్ మనస్ఫూర్తిగా.




ఆ రోజు శంకరం మాష్టారు పాపతో రై లుదిగారు. ఆయన చేతిలోని పాపని చూసి, అపార్టుమెంటులోని వాళ్లంతా ఆశ్చర్యపో యారు. "ఈ పాప ఎవరు? ఆయనకు అం త చిన్న మనవలూ, మనవరాళ్లూ ఎవరూ

లేరు కదా!' అనుకున్నారు. అయినా ఎవరూ వెంటనే ఏమీ అడగలేకపోయారు.

కానీ, 'వాచ్‌మెన్' మాత్రం "ఈ పాప ఎవరయ్యా? " అని అడిగేశాడు.

"తరువాత అన్నీ చెబుతానులే రాములూ" అంటూ తన ఫ్లాట్‌లోకి వెళ్లిపోయారు. శంకరం. ఆయన భుజం మీద నిద్రపోతున్న పాపని, అక్కడే హాల్లోవున్న సోఫాలో పడుకోబెట్టారు.

బాత్‌రూమ్‌లోకి వెళ్లి, కాళ్లూ, ముఖం కడుక్కుని వచ్చికూర్చున్నారు.

అరగంట తరువాత 'శంకరం వచ్చిన సంగతి తెలిసి' పనిమనిషి యాదమ్మ వచ్చింది.

పాల ప్యాకెట్లు తెప్పించారు. డికాషన్ వేసి, పాలు కాచి, కాఫీ చేసి ఇచ్చింది యాదమ్మ.

"ఈ పాప ఎవరయ్యా? " అడిగింది. జరిగిన విషయమంతా చెప్పారు శంకరంగారు. "నా స్నేహితుడినీ, వాడి కుటుంబాన్నీ చూడాలని వెళ్లాను యాదమ్మా! వాళ్లెవ్వరూ కనిపించలేదు. ఈ భూకంపం పిశాచి వాళ్లని మింగేసిందేమో! అక్కడే అనాథలా ఈ పాప కనిపించింది. చావు, బ్రతుకుల మధ్య పోరాడి బ్రతికింది. ఎన్ని రోజులు చూసినా వాళ్లవాళ్లు ఎవ్వరూ రాలేదు, కనిపించలేదు. నాకు ఈ పాపని అక్కడే వదలాలనిపించలేదు. అనాథశరణాలయానికి అప్పగించాలనీ అనిపించలేదు. అందుకే తీసుకువచ్చాను"

"మంచిపని చేశారయ్యా! పాప ఎంత ముద్దుగా వుందో! కానీ అయ్యా! మీరు ఈ వయసులో ఈ పసిదాన్ని పెంచగలరా? కష్టం గదయ్యా!" అడిగింది యాదమ్మ.

"ఏం కష్టం లేదు యాదమ్మా! ఏదైనా కష్టం అనుకుంటే కష్టంగా ఉంటుంది. నువ్వున్నావు కదా! నీకు జీతం ఎక్కువ చేస్తాను. ఇక్కడే వుండు. నీకూ ఎవరూ లేరు. మీ ఆయన పోయాడు. పిల్లలూ లేరు. ఒంటరి దానివి. పాపని నీ పాప అనుకుని పెంచు. నిన్నూ, పాపనీ నేను చూసుకుంటాను. ఏమంటావు" అన్నారు.

"ఏమంటానయ్యా? తమరు అన్ని చెప్పి నాక! అట్టాగే చూస్తానయ్యా పాపని. జీతం దేముందయ్యా! తమరు దేవుడు. మీ దగ్గర నాకు తిండీ, బట్టా గడిచిపోతాయి. ఇంక ఎక్కువ జీతం నాకెందుకయ్యా! ఆ దేవుడు మిమ్మల్ని చల్లగా చూడాల. లేకపోతే ఎవరికి వస్తుందయ్యా ఇంత గొప్ప బుద్ధి!" అంది యాదమ్మ.

"నేను దేవుణ్ణీ కాదు, ఏం కాదు. ఆ పైనున్న దేవుడు మనందర్నీ చల్లగా చూడాలి. అంతే. ఈ పాప లేవగానే, పాలు పట్టాలి యాదమ్మా!" అని తనతోపాటు తెచ్చిన పాల బాటిల్ ఆమెకిచ్చి దాన్ని వేడినీళ్లల్లో ఉడకపెట్టటం, ఇంకా అక్కడి డాక్టర్లు చెప్పిన జాగ్రత్తలూ, వివరాలూ యాదమ్మకి చెప్పారు.

శంకరంగారు తన పనులయ్యాక ఊళ్లో వున్న స్నేహితులకీ, ఇద్దరు, ముగ్గురు బంధువులకీ తను ఊరి నుంచి క్షేమంగా వచ్చినట్లు ఫోన్లు చేశారు. దూరాన వున్న కూతుళ్లకి కూడా ఫోన్లు చేసి పాపని తీసుకుని వచ్చినట్టు చెప్పారు.

సారథిగారు వచ్చారు సాయంత్రం. "ఏం సారథీ! నీ కూతురి పెళ్లి బాగా జరిగిందా? " అడిగారు.

"ఆ బాగానే జరిగింది. అత్తగారింటికి కూడా వెళ్లిపోయింది. దాని అత్తగారి కుటుంబం కూడా మంచి కుటుంబం" చెప్పారాయన.

"బాగుందిరా మంచి విషయం చెప్పావు" సంతోషం ధ్వనించే స్వరంతో అన్నారు శంకరం.

"నువ్వేమిటి? నాలుగు రోజుల్లో వస్తానని, పదిరోజులుపైనే అక్కడ వున్నావు? " అడిగాడు సారథి.

అక్కడి విషయాలన్నీ వివరించారు శంకరం. ఇంతలో యాదమ్మ పాపని ఎత్తు

## ఏది స్వదేశీ.. ఏది విదేశీ ?



జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులు. కట్టమంచివారు ఏదో పనిమీద అలహాబాద్ వెళ్లాల్సి వచ్చింది. యూరోపియన్ సంప్రదాయాలతో నడిచే అక్కడి ఓ హోటల్‌లో ఆయన బసచేశారు. దానిపై ఆయన వ్యతిరేకులు విమర్శలు గుప్పిస్తుంటే- ది స్పిరిట్ ఈజ్ విల్లింగ్, బట్ ది బాడీ ఈజ్ వీక్ అన్నసూక్తికి పేరడీలా 'ది సోల్ ఈజ్ స్వదేశీ.. బట్ ది స్టమక్ ఈజ్ విదేశీ' అంటూ చమత్కరించారు సీఆర్.

కొచ్చింది అక్కడికి.

ఆ పాప సంగతి సారథికి చెప్పారు. పాప ముద్దుగా బాగుంది. పలకరిస్తే నవ్వుతోంది.

"ఎందుకు శంకరం ఈ వయసులో ఈ బంధం, ఈ బాధ్యత? నువ్వు చెయ్యగలననే అనుకుంటున్నావా? ఎందుకొచ్చిన బరువు? నువ్వే ఒంటరివాడివి! ఎలా చూసుకోగలవు? " అడిగాడు సారథి.

"చూసుకోగలననే నమ్మకంతోనే తీసుకువచ్చాను సారథీ! చూడు! ఈ పాపని చూస్తుంటే అలా అనాథలా వదిలి పెట్టాలని అనిపిస్తుందంటావా? చెప్పు! నేను బ్రతికినన్నాళ్లూ చూస్తాను. ఆతరువాత, ఏదో ఏర్పాటు చేస్తాను. ఈ పసిదాన్ని అనాథలా వదలాలనిపించలేదు."

"హు. ఇలాంటివారు ఎందరో వున్నారు! ఎవరి పిల్లో? ఏమిటో" అన్నాడు సారథి.

నవ్వేశారు శంకరంగారు, "నిజమే! ఇలాంటి వారు ఎందరో వున్నారు. అందరినీ చూసే శక్తీ, సామర్థ్యం నాకు లేవు. ఓ చిన్న అనాథ శరణాలయాన్ని ప్రారంభించి, ఈ పాపలాంటి పిల్లల్ని చూసుకుంటే బాగుంటుంది. కానీ అంత శక్తి లేదు. నాకు ఆర్థికపరంగా, వయసుపరంగా, సామాజిక పరంగానూ చేతకాదు.

ఇంక ఎవరి పిల్లో ఏమిటో అంటావా? అసలు ఆ వివరాలు తెలిసివుంటే పాప నా దగ్గరికి వచ్చేదే కాదేమో! కుల, మతాల పట్టింపు నాకు లేదు. నా దగ్గరికి వచ్చింది కనుక నా కులమే. అయినా మానవత్వానికి మించిన కులం ఏముంటుంది చెప్పు! రేపు పాప పెద్దదయ్యాక ఆ మానవత్వమే రావాలి పాపకి కూడా. అదే నా కోరిక. ఇంకొక సంగతి. నా పాత విద్యార్థిని చూశానక్కడ. ఎంతగా ఎదిగిపోయాడో!" అని కిశోర్ గురించిన విషయాలన్నీ చెప్పారు. "చాలా మంచివాడు సారథీ! ఎంత సంస్కారవంతుడిగా ఎదిగాడో! తలచుకుంటే నాకు అవార్డులు వచ్చినప్పటి ఆనందంకన్నా గొప్ప సంతోషంగా వుంది." అన్నారు.

"ఊ..." వింటూ కూర్చున్నాడు సారథి.

"ఈ పాపని తీసుకురావాలనిపించింది. తీసుకువచ్చాను. మరి ఈ పసిదాని భవిష్యత్తు ఎలావుంటుందో మనకి తెలియదు సారథీ! ఈ పసిదాని పేరేమిటో నాకు తెలియదు. పాపకి ఏం పేరు పెడదాం చెప్పు!"

నవ్వేశాడు సారథి. "ఆలోచించు నువ్వే!" అన్నాడు.

"ఏవేవో పేర్లు వెతకటం నాకు తెలియదు. లక్ష్మి అని పేరు పెడదాం".

"పేరు బాగుంది, నీ చేతిలో పాప భవిష్యత్తు బాగుంటుంది లే".

యాదమ్మ ఇచ్చిన టీ తాగి సారథి వెళ్లిపోయాడు.

శంకరం స్నేహితులూ, బంధువులూ ఒక్కొ

క్కరూ ఆయన్ని పలకరించటానికి వస్తూనే వున్నారు. అందరూ ఇంచుమించు ఒకటే మాట! 'ఆడ దిక్కు కూడా లేదు ఈ వయసులో, ఇంత బాధ్యత మీద వేసుకుని, పసిపిల్లని తీసుకువచ్చావు! పెంచటం కష్టమైన పని. ఒంటరివాడివి!' అంటూ తలా ఒకరూ, తలా ఒకమాటా అనేస్తూనే వున్నారు.

"నాకు ఓపిక వున్నంత వరకూ చూస్తాను. తరువాత, ఏదో మార్గం ఆలోచిస్తాను"అందరికీ అదే జవాబు నవ్వుతూనే చెబుతున్నారు శంకరంగారు.

* * *

వీలు చూసుకుని, శంకరంగారి కూతుళ్లూ, అల్లుళ్లు, వాళ్ల నలుగురు పిల్లలూ వచ్చారు. వారం రోజులు తండ్రి దగ్గర గడుపుదామని, తండ్రి పెంచుకోవటానికి తెచ్చిన పాపని చూసిపోదామనీ వచ్చారు.

అందరికీ పనిమనిషి యాదమ్మ అన్నీ అమరుస్తోంది. పాపని చూసుకుంటోంది.

శంకరంగారి కూతుళ్లు టిఫిన్లూ, వంటపనీ వాళ్లే చూసుకుంటున్నారు.

భోజనాలు ముగిశాయి. విశ్రాంతిగా కూర్చున్నారందరు. వాళ్ల పిల్లలు పక్కగదిలో ఆడుకుంటున్నారు. అందరి మధ్యా పాప లక్ష్మి బొమ్మలా పాకుతోంది. సోఫాలు పట్టుకుని బుడిబుడి అడుగులు వేస్తోంది.

"ఎందుకు నాన్నా ఇలా చేశావు? " అడిగింది శంకరంగారి పెద్ద కూతురు సుగుణ.

"ఏం చేశానమ్మా? " అన్నారు శంకరం గారు చాలా మామూలుగా! '

"ఇదిగో! ఈ చంటిపాపని తీసుకువచ్చావు! ఎందుకట? ఏం బాగోలేదు నువ్వు చేసిన పని"

"అవును మామయ్యా! మీరు చేసిన పని ఏం బాగాలేదు" శంకరంగారి పెద్దల్లుడు అన్నాడు.

భోజనాలయ్యాక, భుజ్ పట్టణంలో తను చూసిన భూకంపపు ఘోరాలు, విషాదాలన్నీ



వాళ్ల నలుగురికీ చెప్పారు. పిల్లలూ విన్నారు. తన స్నేహితుని కుటుంబం జాడ తెలియక పోవడం గురించి చెప్పి బహుశా వాళ్లు చనిపోయివుండవచ్చుంటూ బాధపడ్డారు. తన పాత విద్యార్థి కిశోర్ చేస్తున్న

పనులని గురించి, అతని మంచితనం గురించీ వివరించారు. పాప బతికి బయట పడిన తీరు గురించి కూడా చెప్పారు. అయి నా తన కూతురూ, అల్లుడూ అంతావిని



మళ్లీ ఈ ప్రశ్న వేయటం శంకరంగారికి కొంచెం బాధే కలిగించింది. ఆయనేం మాట్లాడలేదు.

"ఫోన్ చేసి భుజికి వెళ్తున్నానంటే. వంద జాగ్రత్తలు చెప్పి, "సరే నాన్నా" అన్నాను నేను కూడా, నువ్వు అంతదూరం వెళ్లటం ఇష్టం లేకపోయినా! మరి నువ్వేమో మాకు చెప్పకుండా ఈ పిల్లని తీసుకువచ్చావు. అందులోను ఆడపిల్ల!" అంది శంకరంగారి రెండో అమ్మాయి కరుణ.

రెండో అల్లుడు మాత్రం కాసేపు ఏమీ మాట్లాడలేదు. తరువాత "అసలు మిమ్మల్ని మా దగ్గరికి వచ్చి వుండమంటే మీరు రారు. ఒంటరిగా ఇక్కడ ఎందుకు ఉండటం? మా దగ్గరే ఉంటే ఇలాంటి వన్నీ జరిగేవి కాదుగా మామగారూ! ఇప్పుడు ఎక్కడికి రావాలన్నా ఈ పాప బాధ్యత ఒకటి మీకు. ఈ వయసులో ఎందుకు ఇవన్నీ" అన్నాడు.

అందరి మాటలూ వింటూ కూర్చున్నారు శంకరం గారు.

"పోనీ మగపిల్లవాడు కూడా కాదు' ' శంకరంగారి పెద్ద కూతురు సుగుణ అంది.

శంకరంగారికి బాధా, ఆశ్చర్యమూ కూడా కలిగాయి. 'ఈ ఆడపిల్లలు తన కూతుళ్లు. తను పెంచిన తన పిల్లలు. ఈ రోజు ఇలా మాట్లాడుతున్నారు! అప్పుడెప్పుడో కాస్త చదువు, నాలుగు మంచి మాటలు తనచేత చెప్పించుకున్న పాత విద్యార్థి ఎంత సంస్కారవంతుడిగా ఎదిగాడు! ఎక్కడవుంది ఈ తేడా!' ఆలోచనల్లో నుంచి తేరుకున్నారు.

కానీ మళ్లీ ఆలోచనలు ఆయన్ని ముసురుకున్నాయి 'పిల్లలు అడిగిన దాంట్లో మాత్రం

తప్పేముంది గనుక!"అనిపించింది.

"ఏం నాన్నా! ఏం మాట్లాడ వేమిటి? " పెద్ద అమ్మాయి సుగుణ రెట్టించింది.

"ఏం మాట్లాడమంటావమ్మా? "అని చిరునవ్వు నవ్వారు. ఆయన కాస్త శాంతంగానే ఆలోచిస్తున్నారు. మనసులో ఎక్కడో కాస్త చురుక్కుమన్నా 'పిల్లలు కదా! వాళ్లు అనకపోతే ఎవరంటారు!' అని సమాధాన పడ్డారు.

"నువ్వు మా దగ్గరికి వచ్చి వుండాలనీ, మాతోనూ, పిల్లలతోనూ హాయిగా గడపాలనీ, నీ గురించి మాకు మాత్రం అనిపించదా? " అడిగింది చిన్నమ్మాయి కరుణ.

"ఎందుకనిపించదమ్మా? "

"మాకు మాత్రం ఎవరున్నారు నాన్నా నువ్వేకదా!" సుగుణ అంది.

కూతుళ్ల మాటలకి ఆయన మనసూ ఆర్ద్రమైంది. 'ఎంతైనా తన కన్న కూతుళ్లు. వాళ్లకి తన మీద ప్రేమా, అభిమానాలూ ఉండటం సహజమే కదా! అటువంటప్పుడు వాళ్ల కోరికా సమంజసమే. వాళ్లలా మాట్లాడటంలోనూ తప్పు లేదు. కానీ, 'మొదట - కూతుళ్లు అల్లుళ్ల మాటలకీ కొంత కోపం వచ్చిన మాట నిజమే. తనేదో తప్పు చేస్తే సంజాయిషీ అడుగుతున్నట్టుగా అనిపించింది. తను మనస్ఫూర్తిగా చెయ్యాలనుకున్న ఒక మంచి పనికి తనకి ఆ మాత్రం స్వేచ్ఛ లేదా? ' అనిపించింది.

కానీ చివరలో వాళ్లు అడుగుతున్న తీరుకి, ఆయన మనసు కరిగిపోయింది.

"చూడండి మీరు అడిగిన మాటలన్నీ వాస్తవమే! మీ కోరికా సహజమైందే! నేను వెళ్లింది ఒకందుకైతే చివరకు జరిగింది మరొకటి. కూలిపోయిన శిథిలాల కింద ఈ పసిబిడ్డ కన్పించింది. తల్లీ, తండ్రీ మరణించివుంటారు. నీళ్లూ, తిండీ లేక కొన ఊపిరితో వుంది. కిశోర్ ఇందాక చెప్పానే నా ప్రియ శిష్యుడు. అతడు నేను ఈ పాపని అక్కడ గుడారాల్లో నడుపుతున్న హాస్పటల్‌కి తీసుకు వెళ్లాం. పాప కళ్లూ, ముక్కూ, నోరూ, చెవులూ అన్నీ మట్టితో నిండి పోయాయి. అసలు బతుకుతుందని నమ్మకం లేకపోయింది. కానీ గొప్ప విషయం! డాక్టర్లు కష్టపడి బ్రతికించారు.

"ఈ పసిదానికి తన తల్లీ, తండ్రీ ఏమయ్యారో తెలియదు, ఏం జరిగిందో తెలియదు. కానీ అంతటి భయంకరమైన ప్రకృతి వైపరీత్యంలో కూడా చావుకి దగ్గరగా వెళ్లి బతికింది. ఎందుకు బతికిందో మరి! భగవంతుడు ఈ చిన్నిప్రాణిని ఎందుకు బతికించాడో. పాప అక్కడ వుండేవారందరి మొహాలూ చూస్తూ వుండేది. పలకరిస్తే నవ్వేది. డాక్టర్లు పాప వయసు పదినెలలు అని చెప్పారు.

అందరూ కోలుకుంటున్న పాపని చూసి పలకరించి వెళ్తూనే ఉన్నారు. అన్ని రోజులు నేనక్కడ వున్నా పాప తాలూకు వాళ్లు

"అంతటి భయంకరమైన ప్రకృతి వైపరీత్యంలో కూడా చావుకి దగ్గరగా వెళ్లి బతికింది. ఎందుకు బతికిందో మరి! భగవంతుడు ఈ చిన్నిప్రాణిని ఎందుకు బతికించాడో"

ఎవ్వరూ రాలేదు.

"చూడండి మీరు ఎదిగారు, పెద్దవాళ్ల య్యారు. మీ సంగతి మీరు చూసుకోగలరు. కానీ ఈ పసిబిడ్డ... ఇది పెరిగి పెద్దదవ టానికి ఎవరో ఒకరి ఆధారం కావాలి. ఆ ఆధారం నేనే అవుదామనుకున్నాను. నాకే ఈ చిట్టి పాపని పెంచుకోవాలనిపించింది.

అయినా! సుగుణా! కరుణా! మిమ్మల్ని పెంచాను కదమ్మా! అలాగే పాపని కూడా!" అన్నారు.

"అదేమిటి నాన్నా! మమ్మల్ని పెంచటం, ఈ పిల్లని పెంచటం ఒక్కటెలా అవుతుం ది? అప్పుడు అమ్మ వుంది. నీ వయసు చిన్నది. మేము నీ కూతుళ్లం"అంది సుగుణ.

"నిజమేనమ్మా! అప్పుడు మీరు పెరిగి, పెద్దవాళ్లవటానికి మీకు మీ అమ్మా, నాన్నా ఉన్నారు. వాళ్లే చూసుకున్నారు. మరీ ఈ పసిది పెరగటానికి దానికి అమ్మా, నాన్నా లేరు. అందుకే నేను తీసుకువచ్చాను. ఇప్పుడు నా వయసు మళ్లినా ఇంకా ఒంట్లో ఓపిక వుంది. ఆరోగ్యంగానే వున్నాను. చూసుకోవటానికి యాదమ్మ వుంది. ఒక వేళ, నాకేదైనా అయితే పాపని మీమీద వదలనులే. అయినా సుగుణా, కరుణా! మీకు మంచి పేర్లు పెట్టాను. పేరులో వున్న లక్షణాలు మీలో అంతగా కనిపిస్తు న్నట్టు లేవు. 'నేను పెంచిన పిల్లలేనా!' అని అనిపిస్తోంది.

"ఆడపిల్లని అంటున్నారు అదేపనిగా! మీరు ఆడపిల్లలు కారా...? 'ఆడపిల్ల' అనే చిన్నచూపుతో నేనూ, మీ అమ్మా మిమ్మల్ని పెంచలేదే? 'ఆడపిల్ల' వద్దు అనుకుంటే మీరు ఎక్కడ వుండేవారమ్మా? మీరు ఇద్దరూ మగపిల్లల్ని కన్నారు కదా అని, ఆడ పిల్లని చిన్నచూపు చూడటం చాలా తప్పు!"

ఎవ్వరూ మాట్లాడలేదు.

"ఇంకొక్క సంగతి! నేను ఇక్కడ హాయిగా బాగానే వున్నాను. యాదమ్మ అన్నింటికీ సహాయంగా వుంటుంది. నాకేదైనా అయితే వున్న కాస్త డబ్బూ, ఈ ఇల్లూ, మీ ఇద్దరికీ చెందుతాయి. ఈ పాప మీకు ఎందులోనూ వాటాకీ, పోటీకి రాదు. అలాగే రాయిం చాను కూడా. ఈ లక్ష్మిని పెంచి, దాని కాళ్ల మీద అది నిలబడేటట్లు చెయ్యాలని నా కోరిక. ఇంక ఆర్థికంగా అంటారా! ఈ విష యంలో ఎవరినీ ఇబ్బంది పెట్టదల్చుకో లేదు. జమీందారుని కాకపోయినా సుఖం గానే బ్రతకగలను, లక్ష్మినీ పెంచగలను. డబ్బు చాలకపోతే నా ఉపాధ్యాయ వృత్తి వుంది. పదిమందికి ప్రయివేట్లు చెబితే నాలుగు డబ్బులొస్తాయి. లేకపోతే ఏ ట్యుటోరియల్ కాలేజీలోనో పాఠాలు చెప్ప టానికి చేరతాను.

కానీ ఒక్క సంగతి. నాకు చేతనవుతుంది అనే నమ్మకంతో, ఒక మంచిపని అని నేను అనుకున్నది చేయాలనుకున్నప్పుడు మీకు ఇంత సంజాయిషీ ఇవ్వవలసి వస్తుందని అనుకోలేదు" నిదానంగానే అయినా కాస్త కరుకుగానే అన్నారు. ఆయన కంఠంలో కించిత్ బాధ తొంగిచూసింది.

"క్షమించండి మామయ్య గారూ! మిమ్మల్ని బాధ పెట్టినందుకు. మీరేమీ మనసులో పెట్టుకోకండి" అన్నారు అల్లుళ్లు.

సుగుణ, కరుణ ఏం మాట్లాడలేదు. తాము కొంచెం ఎక్కువగానే మాట్లాడామే మోననిపించింది వాళ్లకి.

ఆ తరువాత ఇక అలకలూ, కోపాలూ ఏమీ ప్రదర్శించలేదు. వాళ్లు ఉండాల నుకున్నన్ని రోజులూ ఉన్నారు. లక్ష్మిని కూడా ఎత్తుకుని ముద్దు చేశారు. తండ్రికి కావలసినవి ప్రేమగా చేసిపెట్టారు. బయ లుదేరే రోజున "నాన్నా! నన్నూ, చెల్లెల్నీ క్షమించు, మేము అతిగా మాట్లాడి నిన్ను బాధపెట్టాం" అంది సుగుణ.

"పరవాలేదమ్మా! ఇందులో క్షమించటా నికేముంది. మీరూ నామీద ప్రేమాభిమానా లతోనేగా అన్నారు."

"అప్పుడప్పుడూ లక్ష్మిని కూడా తీసుకుని

రండి నాన్నా!"అంది చిన్న కూతురు కరుణ.

"పాపతో నేను రావటం కష్టమమ్మా! మీరే అప్పుడప్పుడూ వస్తూ వుండండి" అన్నారు. చీరెలూ, సారెలతో అందరినీ సాగనంపారు.

కూతుళ్లూ, అల్లుళ్లూ, మనవలూ... ఎవరి ఊళ్లకి వాళ్లు వెళ్లిపోయాక, ఇల్లంతా సందడి తగ్గి, వాన కురిసి, వెలిసినట్లు నిశ్శబ్దంగా ఉంది. పాప చేసే అల్లరి మాత్రమే సందడి నింపుతోంది.

శంకరం మనసు మాత్రం కూతుళ్ల మాటలకీ, అభిప్రాయాలకీ బాధపడింది. ఆయన మనసు ఏమూలో 'మంచి పనిచేశావు నాన్నా! పాపని తీసుకువచ్చి' అని అంటారని ఆశించిందేమో కాస్త నిరాశపడింది- తను ఆశించిన విధంగా కాకుండా మరొక విధంగా జరిగినందుకు. 'అయినా ఒకరినుంచి తను ఏదో ఆశించటమేమిటి! తను ఆశించింది జరగకపోతే నిరాశపడటమేమిటి! తన అజ్ఞానం కాకపోతే! తనకి నచ్చి, చేస్తున్న పని అందరికీ నచ్చాలని నియమమూ, నిబంధనలూ ఏమీ లేవుగా' అని మనసుని సమాధానపరుచుకున్నారు.




పదిహేను రోజుల్లో పాప మరింత ఆరోగ్యంగా, ముద్దుగా తయారైంది. దినచర్యకి యాదమ్మా, పాప అలవాటు పడుతున్నారు. యాదమ్మ శంకరంగారి ఇంట్లోనే వుంటోంది.

తొలి ఉషస్సులోని వెలుగురేఖలు తూర్పు దిక్కున పరుచుకుంటున్నాయి.

గూటిలోని పక్షుల కిలకిలలూ, కొమ్మలకి పూచిన పూల పరిమళాలు, కొమ్మల్లో దాగిన కోయిలమ్మ రాగాలూ,గగనాన ఎగిరే విహంగాలూ ఆహ్లాదంగా వుంది వాతావరణం.

ఉదయం అయిదున్నర గంటలకే పాలవాడు పాల ప్యాకెట్లు ఇచ్చి వెళ్లిపోయాడు.

పాప ఇంకా నిద్రపోతోంది.

యాదమ్మ లేచి ఇంటి పనులు మొదలు పెట్టింది.

శంకరంగారు మార్నింగ్‌వాక్‌కు వెళ్లటానికి తయారవుతున్నారు.

కాలింగ్‌బెల్ మోగింది.

'ఇంత ఉదయమే ఎవరు బెల్లు కొడతారు! ఎవరు వచ్చి వుంటారు!' అనుకుంటూ వెళ్లి తలుపు తీశారు.

ఎదురుగా నిలబడిన వాళ్లను చూసి అవాక్కయ్యారు.

"మాష్టారూ! బాగున్నారా? " కిశోర్ పలకరించాడు.

"ఆ... ఆ... కిశోర్! ... రా... లోపలికి రా!" అన్నారు తలుపు పూర్తిగా తీసి దారి ఇస్తూ.

...పాతికేళ్లపైనా, ముప్పై ఏళ్లలోపు వయసు వున్న యువతి కిశోర్ వెనుకగా నిలబడి వుంది.

"రామ్మా లోపలికి!" పిలిచారు ఆమెని కూడా.

అనుకోకుండా వచ్చిన వాళ్లను చూసేసరికి ఆయనకు కాస్త ఆశ్చర్యం కలిగింది.

కిశోర్ ముఖంలో అలసట తొంగి చూస్తోంది.

"మాష్టారూ! ఈమె పేరు ఉష"అంటూ పరిచయం చేశాడు.

"నమస్కారం"అంది ఉష కాస్త భయంగా

శంకరంగారు ప్రతినమస్కారం చేశారు.

ఉష ముఖాన బొట్టులేదు. చేతికి గాజులు లేవు. బోసిమెడ, నలిగిన చీరె. ఆమెని చూస్తూ, భర్త లేకపోయివుండచ్చు

అనుకున్నారే గాని అంతకు మించి ఎక్కువ ఆలోచించలేదు.

ఉష ముఖంలో బాధ, అన్నీ పోగొట్టుకున్న విషాదం, పలకరిస్తే తొంగిచూసే కన్నీరు.

"మాష్టారూ! భయంకరమైన భూకంపం చేసిన ఘోరంలో, ఈ ఉషదీ ఒక కథ!" అని కిశోర్ చెప్పబోతుంటే మధ్యలోనే అడ్డుకుని - "కిశోర్! అన్ని సంగతులూ తరువాత మాట్లాడుకుందాం. ప్రయాణం చేసి వచ్చారు. బాగా అలసిపోయినట్లున్నారు. ముందు ముఖాలు కాళ్లు కడుక్కుని రండి. వేడిగా కాఫీ తాగుదురుగాని. అన్ని విషయాలూ తీరుబడిగా మాట్లాడుకుందాం" అన్నారు.

రెండు తువ్వాళ్లు అందించింది యాదమ్మ.

ముఖం కడుక్కుని వచ్చారు ఇద్దరూ.

ఆ రోజు ఇంక మార్నింగ్ వాక్‌కు వెళ్లడం మానుకున్నారు శంకరంగారు. వేడి కాఫీ ఇచ్చింది యాదమ్మ అందరికీ.

ఇంతలో పాప లేచింది. యాదమ్మ లక్ష్మికి పాలుపట్టి, గదిలో నుంచి బయటికి తీసుకువచ్చింది.

"పాప చాలా బాగుంది మాష్టారూ! ఆరోగ్యంగా, ఎంత ముద్దుగా వుందో!" అన్నాడు కిశోర్.

"అయితే నేనూ, మా యాదమ్మ, పాపని బాగానే పెంచుతున్నామా?" నవ్వుతూ అడిగారు.

"మీరు బాగా పెంచకపోవటమేమిటి మాష్టారూ! మీ చేతిలో పాప కడిగిన ముత్యంలా ఉంటుంది"

"నా చేతిలో కాదు కిశోర్! మా యాదమ్మ రుణం తీర్చుకోలేనిది. కన్నతల్లిలాగా చూసుకుంటోంది."

"నేనేం చేస్తున్నానయ్యా? తమరేగా అన్నీ చూస్తున్నారు. కావలసినవన్నీ తెచ్చి పెడుతున్నారు ఇంట్లో!" అంది యాదమ్మ.

లక్ష్మి గోడ పట్టుకుని నడుస్తోంది. ఏవో కేరింతలు కొడుతోంది.

"కిశోర్, మీరిద్దరూ స్నానాలు చేసి కాసేపు విశ్రాంతి తీసుకోండి. మనం సాయంత్రం మాట్లాడుకుందాం!" అన్నారు శంకరంగారు.

"మాష్టారూ! భయంకరమైన భూకంపం చేసిన ఘోరంలో, ఈ ఉషదీ ఒక కథ!" అని కిశోర్ చెప్పబోతుంటే మధ్యలోనే అడ్డుకున్నారు

యాదమ్మని పిలిచి "యాదమ్మా! ఆ అమ్మాయికి బట్టలూ, అవీ ఉన్నాయో లేదో సరిగ్గా చూడు. అక్కడ ఆ పరిస్థితుల నుంచి వచ్చింది పాపం! ఏమీ ఉండి ఉండవు. నేను బజారుకు వెళ్లి ఆ అమ్మాయికి బట్టలు తెస్తాను. పాపం, ఆడపిల్ల! ఎన్ని ఇబ్బందులు పడిందో ఏమో మన ఇంటికి వచ్చింది. ఎప్పుడనగా తిండి తిన్నారో ఏమో! త్వరగా టిఫినూ, వంటా చెయ్యి. వాళ్లని నువ్వేమీ అడక్కు. అన్నీ మెల్లగా అవే తెలుస్తాయి" అని చెప్పి బయటికి వెళ్లారు.

లక్ష్మి ఆడుకుంటోంది.

ఉష స్నానం చేసి, తన దగ్గరవున్న బట్టలే కట్టుకుంది. యాదమ్మ ఇస్తానన్నా వద్దని మృదువుగానే చెప్పింది.

స్నానం చేయటంతో ప్రయాణపు బడలిక తీరినట్లైంది. రెండు నెలల పాటు టెంటే ఇల్లుగా గడపడం వల్లనేమో ఇప్పుడు ఒక ఇంట్లో ఉన్నందుకు కొంత కొత్తగా ఉంది.

మధ్యాహ్నం భోజనాలు చేసిన వెంటనే నిద్రముంచుకు వచ్చిందామెకు.

* * *

సాయంకాలం. పడమటి సంధ్య మలుపు

తిరిగింది. వెలుగు వెళ్లిపోయింది. చీకటి మళ్లీ రావటానికి ఆరాట పడుతోంది. సంధ్య వెలుగులో, కాషాయ రంగులో అందంగా ఉంది ఆకాశం. పైన ఎగిరే పక్షులు; కాంక్రీటు ప్రపంచంలో కూడా 'నేను న్నాను సుమా!' అంటూ అప్పుడప్పుడూ వీచే గాలి తెమ్మెరలు వచ్చి పోతున్నాయి. రోడ్డు మీద ఉన్న తంగేడు చెట్టుకి విరిసిన ఎర్ర పూలు వాసన లేకపోయినా చల్లగాలికి వయ్యారాలు ఒలకపోస్తు న్నాయి.

**ఉష ముఖంలో బాధా, నిర్లిప్తత, కాస్త భయమూ వ్యక్తమవుతున్నాయి తను ఇక్కడికి ఎందుకు వచ్చింది? ఈ మనుష్యులూ, ఈ ప్రపంచం అంతా కొత్త! తన భవిష్యత్తు ఎలా ఉంటుంది! ఏమిటీ జీవితం?!**

శంకరం, కిశోర్, ఉష బాల్కనీలో కూర్చున్నారు.

యాదమ్మ లక్ష్మిని ఇంటి దగ్గరలోని పార్కుకి తీసుకువెళ్లింది. ఉష ముఖంలో బాధా, నిర్లిప్తత, కాస్త భయమూ వ్యక్తమవుతు న్నాయి. తను ఇక్కడికి ఎందుకు వచ్చింది? ఈ మనుష్యులూ, ఈ ప్రపంచం అంతా కొత్త! తన భవిష్యత్తు ఎలా ఉంటుంది! ఏమిటీ జీవితం? ! మెదడంతా ఆలోచనలతో నిండిపోయింది. ఎవరైనా పలకరిస్తే, ఏమైనా మాట్లాడితే మాటలకంటే ముందు కళ్లల్లో నీరు జారటానికి సిద్ధంగా ఉంది!

బంగారు ఛాయ కాకపోయినా కొంచెం పసిమి ఛాయలో, పెద్ద పెద్ద కళ్లతో అందంగా కళగా ఉంది ఉష ముఖం. ప్రస్తుతం ఆ ముఖంలో దైన్యం మాత్రమే కనబడుతోంది. మనసులో మెదిలే అభద్రతా భావం, భయం ముఖంలో వ్యక్తమవుతున్నాయి.

"మాష్టారూ! మేము ముందుగా కబురైనా లేకుండా ఇలా వచ్చి మీకు ఇబ్బంది కలిగించామేమోననిపిస్తున్నది. క్షమించండి" అన్నాడు కిశోర్.

ఆ మాటలకి శంకరంగారు కాస్త నొచ్చుకున్నట్టు అనిపించింది.

"అదేమిటి కిశోర్! అలా ఎప్పుడూ అనుకోవద్దు. అసలు నీకీ సమ యంలో నేను గుర్తు వచ్చి, నా దగ్గరకు రావాలనిపించడమే నాకు చాలా ఆనందాన్ని కలిగిస్తోంది. ఇబ్బంది గిబ్బంది అనే ఆలోచన లేవీ మనుసులోకి రానీయకు. మన మంతా మనుష్యులం. కష్టం వచ్చినప్పుడు ఒకరికి ఒకరం సహాయం చేసుకోవాలి. మీరిద్దరూ ఇక్కడికి వచ్చి మంచిపని చేశారు" మనస్ఫూర్తిగా అన్నాడు శంకరం గారు.

"చాలా థ్యాంక్స్ మాష్టారూ! నాకు నా వాళ్లూ, ఆత్మీయులూ ఎవరూ లేరు. ఎప్పుడూ మీరు మనసులో మెదులుతూ ఉంటారు. భూకంపం కారణంగా భుజి రావడం వల్ల అనుకోకుండా అక్కడ మిమ్మల్ని చూసే భాగ్యం కలగడం నా అదృష్టం."

'ఈ కిశోర్‌గారికీ ఎవ్వరూ లేరా? ' ఆశ్చర్యంగా కిశోర్‌ని చూస్తూ కూర్చుంది ఉష.

చిన్నగా నవ్వారు శంకరంగారు. "సమయం రావాలి దేనికైనా అంటే ఇదే మరి"

"మాష్టారూ! భుజ్ భూకంపం మిగిల్చిన వెతల గాథలో ఈ ఉషగా

## విమర్శకులపై విమర్శ



తెలుగు సాహిత్య విమర్శకులకు సీఆర్ తరచూ చురకలు వేసేవారు. వారు అవసరమైన దాన్ని వదిలి అనవసరమైన దాన్ని పట్టుకు వేళ్లాడతారని, సున్నితంగా చెప్పడం రాదని ఆయన దృఢనమ్మకం. అందుకే ఓసారి-

'మన పండితులు, విమర్శకులందు పరుషములే కానీ.. సరళములు లేవు' అని చమత్కరించారు.

తెలుగు భాషలో 'కచటతప'లను పరుషములంటారని, 'గజడదబ'లను సరళములంటారనీ తెలిసిందే కదా?

రిదీ ఒక విషాద గాథ."

"అలాగా!"

"మాష్టారూ! ఈ ఉష తెలుగమ్మాయే. వీళ్లది తెనాలి" అని ఆమె తనకు చెప్పిన సంగతులన్నీ చెప్పారు.

"ఈమెకి పెళ్లయి ఆరునెలలే అయిందట. మేనమామ, అత్త ఈమెని చాలా కష్టాలు పెట్టారు. ఇంక... ఇప్పుడు... వాళ్లు అసలు రానివ్వం అని ఖచ్చితంగా చెప్పారట. జరిగిన దుర్ఘటనతో ఈ ఉష పదిరోజులు అపస్మారక స్థితిలోనే వుంది. పదిరోజుల తరువాత మెల్లగా తేరుకుంది 'ఎలా బతకాలి?' అని ఏడుస్తూ కూర్చుంది. నాకు చేతనైనంతవరకు ధైర్యం చెప్పాను." అని తను ఉషను ఆమె భర్త పని చేసిన ఆఫీసుకు తీసుకువెళ్లడం, వాళ్లామెను ఉద్యోగం ఇవ్వడానిక ఒప్పుకోవడం అంతా వివరంగా చెప్పాడు.

ఇంక ఆ భుజి పట్టణంలో వుండలేనంది ఉష. జరిగిన సంఘటనలే గుర్తుకు వస్తూ వుంటాయి. ఆ ఆఫీసు బ్రాంచి ఈ ఊళ్లో కూడా వుంది. ఇక్కడ ఉద్యోగం ఇవ్వమని వాళ్లని కోరాను. వాళ్లు అపాయింటుమెంటు లెటర్ ఇచ్చారు. ఒక పదిరోజులు టైమిచ్చారు. ఇక్కడ ఆఫీసులో చేరటానికి. వచ్చే నెల మొదటి, రెండూ తారీకుల్లో చేరాలి" చెప్పాడు కిశోర్.

"చాలా మంచిపని చేశావు కిశోర్! ఈ అమ్మాయికి సానుభూతి ఒక్కటే సరిపోదు. బతకటానికి ఒక ఆధారం చూపించి సహాయం చేశావు. ఎంత గొప్పవాడివయ్యా! నువ్వు" మెచ్చుకోలుగా అన్నారు.

"మాష్టారూ! మీ శిష్యుడిని మీరు నేర్పిన మంచే నాకు వెలుగు. మీరే లేకపోతే నేను ఎందుకూ పనికిరాని వెధవలాగా....."

"మళ్ళీ మొదలు పెట్టావు! ఇక ఆపేసేయ్ నవ్వుతూ అన్నారు శంకరంగారు.

"అవును సార్! ఈ కిశోర్‌గారు చాలా సహాయం చేశారు. ఆయన రుణం తీర్చుకోలేనిది" అప్పటికి నోరు విప్పింది ఉష.

"చూడమ్మా ఉషా! నువ్వు నా కూతుళ్ల కంటే చిన్నదానివి. నా కూతురిలాంటిదానివి. నన్ను బాబాయి అని పిలువు చాలు. నాకూ ఆత్మీయంగా ఉంటుంది" అన్నారు.

"అలాగే... బాబాయిగారూ! ఈ కిశోర్ గారు నిజంగా నన్ను దేవుడిలా ఆదుకున్నారు. రేపు ఎలా బ్రతకాలి? అన్న దిగులు తప్ప మరో ఆలోచన లేదు. పోయిన వాళ్లకోసం ఏడుస్తూ కూర్చుంటే ఈ కిశోర్ గారు నన్ను చూసి నా సంగతంతా తెలుసుకుని. నా కెంతో సహాయం చేశారు. ఆదరిస్తున్నారు.

మా మామగారూ, అత్తగారూ, మావారూ చాలా మంచివాళ్లు. నన్ను చాలా బాగా



చూసుకునేవాళ్లు.

ప్చ్..! దురదృష్టం ఇలా జరిగింది" ఆమెకళ్లవెంట జలజలా కన్నీళ్లు రాలాయి.

"బాధపడకమ్మా! మనం ఎంత బాధపడ్డా ప్రయోజనం ఏమీ వుండదు కదా! ఈ కిశోర్...! నిజంగా ఇతనికి ఎవ్వరూ లేరు. ఇతను ఆర్మీలో చేరిన కొత్తల్లోనే వాళ్ల అమ్మా, నాన్నా, చెల్లెలూ ముగ్గురూ యాక్సిడెంట్‌లో పోయారు పాపం! చుట్టాలున్నా అసలు బతికివున్నాడో, లేడో కూడా పట్టించుకోరు. పెళ్లి చేసుకోలేదు. 'ఎందుకని కిశోర్?' అని అడిగితే నవ్వుతాడు. అనాథలా తనలో తను మగ్గిపోతున్నాడు.

మొన్న... భుజ్ పట్టణంలో

భూకంపం జరిగినప్పుడు నేను అక్కడికి వచ్చాను - నా స్నేహితుడిని చూద్దామని. నా మిత్రుడు కనిపించలేదుగానీ యాధృచ్ఛికంగా వజ్రంలాంటి ఈ శిష్యుడు కనిపించాడమ్మా! ఏదీ మన చేతుల్లో లేదు. మన చుట్టూవున్న వాళ్లకీ ఉంటాయి ఏవో బాధలూ, కష్టాలూ, సుఖాలు కూడా. అంతా దైవనిర్ణయం"

కిశోర్‌ని గురించి శంకరం చెబుతూ వుంటే ఆశ్చర్యపోయింది ఉష. 'హుషారుగా, నవ్వుతూ ఎన్నో పనులు చేసే ఈ కిశోర్ వెనుక ఇంత విషాదముందా' అనుకుంది.

"ఉషా! మీ మామగారు ఏ ఊళ్లో టీచరుగా పని చేసి, రిటైరయ్యారమ్మా? "

"తెనాలిలో బాబాయిగారూ! హిందూ హైస్కూల్లో సైన్సు టీచరు. అక్కడే రిటైరయ్యారు, రెండు సంవత్సరాల క్రితం"

"పేరు? ' ఉష చెప్పింది శ్రద్ధగా వింటూ అడిగాడు శంకరం. ఆతృతగా-

"భాస్కరరావు గారు".

"ఆ...!" ఆశ్చర్యపోయారు. ఆయన గొంతులో విపరీతమైన బాధ వ్యక్తమైంది.

"ఏమైంది మాష్టారూ? "

శంకరంగారి కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. బాధతో మనసు నలిగిపోయింది. ఉష విస్తుపోయి ఆయన్నే చూస్తూండిపోయింది.

"నేను ఏదైతే జరగకూడదనుకున్నానో, అదే జరిగింది. అనుకున్నారు.

"ఉషా! మీ మామగారు భాస్కరరావు నాకు చాలా ప్రాణ స్నేహితుడమ్మా! ఇప్పుడు కాదు, చిన్ననాటినుంచీ. భాస్కరాన్ని చూద్దామని అనిపించే అక్కడికి వచ్చాను. మీ పెళ్లికి నేను రాలేకపోయాను. అందుకే నువ్వు తెలియలేదు.

ఈ భూకంపం విషయం తెలియగానే మా భాస్కరం, వాడి కుటుంబం గుర్తుకొచ్చింది. ఎప్పుడో తెనాలి నుంచి నాకు ఉత్తరం కూడా రాశాడు. 'తనూ, తన భార్యా... తన కొడుకు దగ్గరకి... భుజ్ వెళ్తున్నాననీ చాలాకాలమే అయింది. వెళ్లిన తరువాత ఉత్తరం రాయలేదు, ఫోనూ చెయ్యలేదు. నేను భుజ్‌కి వచ్చిందే వాడి కోసం.

"అక్కడ భాస్కరం, వాడి భార్యా, కొడుకూ ఎవరూ కనిపించలేదు, వాళ్ల మృతదేహాలు కూడా కనిపించలేదు. చాలా బాధ కలిగింది. భాస్కరానికంటే నేను రెండేళ్లు చిన్నవాడిని. వాడికి ఆ ఒక్క కొడుకూ కూడా చాలా ఆలస్యంగా పుట్టాడు. చూశావా? భగవంతుడి లీల ఎంత చిత్రమైందో! నువ్వు మా భాస్కరం కోడలివా? చూడు దేవుడు నిన్ను ఎలా కలిపాడో!" ఆనందమూ, బాధా రెండూ కలిగాయి ఆయనకి.

ఉష నిశ్చేష్టగా ఆయన్నే చూస్తూండిపోయింది.

"చాలా ఆశ్చర్యంగా వుంది మాష్టారూ! గాడ్ ఈజ్ గ్రేట్! వరల్డ్ ఈజ్ సో స్మాల్!" అన్నాడు కిశోర్ విస్మయం ధ్వనించే స్వరంతో .

"అవును కిశోర్!"అని, "ఉషతో చూడమ్మా ఉషా! నువ్వు ధైర్యంగా వుండు. నీకేం ఫరవాలేదు." ధైర్యం చెబుతున్నట్లుగా అన్నారు.

వీళ్లు మాట్లాడుకుంటూ వుంటే యాదమ్మ పాపతో వచ్చింది అక్కడికి.

ఉదయం నుంచీ పాపని చూస్తూనే వుంది ఉష. ఈ పాప శంకరంగారి మనవరాలేమో! ఎంత ముద్దుగా వుంది అనుకుంది. కిశోర్‌నీ, శంకరంను అడిగే ధైర్యం లేకపోయిందామెకు.

ఆమె మనసులో మాట గ్రహించినట్లుగా, "చూశావామ్మా! ఈ పాప! ఆ ఘోరమైన భూకంపంలో తల్లినీ, తండ్రినీ పోగొట్టుకుంది. ఇంకెవరిని పోగొట్టుకుందో తెలియదు. అసలు ఏం జరిగిందో తెలియదు. తన అమ్మా, నాన్న ఏమయ్యారో తెలియదు. ఆ రాళ్ల గుట్టల మధ్య, ఆ దుమ్ములో. నాలుగు రోజులు కొన ఊపి

రితో గడిపింది. తిండీ నీళ్లూ లేకపోయినా ప్రాణంతో పోరాడింది. ఈ కిశోర్, మరికొందరూ కొద్దిగా నేను కూడా అనుకో పాపని కష్టపడి బయటికి తీసి, ఫస్ట్ ఎయిడ్, మిగతా ట్రీట్‌మెంటు ఇచ్చిన తరవాత, పాప బ్రతికింది. ఎవ్వరూ లేని ఈ పాపని నేను తీసుకువచ్చాను పెంచుకుందామని" చెప్పాడు శంకరం.

అది విని ఆశ్చర్యపోయింది ఉష. ఆయన గొప్ప మనసుని మెచ్చుకోకుండా వుండలేకపోయింది.

తననే ఆరాధనగా చూస్తున్న కిశోర్‌తో శంకరంగారు అన్నారు. "కిశోర్! మా భాస్కరం కోసం వెళ్లాను. వాడిని చూడలేక పోయాను. వాడి కోడల్ని నువ్విక్కడకు తీసుకువచ్చావు. తమాషాగా లేదూ? విధి ఎప్పుడు, ఎవరిని, ఎలా ఆడిస్తుందో తెలియదు." అని తన చూపును ఆకాశం వైపుకు మరల్చి అలా చూస్తూండిపోయారు. కొద్దిసేపటి తర్వాత తన ఎదురుగా కూర్చున్న ఇద్దరివంక చూస్తూ "కిశోర్! ఉషా! మీకు ఒక్క విషయం చెప్పాలి. మరుక్షణంలో ఏం జరుగుతుందో తెలియదు... అదే జీవితం! ఎట్టి పరిస్థితుల్లోనూ, జీవితం మీద ఆశని పోగొట్టుకోకూడదు. ఈ కాస్త జీవితంలో ఈ సృష్టిలో మన చేతుల్లో లేని బలమైన శక్తి మనల్ని ఆడిస్తోంది. మానవుడు ఆ శక్తిని జయించలేడు, ఏమీ చెయ్యాలేడు. జీవితపు ప్రయాణంలో ఎంతో దూరం నడవాలి. గమ్యం చేరేవరకూ అలా నడవాల్సిందే! ఎంత దూరం నడవాలన్నా, మొదటి అడుగుతోనే మొదలు పెట్టాలి. దోవలో ముళ్లూ, రాళ్లూ, రప్పలూ, ఎత్తులూ, పల్లాలూ... ఎన్నో! ఎన్నెన్నో! అవన్నీ సరిచేసుకుంటూ నడవాలి. ఎన్నిటినో దాటాలి... ఇంత కష్టపడ్డాక చేరే ఆ గమ్యంలో ఆనందం వుంటుంది.

నా ఉపాధ్యాయ జీవితంలో ఎందరో విద్యార్థులున్నారు. ఎన్నో ఊళ్లు తిరిగాను. కొన్ని చోట్ల అవమానాలూ, నిందలూ, కష్టాలూ ఎన్నో! మరికొన్ని చోట్ల, అభిమానం, గౌరవం, మర్యాద, నమ్మకం అన్నీ లభించాయి. ఒకసారి బాధపడినా మరొకటి జరిగినప్పుడు ఆనందపడ్డాను. రెండూ నా జీవితంలోనివే! అలాగే ఎందరో విద్యార్థులు! కొందరు ఎంత చెప్పినా వినకుండా, చదువుకోకుండా, బాధ్యతా రహితంగా, జులాయిగా తిరిగేవారూ ఉన్నారు. వాళ్లని తలచుకుంటే, నా మనసులో ఎక్కడో బాధ! నా ఉపాధ్యాయ వృత్తికి సరియైన న్యాయం చెయ్యలేకపోయానేమోననిపించేది. ఎంతోమంది విద్యార్థులు పెద్ద చదువులు చదివి, మంచి మంచి ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. బాగా చదువుకుని విదేశాలకి వెళ్లిన వారూ ఉన్నారు. వాళ్లల్లో కొందరు తారసపడి ఎప్పుడైనా "మాష్టారూ! నేను మీ స్టూడెంటుని!" అని చాలా అభిమానంగా పలకరించి వెళ్తూ ఉంటారు. ఆ సమయంలో నా మనసు ఉప్పొంగిపోతుంది. ఈ దేశానికి మరొక మంచి పౌరుడు లభించాడనే ఆనందమది. వాళ్లతో సంబంధం అంత వరకే.

కానీ ఏమిటో మరి ఈ కిశోర్‌తో అనుబంధం ఇలా పెరిగింది" నవ్వారు చిన్నగా.

కిశోర్, ఉష వింటూ కూర్చున్నారు.

" కిశోర్ ఈరోజున నేనూ, ఆ పసిపాప ఈ ఉష -అసలు మనమంతా ఎవరం? ఎలా కలిశాం? ఎందుకు కలిశాం? తమాషాగా అనిపిస్తోంది కదూ! మనకి తెలియని ఏదో అనుబంధం మనల్ని ఒకచోట చేర్చింది ఆ యాదమ్మతో సహా!

ఏ బంధమైనా మానవత్వానికి మించిన అనుబంధం లేదు. చూడండి! చీకటి తరువాత వెలుగొస్తుంది. కష్టాలూ, నిరాశ తరువాత ఆశ, సుఖం, ఆనందం తప్పకుండా ఉంటాయి. ఎటొచ్చీ మనం కాస్త ఓర్పూ, నేర్పూ చూపించాలి. మనమంతా అనుకోని విధంగా కలిశాం. ఒకరకంగా నా జీవితం సంధ్య మలుపు తిరిగింది కానీ ఎందుకు

## పాతబడ్డ 'వింతలు'

ప్రపంచంలో ఏడు వింతలున్నాయని అందరికీ తెలుసు. కానీ ఈ ఏడు వింతలు ఇవీ అని ఎవరు నిర్ణయించారో తెలుసా? అసలీ ఏడు వింతలు లిస్టు ముందుగా తయారుచేసింది క్రీ.పూ. రెండవ శతాబ్దంలో జీవించిన గ్రీకు కవి, సెడాన్‌కు చెందిన 'ఆంటి పేటర్'. గ్రీకు పురాణాల్లో 'ఏడు' అంకెకు అత్యంత ప్రాధాన్యం ఉండటంతో, ఈయన తన కాలంలోని ఏడు అద్భుత కట్టడాలకు లిస్టు తయారుచేయటంతో 'ఏడు అద్భుతాల' ఎంపిక ఆరంభమయింది. రానురాను ఈయన ఎన్నుకున్న బాబిలాన్ గోడల స్థానాన్ని ఈజిప్టులోని సారోల లైట్‌హౌస్ ఆక్రమించింది. ప్రస్తుతం మనకి తెలిసిన ఏడు అద్భుతాల జాబితా 16వ శతాబ్దంలో తయారయింది. పిరమిడ్లు, బాబిలాన్‌లోని వేలాడే తోటలు, ఒలంపియాలోని జీయస్ విగ్రహం రోడ్స్‌లోని కలోస్సస్ భవంతి, ఎఫెసియస్ దగ్గర ఉన్న ఆర్టెమిస్ మందిరం, హాలికార్నస్సస్ సమాధి ఈ ఏడు వింతలు ప్రస్తుతం మళ్లీ కొత్తగా ఏడు వింతలు ఎన్నుకోవాలన్న ప్రయత్నాలు ఆరంభమయ్యాయి.



కలిశామో! ఏమో మనమంతా కలిసి బ్రతుకుదాం. మనమందరం కలిసి కొత్త జీవితాన్ని మొదలుపెడదాం. నాకు మీరున్నారు. మీకు నేనున్నాను. మన అందరికీ పైన భగవంతుడు వున్నాడు. మన ఈ సంగమం మరొకరికి స్నేహహస్తం, ఆప్త హస్తం అందించాలి" కాస్త ఆనందమూ, కాస్త ఆవేశమూ కలగలసిన స్వరంతో అన్నారు. వేదాంత ధోరణి తొంగి చూసింది ఆయన గొంతులో. ఈ మాటలకి కిశోర్ హృదయం ఆర్ద్రమైంది

"మాష్టారూ! మీరు నిజంగా దేముడు" ఆప్యాయత తొంగి చూసింది కిశోర్ మాటల్లో. అతని కళ్లల్లో తడి తళుక్కుమంది. అది కనిపెట్టారు శంకరంగారు. "అవునూ! అంతగా సున్నితమైందా నీ మనసు? మీ మిలిటరీ వాళ్ల మనసు రాయి అనుకున్నాను. కాదన్నమాట! మంచు ముక్కే కదూ!" నవ్వుతూ అన్నారు. కిశోర్ కూడ నవ్వేశాడు.

"మాష్టారూ! ఉష గారిని, వాళ్ల ఆఫీసుకి తీసుకువెళ్తాను. ఆమెకీ ఊరు కొత్త. ఏమీ తెలియదు. రెండు రోజులు ఆమెకుతోడుగా ఉండి ఆఫీసుకి తీసుకువెళ్తాను. ఆ తరువాత నేను జమ్మూ వెళ్లిపోవాలి. మరొక వారం రోజులే టైము ఉంది నాకు."

"అప్పుడే వెళ్లిపోతావా?"

"అవును మాష్టారూ! మా బ్యాచ్‌కి ఇచ్చిన టైము అయిపోవచ్చింది. అవసరమైతే మరొక బ్యాచ్ వస్తుంది. నాకు షార్టు సర్వీసు టైము ఉంది. అది కూడా పూర్తయింది. వీలైనంత త్వరలో వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకుంటాను. ఎంతో కొంత పెన్షన్ కూడా వస్తుంది. మెల్లగా ఈ హైదరాబాద్‌లోనే ఏదైనా ఉద్యోగం చూసుకుంటాను. ఇదంతా పూర్తయ్యేసరికి కాస్త సమయం పడుతుంది.

ఆ తర్వాత నేను మీ దగ్గరికే వస్తాను" అన్నాడు కిశోర్.

సరేనన్నట్లు తలూపుతూ "నువ్వు తప్పకుండా ఇక్కడికే రావాలి"అన్నాడు శంకరం.

మర్నాడు ఉషని తీసుకుని, ఉష పని చెయ్యబోయే ఆఫీసుకి వెళ్లాడు కిశోర్.

ఉష తన అపాయింటుమెంటు లెటరూ, భుజిలోని ఆఫీసు వాళ్లిచ్చిన ఉత్తరం ఇక్కడి యాజమాన్యానికి చూపించింది. ఆ తర్వాత జాయినింగ్ రిపోర్ట్ ఇచ్చింది. ఆమెకు అంతా అయోమయంగా వుంది. కొత్తగా, భయంగా వుంది. ఒక ప్రక్క మనసుని కృంగదీసే బాధ! కానీ తప్పదు అనుకుంది. అలవాటుపడాలి. తను బ్రతకటానికి ఇదే ఆధారం. పని నేర్చుకోవాలి. ఇక్కడి వాతావరణానికీ, పరిస్థితులకీ సర్దుకుపోవాలి, మనసుని రాయి చేసుకోవాలి. తప్పదు.

సాయంత్రం అయిదు గంటల తరువాత కిశోర్ వచ్చాడు. బస్సులో ఇద్దరూ ఇంటికి చేరుకున్నారు. తను ఉన్న వారం రోజులూ ఉషకి ఏ నంబరు బస్సులు ఎక్కాలో, ఎక్కడ దిగాలో ఎక్కడికైనా వెళ్లాలంటే ఏ రూట్లలో వెళ్లాలో వివరంగా చెప్పాడు కిశోర్.

వారం గడిచింది.

కిశోర్ ఆ రోజు వెళ్లిపోతున్నాడు.

"బాబాయి గారూ!" పిలిచింది ఉష.

"ఏమిటమ్మా? " అన్నాడు చూస్తున్న శంకరం పేపరు పక్కన పెట్టి.

"నేనేదైనా చిన్న ఇల్లు అద్దెకు తీసుకుంటాను" అంది.

"ఏం ఉషా! ఎందుకు వచ్చింది నీకా ఆలోచన? ఒంటరిగా ఎలా ఉంటావు? నీకు జరిగిన అన్యాయాన్ని తలచుకుంటూ, కృంగిపోతూ మనసు పాడు చేసుకోవటానికా? "

"అది కాదు బాబాయి గారూ"

"ఏది కాదు? నువ్వు ఎక్కడికీ వెళ్లొద్దు; ఏ ఇల్లూ తీసుకోవద్దు. ఇక్కడే వుండు. పాప, నేను, యాదమ్మ అందరం తోడుగా ఉంటాం. ఇక్కడ వుంటే కాస్త నీ మనసుకీ బాగుంటుంది"

"అవునండీ ఉషగారూ! కొన్నాళ్లు మీరు ఇక్కడే ఉండండి. ప్రస్తుతం మీరు ఒంటరిగా ఉండలేరు. కొన్నాళ్లు ఇక్కడే వుంటే ఈ ఇల్లూ, వాతావరణం, పాప, మాస్టారూ, యాదమ్మా అందరూ మీకు అలవాటైపోతారు" మీ మనసుకి తగిలిన గాయమూ మానుతుంది." అన్నాడు కిశోర్.

> **"ఏం ఉషా! ఎందుకు వచ్చింది నీకా ఆలోచన? ఒంటరిగా ఎలా ఉంటావు? నీకు జరిగిన అన్యాయాన్ని తలచుకుంటూ, కృంగిపోతూ మనసు పాడు చేసుకోవటానికా?"**

కాసేపు మాట్లాడలేదు ఉష.

ఊహ తెలిసినప్పటినుంచీ అమ్మమ్మ దగ్గర, ఆవిడ చనిపోయాక మేనమామ ఇల్లూ, స్కూలూ, కాలేజీ, ఇంట్లో చాకిరీ తప్ప తనకి మరో ఊరు తెలియదు. పెళ్లయ్యాక 'భుజి' పట్టణం తప్ప, మరొక ప్రపంచం తెలియదు. 'ఇప్పుడిక్కడ ఇలా ఈ మాస్టారింట్లో వుండాల్సి రావటం, ఈ హైదరాబాద్ నగరమూ వేరే ఏదో ప్రపంచంలోకి వచ్చినట్టుగా ఉంది తనకి. ఏం జీవితం! ఎప్పుడు ఏమి జరుగుతుందో తెలియదు ప్ప' ఉష ఆలోచనలు సాగుతున్నాయి.

"ఏం ఉషగారూ! మౌనం వహించారు? " కిశోర్ పలకరింపుతో ఉష ఆలోచనలకి అంతరాయం కలిగింది.

"అలాగేనండీ! కానీ ఒక్క కోరిక నాది. నన్ను 'మీరు' అనక్కరలేదు. నువ్వు అనండి చాలు" అంది ఉష. కిశోర్ వెళ్లిపోయాడు.

* * *

ఉష శంకరం గారి ఇంట్లో అలవాటు పడుతోంది. పాపని చాలా ప్రేమగా, చూసుకుంటోంది. ఉదయమే లేచి కాఫీ,

టిఫినూ, వంట చేసి, ఆఫీసుకి వెళ్తుంది. మళ్లీ సాయంత్రం ఇంటికి వచ్చిన తరువాత యాదమ్మ ఇచ్చిన టీ తాగి కాసేపు పాపతో ఆడుకుంటుంది. సాయంత్రం వంట కూడా తనే చేస్తుంది.

"ఎందుకమ్మా! యాదమ్మ చేస్తుందిలే వంట. నువ్వు వదిలెయ్యి" శంకరం ఎంత చెప్పినా వినిపించుకోదు.

"ఏం ఫరవాలేదు బాబాయిగారూ! వంట ఎంతసేపు అవుతుంది! యాదమ్మ కూడా చాలా పనిచేస్తోంది కదా!" అనేది. ఆఫీసులోనూ అందరితోనూ బాగానే ఉంటుంది ఉష. ఎక్కువగా మాట్లాడదు. అందరూ స్నేహంగానే ఉంటారు. శంకరం కూతుళ్లు ఒకరి తరువాత ఒకరు వచ్చి తండ్రిని చూసి వెళ్లారు. ఉష వాళ్లకీ పరిచయం అయింది. 'ఏమిటో! మా నాన్న! ఇలా అందరినీ ఇంట్లో పెట్టుకుంటారు' అని అనుకున్నారు గానీ తండ్రితో ఆ విషయం మాట్లాడే ధైర్యం ఇద్దరికీ లేకపోయింది.

దాదాపు ఏడాది కావస్తోంది ఉష అక్కడికి వచ్చి. లక్ష్మి కూడా కొంచెం పెద్దది అవుతోంది.

ఆ రోజు ఉదయం నడకకి వెళ్లటానికి తయారవుతున్నాడు శంకరం.

కాలింగ్ బెల్ మోగింది. వెళ్లి తలుపు తీసింది ఉష. ఎదురుగా కిశోర్ నిలబడి ఉన్నాడు. పక్కన పెట్టె, చేతిలో బ్యాగ్ ఉన్నాయి.

ఎదురుగా ఉన్న ఉషని చూసి ఆశ్చర్యపోయాడు కిశోర్. ఉష ముఖంలో చిరునవ్వు, నుదుటి మీద చిన్న ఎర్రని బొట్టూ, చేతికి గాజులూ; అందంగా, ఆరోగ్యంగా బాపూ బొమ్మలా ఉంది. అప్పటి ఉషకి, ఇప్పుడు తను చూస్తున్న ఉషకి ఎంత తేడా! ఎంత మార్పు! మాష్టారికి ఏదైనా సాధ్యమే అనుకున్నాడు కిశోర్.

"లోపలికి రండి" పక్కకి జరిగి నుంచుని ఆహ్వానించింది.

లోపలినుంచీ శంకరం వచ్చాడు. కిశోర్‌ను చూస్తూనే "ఏం కిశోర్! బాగున్నావా? " సాదరంగా పలకరించారు.

కాఫీ, టిఫిన్లయ్యాక అందరూ విశ్రాంతిగా కూర్చున్నారు. ఆ రోజు ఆదివారం ఉషకి ఆఫీసులేదు. ఆ ఇంట్లో మనిషిలాగా స్వతంత్రంగా మసలుతున్న ఉషని చూస్తుంటే ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ వుంది కిశోర్‌కి. 'ఉష మామూలు స్థితికి వస్తోంద'నుకున్నాడు.

లక్ష్మి మరికాస్త పెద్దదైంది. శంకరంగారిని 'తాతయ్య' అని, ఉషని అమ్మా అని పిలుస్తోంది. ఉషకి కూడా అలా పిలిపించుకోవటమూ ఇష్టంగానే వుంది. ఆదంతా గమనించి ఆనందపడ్డాడు కిశోర్.

సాయంత్రం చల్లగాలికి బాల్కనిలో కూర్చునప్పుడు, "మాష్టారూ! షార్టు సర్వీసు పూర్తి చేసుకుని, వాలంటరీ రిటైర్‌మెంటు తీసుకున్నాను. ప్రతినెలా కొద్దిగా పెన్షన్ వస్తుంది. ఇక్కడ ఓ ప్రయివేటు కంపెనీలో బ్రాంచ్ మేనేజర్‌గా ఉద్యోగం వచ్చింది. ఎల్లుండి ఆఫీసులో చేరాలి" చెప్పాడు కిశోర్.

"ఇప్పటికైనా ఇక్కడికొచ్చి మంచి పనిచేశావు కిశోర్!" అన్నారు శంకరంగారు.

"ఇన్నేళ్లుగా అక్కడే ఉండడంతో ఆ పరిసరాల్ని, నా స్నేహితుల్నీ వదిలి రావాలంటే మనసు చాలా బాధగా అనిపించింది. కానీ తప్పదుగా అని సరిపెట్టుకున్నాను."

"తప్పదులే కిశోర్! నేను సర్వీసులో ఉండగా అది నాకెన్నిసార్లు అనుభవమైందో" ఉష టీ తీసుకు వచ్చింది ముగ్గురికీ.

"మాష్టారూ! ఉష ఇప్పుడు బాగుంది. కాస్త ధైర్యంగా, ఆత్మవిశ్వాసంతో కనిపిస్తోంది. అమె కట్టూ, బొట్టులో కూడా మార్పు బాగుంది మాష్టారూ! ఉష ఇలా వుండాలని అనుకున్నాను. కానీ అప్పుడు అమె ఉన్న స్థితిలో చెప్పే ధైర్యం లేకపోయింది. చెబితే బాధపడుతుందేమోనని భయం వేసింది. ఉషలో వచ్చిన ఈ మార్పు కూడా మీ

పుణ్యమే కదా!"

శంకరంగారు మాట్లాడలేదు. నవ్వేశారు. ఉష ఇద్దరికీ టీ అందిస్తూ మాస్టారి వంక కృతజ్ఞతాపూర్వకంగా చూసింది.

* * *

కొన్ని రోజులకి శంకరంగారు ఉంటున్న ఆపార్ట్‌మెంట్‌లోనే ఒక ఫ్లాట్ ఖాళీ అయింది. కొద్దిగా అద్దె ఎక్కువేమో అని అనిపించినా మాస్టారికి దగ్గరలోనే వుండాలనే కోరికతో ఆ ఇల్లు తీసుకున్నాడు కిశోర్. శంకరంగారికి తోడుగా ఆయనకు దగ్గర్లో వుంటే మంచిదనే భావనతో.

కిశోర్ మధ్యాహ్నం ఆఫీసులోనే భోజనం చేస్తాడు. సాయంత్రం ఇంటికి వచ్చాక తనే వండుకుంటాడు.

శంకరం, ఉష ఎందుకంత శ్రమ అని ఎంత చెప్పినా వండుకుని తినటం మాత్రం మానుకోలేదు. ఈ విషయం సున్నితంగానే శంకరంగారికి చెప్పి ఒప్పించాడు.

శంకరం మాస్టారికి మనసులో కలిగిన ఒక ఆలోచన రోజు రోజుకీ గట్టిపడుతోంది. 'దాని గురించి ప్రయత్నించాలి' అనుకున్నారాయన.

కిశోర్ ఆఫీసునుంచి వచ్చాడు. కాసేపు విశ్రాంతి తీసుకుని, స్నానం చేసి, వంట చేసుకుని కూర్చున్నాడు పేపరు తిరగేస్తూ.

"కిశోర్! ఏం చేస్తున్నావు? " అంటూ వచ్చారు శంకరం.

"రండి మాస్టారూ!" లేచి పలకరించాడు.

"ఖాళీగానే వున్నావా? "

"ఖాళీయే సార్!"

"అయితే పద అలా పార్కు వైపుకి వెళ్దాం!" అన్నారు.

'ఎందుకు మాస్టారూ!' అని అడగాలనిపించింది. కానీ, 'మాస్టారే చెబుతారులే!' అనుకుని ఊరుకున్నాడు.

ఇద్దరూ ఇంటి దగ్గరలో వున్న పార్కులోకి వచ్చి బెంచీ మీద కూర్చున్నారు.

చల్లని గాలి వీస్తోంది. పార్కులోని విద్యుత్ దీపాలు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి, ఇంకా పూర్తిగా చీకటి పడకముందే అక్కడక్కడా పార్కులో ఉన్న లాన్‌లో చిన్న పిల్లలు పరుగులు పెడుతున్నారు. పార్కులో వున్న మాలీ పిల్లల్ని కేకలేస్తున్నాడు- అలా గంతులేస్తే లాన్ పాడైపోతుందని.

"నీతో ఓ విషయం మాట్లాడాలని ఉందయ్యా!" అన్నారు శంకరం.

"చెప్పండి మాస్టారూ!"

"నువ్వు అసలు పెళ్లెందుకు చేసుకోలేదు? "

మాస్టారి ప్రశ్న విని నవ్వేశాడు కిశోర్.

"నవ్వుతావేమిటి? నాకు జవాబు కావాలి"

కిశోర్‌కి తన చిన్నప్పుడు క్లాసులో పాఠం చెబుతున్న మాస్టారు గుర్తుకు వచ్చారు.

"ఎందుకూ అంటే పెద్ద కారణం ఏమీ లేదు మాస్టారూ! అమ్మా, నాన్న పోయాక నా బాగోగులు పట్టించుకునే వారెవారు లేక పోయారు. కిశోర్! నువ్వు పెళ్లి చేసుకో! అన్నమాట నేనెవరి దగ్గర నుంచి వినలేదు. ఇంక ఆర్మీలో వున్నప్పుడంటారా, నా స్నేహితులు అడిగేవాళ్లు ఒత్తిడి చేసేవాళ్లు. కానీ నాకే ఇష్టం లేకపోయింది"

"ఎందుకని"

"మేం కాశ్మీర్ సరిహద్దుల్లో చాలా కాలమే ఉన్నాం. అక్కడ, ఎప్పుడు, ఎలా వుంటుందో తెలియదు. పెళ్లిళ్లు చేసుకున్న నా స్నేహితులంతా భార్యా, పిల్లల్నీ వాళ్ల సొంత ఊళ్లోనే వుంచేవాళ్లు. కొంతకాలం తరువాత, వాళ్లు, వాళ్ల కుటుంబాల్ని తెచ్చుకోవచ్చు

నేను పెళ్లి చేసుకున్నా, ఆ అమ్మాయి నాతో వుండలేదు. అత్తగారింట్లో వుండటానికి అమ్మా,నాన్న లేరు. ఇంక ఆ అమ్మాయి తన పుట్టింట్లోనే గడపాలి. సంవత్సరానికి ఒకసారో, రెండుసార్లో వెళ్లగలనేమో నేను. అదికూడా సెలవు దొరికితే. దాంతో ఎందుకిదంతా అనిపించింది. అందుకే పెళ్లిమీద పెద్దగా ఆసక్తి చూపించలేదు" అన్నాడు.

అప్పట్లో శ్రీదేవి అంగీకరించి ఉంటే పెళ్లి చేసుకునేవాడు. కానీ ఆమె ఒప్పుకోలేదు ఆ

సంగతి శంకరంగారికి చెప్పాలనిపించలేదు కిశోర్‌కి.

"ఊ" నిట్టూర్చారు శంకరంగారు.

కాసేపటి తరువాత అన్నారు, "పోనీ, నేనిప్పుడు నిన్ను అడుగుతున్నాను కిశోర్! పెళ్లి చేసుకో! పిల్లని నేను చూస్తాను".

"ఇప్పుడా!"అని కాస్త ఆశ్చర్యంగా చూసి ఇప్పడు నాకు ముప్పై తొమ్మిది సంవత్సరాలు" అన్నాడు.

"అయితే ఏమిటి? అరవై ఏళ్లు కాదుగా!"

"ఏమో మాష్టారూ! ఇన్నాళ్లూ ఒకరకమైన స్వేచ్ఛకి, ఒంటరితనానికీ అలవాటుపడ్డాను. పెళ్లి పేరుతో మరో మనిషిని ఇబ్బంది పెట్టాలి. బాధ్యతలుంటాయి ఏవేవో! అవన్నీ నేను ఏం చెయ్యగలను? నా వల్ల కాదుసార్!"

"అలా తప్పించుకోవద్దయ్యా. నీ ఒంటరి తనానికి ఒక తోడు వుంటుంది. మీ ఇద్దరూ కలిస్తే ఎటువంటి బాధ్యతలనైనా చూసుకోవచ్చు. అయినా ఆర్మీలో వున్నవాడివి, కాశ్మీర్ బార్డర్‌లో వుండి వచ్చిన వాడివి నువ్వు బాధ్యతలకి భయపడటమేమిటి కిశోర్? "

"మాష్టారూ! ఆ ఆర్మీవాళ్ల జీవితాలే వేరు. అప్పుడు దేశరక్షణ ఒక్కటే మా ఆలోచన"

"సరే అప్పటి సంగతి వదిలెయ్యి. ఇప్పుడు నేను చెబుతున్నాను. నువ్వు పెళ్లి చేసుకో" అన్నారు.

మాట్లాడలేదు కిశోర్.

"ఉష గురించి నీ అభిప్రాయమేమిటి? ఆమెని పెళ్లి చేసుకుంటావా? "

శంకరంగారు మాటలకి ఆశ్చర్యపోయాడు కిశోర్. నిజానికి అతడికి ఉషని గురించిన ఎటువంటి ఆలోచనాలేదు.

"చెప్పు కిశోర్!"

"మాష్టారూ! ఉష వయసు ఎంతని? ఇరవై ఏడో, ఇరవై ఎనిమిదో వుంటాయి. వయసు తేడా చాలా ఉంటుంది. ఆమె వయసుకి నేను తగను మాష్టారూ!"

"వయసు తేడా కాస్త ఎక్కువే కావొచ్చు. కానీ మీ ఇద్దరికీ మంచి మనసులున్నాయి. ఇద్దరూ ఒంటరి బ్రతుకులు బతికే బదులు, మీరిద్దరూ పెళ్లి చేసుకుని, ఒక ఇంటివాళ్లయితే ఒకరికొకరు తోడుగా, సుఖంగా ఉంటారనిపిస్తోంది. మనసులు కలిసి, ఇష్టపడితే, వయసు తేడాలు అడ్డురావు."

మాట్లాడలేదు కిశోర్. 'ఇదేమిటి! తన జీవితం ఇప్పుడిలా మలుపు తిరగబోతున్నదా...? ఇప్పుడు ఈ వయసులో తనకి పెళ్లా! అందులోనూ ఉషతో! ఆమె ఏమనుకుంటుందీ? మాష్టారు ఇలా అడుగుతున్నారేమిటి? ఆర్మీ జీవితం ఇంకచాలు సివిలియన్‌గా బతుకుదామని మాత్రమే ఇక్కడికి వచ్చాడు. మరిప్పుడు జీవితం ఎలా మారబోతోందో...

> **ఆర్మీ జీవితం ఇంకచాలు సివిలియన్‌గా బతుకుదామని మాత్రమే ఇక్కడికి వచ్చాడు. మరిప్పుడు జీవితం ఎలా మారబోతోందో...**

అతని ఆలోచనలకు బ్రేకు వేస్తూ "ఆలోచిస్తున్నావా కిశోర్? " అడిగారు శంకరంగారు.

"అవును మాష్టారూ! మీరు చెప్పిన విషయం ఆలోచింపచేసేదిగానే ఉంది. 'అసలు అవసరమా'అనికూడా అనిపిస్తోంది"

"అలా ఆలోచించకు. అవసరమే" ఖచ్చితంగా అన్నాడయన.

"ఉష అభిప్రాయం ఏమిటో మనకి తెలియదు"

"ఆ సంగతి నేను తెలుసుకుంటాను. ఆమెకి ఇష్టమైతేనే"

కాసేపు మాట్లాడలేదు కిశోర్. "ఉషని బలవంతంచేసి, ఒప్పించే ప్రయత్నం మాత్రం చెయ్యకండి సార్! నన్ను కాస్త ఆలోచించుకోనివ్వండి."

కిశోర్ మాటలకి, శంకరంగారికి కాస్త సంతోషం కలిగింది. అవతలి మనిషిని నొప్పించే స్వభావం కాదు కిశోర్‌ది. కాస్త సమయం కావాలన్నా, ఆలోచించుకోవాలన్నా కిశోర్ అంగీకరిస్తాడనే ఆశ కలిగింది. ఉష విడో అనే అభ్యంతరం మాత్రం వ్యక్తం చెయ్యలేదు కిశోర్ అనుకున్నారు.

"అలాగే కిశోర్! ఉషనీ అడుగుతాను. ఆమె మనస్ఫూర్తిగా ఒప్పుకుంటేనే ఏదైనా జరుగుతుంది. తను విడో. మళ్లీ పెళ్లి చేసుకోవటానికి అభ్యంతరం లేకపోతే మనం ఒక అడుగు ముందుకు వెయ్యొచ్చు మీ ఇద్దరి విషయంలో నేను చాలా ఆలోచించే ఈ విషయం చెబుతున్నాను. చూద్దాం ఏం జరుగుతుందో!" అన్నారు.

శంకరంగారు ఇంటికి వచ్చి భోజనం చేశారు. ఉష టీవీ చూస్తూ కూర్చుంది. లక్ష్మి అప్పుడే నిద్రపోయింది. యాదమ్మ వంటిల్లు సర్దుతుంది.

ఉషని పెళ్లి గురించి కదిపారు శంకరం. కిశోర్ గురించిన వివరాలన్నీ చెప్పారు. కిశోర్ అన్న మాటలు కూడా చెప్పారు. చివరికి "ఏమ్మా ఉషా! ఏమంటావు? " అని అడిగారు.

"బాబాయిగారూ! నేను భర్తని పోగొట్టుకున్నదాన్ని...'

"ఆ సంగతి కిశోర్‌కీ తెలుసుగా. ఆ విషయమై అతడికేం అభ్యంతరం లేదు."

ఉష మౌనంగా ఉండటంతో, "నీకు అన్యాయమే జరిగిందమ్మా! అది బాధ కలిగించే విషయమే. కానీ అదే తలచుకుని, బాధ పడుతూ కూర్చుంటే ఈ జీవితానికే అర్థం ఉండదు. కిశోర్ మంచివాడు. నిన్ను బాగా చూసుకుంటాడనే నమ్మకం నాకుంది. మీరిద్దరూ ఒంటరివాళ్లు. సరే నంటే మీ ఇద్దరినీ ఒక ఇంటివాళ్లని చెయ్యాలని నా కోరిక"

ఉష ఇంకా మౌనంగానే ఉండటంతో "ఏమ్మా ఉషా? మాట్లాడవేం"

"బాబాయిగారూ! నా సంగతి, నా పరిస్థితి కిశోర్‌గారికి తెలుసు. నామీద ఉన్న జాలి

**ఆంధ్రకే సరి!**

చురుకైన వ్యాఖ్యలకు పెట్టిందిపేరైన కట్టమంచి.. టంగుటూరి ప్రకాశం పంతులుగారినీ వదిలిపెట్టలేదు. ఆయనకున్న 'ఆంధ్రకేసరి' బిరుదును 'ఆంధ్రకే సరి' అని విరిచి మాట్లాడేవారు. అంటే ప్రకాశం ఆంధ్రకు మాత్రమే నాయకులు అన్న అర్థం స్ఫురించేలా ఆ విరుపు ఉండేదన్నమాట.

తోనో, సానుభూతితోనో నన్ను పెళ్లిచేసుకుంటే ఆ తరువాత, ఇద్దరిలో ఎవరు బాధపడ్డా ఇంక ఆ బంధానికి అర్థముండదు. అంతకంటే ఈ ఒంటరి బ్రతుకే బాగుంటుంది. అందుకని..."

ఉష మాటలు పూర్తి కాకుండానే అన్నారు "అర్థమైందమ్మా! ఇద్దరూ బాగా ఆలోచించుకోండి. మాట్లాడుకోండి. కిశోర్ చాలా మంచివాడు, మంచి మనసున్నవాడు. అతనికి ఆస్తిపాస్తులు ఏమీ లేవుగానీ, ఉద్యోగం ఉంది. ఎంతో కొంత ఆర్మీ పెన్షన్ వస్తుంది. నీకూ ఓ ఉద్యోగం ఉంది. మీ జీవితాలు సుఖంగానే గడిచిపోతాయి!" అన్నారు శంకరంగారు.

## 19



మరొక నెల తరువాత రిజిష్టరాఫీసులో కిశోర్, ఉష పెళ్లి చేసుకున్నారు.

శంకరంగారు తన స్నేహితుల కుటుంబాలకు, కిశోర్ ఆఫీసులోనివారికి, ఉష ఆఫీసులోనివారికి కలిపి ఓ యాభై మందికి హోటల్లో మంచి డిన్నరిచ్చారు.

"ఒరే శంకరం! ఏదో సోషల్ సర్వీసు చేస్తూవుంటావని తెలుసుగానీ నువ్వు వీరేశలింగంగారివి కూడా అయ్యావన్నమాట!" అని జోక్ చేశాడు ఆయన మిత్రుడు సారథి.

"ఆ వీరేశలింగంగారితో నాకు పోలికేమిటిరా? ఆయన మహానుభావుడు. ఏదో నా మనసులోకి ఈ ఆలోచన వచ్చింది. ఇద్దరికీ చెప్పాను. వాళ్లూ ఇష్టపడ్డారు. పెళ్లి జరిగింది. ఒక ఇంటివాళ్లయ్యారు. ఈ డిన్నరు అంటావా. నా ఇష్టానికి నేనే ఖర్చుపెట్టి ఇస్తున్నాను. కిశోర్ నాకు కొడుకులాంటివాడు, ఉష నాకు కూతురులాంటిది. మంచి పిల్ల. వాళ్లు సుఖంగా ఉండాలి అంతే" అన్నారు శంకరం ఆనందంగా.

"ఒరే శంకరం! ఏమైనా నువ్వు మనిషివి కాదురా! దేముడివి" అన్నాడు సారథి మెచ్చుకోలుగా.

"నేను దేముణ్ణీ కాదు, దేవతనీ కాదు. సామాన్యమైన మనిషిని, బడిపంతుల్నిరా సారధీ! ఒక్క సంగతి చెప్పనా? "

"ఏంటి? "

"నాకిప్పుడు మా చిన్నారి లక్ష్మి గురించి న బాధ లేదు. రేపు నాకేదైనా అయితే, ఆ పసిదానిని చూసుకునేందుకు కిశోర్, ఉష ఉన్నారు" అన్నారు తృప్తిగా.

కొన్నాళ్లకి కిశోర్ ఉంటున్న ఫ్లాట్ అమ్మకానికి వచ్చింది. సెకండ్‌హాండ్‌ది కావడంతో కాస్త తక్కువ ఖరీదుకే వచ్చింది. ఆ ఇంటికి చుట్టుపక్కల పరిసరాలకు అలవాటు పడిన చోటు కిశోర్, ఉష అన్నీ బేరీజు వేసుకుని ఆ ఫ్లాట్ కొనుక్కున్నారు.

లక్ష్మికి స్కూలుకు పంపించే వయస్సు రావడంతో ఇంటి దగ్గరలోని స్కూల్లో చేర్పించారు శంకరంగారు. కిశోర్, ఉష కూడా లక్ష్మిని తమ కూతురిలా ప్రేమగానే చూసుకుంటున్నారు. లక్ష్మి రెండిళ్లల్లోనూ తిరుగుతూ ఉంటుంది. హాయిగా గడిచిపోతోందా పిల్లకి. యాదమ్మకి కాస్త ఓపిక తగ్గింది. పని చేసేందుకు మరొక పనిమనిషిని కుదుర్చుకున్నారు శంకరంగారు. ఆయనకు, పిల్లకు మాత్రం వంట చేసిపెడుతూ కాలం వెళ్లబుచ్చుతోంది యాదమ్మ.

* * *

గతం తాలూకు ఆలోచనల నుండి వాస్తవంలోకి వచ్చారు శంకరంగారు.

రాత్రి నిద్ర సరిగ్గా పట్టలేదు. దొర్లిపోయిన ఇన్నేళ్ల జీవితాన్ని మనో ఫలకం మీద నిలిపిన జ్ఞాపకాలు మనసుని చిందవందర చేశాయి.

నిన్నటి సంఘటనలే పేపరు నిండా నిండి పోయాయి. టీవీ పెడితే ఏ ఛానల్ పెట్టినా భయంకరమైన అలల రాక్షసి 'సునామీ' సృష్టించిన బీభత్సం గురించిన వార్తలే. అవి చదువుతున్నా, ఆ సంఘట నల్ని చూస్తున్నా మనసు వికలమైపో తోంది. బాధితులకు స్వచ్ఛందంగా సహా యం చేయడానికి కిశోర్ అక్కడికి వెళ్లాడు. అక్కడి వారికి సహాయం కోసం! ఎంతైనా ఆర్మీవాడు కదా! కష్టపడి పనిచేసే లక్షణం, క్రమశిక్షణా అతన్ని సానపెట్టిన వజ్రంలా చేశాయి.

సునామి విధ్వంసం గురించిన ఆలోచనల తోనే, శంకరంగారు మార్నింగ్‌వాక్‌కి సిద్ధమ వుతున్నారు. ప్రతి రోజూ కంటే ఈ రోజు ఒక పావుగంట ఆలస్యమైంది.

"తాతయ్యా! నేనూ నీతో వస్తాను వాకిం గ్‌కి. ఈరోజు ఆదివారం స్కూలు లేదుగా!" అంది అప్పుడే అక్కడికి వచ్చిన చిన్నారి లక్ష్మి.

"అలాగేనమ్మా! రా... వెళ్దాం. మరి అమ్మతో చెప్పు" అన్నారు - అప్పుడే వస్తు న్న ఉషను గమనించి.

"అమ్మా! నేను తాతయ్యతో వాకింగ్‌కి వెళ్తున్నాను. నువ్వు జాగ్రత్తగా వుండు...!!" ఆరిందాలాగా అంది లక్ష్మి.

ఆ చిన్నరి మాటలకు ఉషకి నవ్వొచ్చింది "అలాగే... నేను బాగానే వుంటాను. నువ్వు తాతయ్యని జాగ్రత్తగా చూసుకో!" అంది ఉష.

లక్ష్మి చెయ్యి పుచ్చుకుని నడుస్తున్నారు శంకరం. చల్లగా ఉంది వాతావరణం.

ఈ చిన్నారి లక్ష్మి చేత అమ్మా, నాన్న అని పిలిపించుకుంటున్నారు కిశోర్, ఉష. భవిష్యత్తులో లక్ష్మికి వాళ్లు తల్లిదండ్రులు కాదని తెలిసినా బాధ పడకుండా కొంచెం పెద్దదయ్యాక అన్ని విషయాలూ చెప్పడమే మంచిదాను కున్నారు. ఆయన మనసునిం డా ఇంకా ఏవేవో ఆలోచనలు గజిబిజిగా.

ఎన్నో ఏళ్లుగా తనీ వాకింగ్ చేస్తున్నాడు. ఇదే నడక! ఇవే రోడ్లు, ఇవే దారులు. అప్పుడు ఈ చిన్నారి లక్ష్మి లేదు, అసలు తన జీవితంలోకి ఈ పిల్ల వస్తుందని కూడా అనుకోలేదు ఏనాడూ.

ఇన్నేళ్ల కాలంలో ఎన్ని సంఘటనలు! ఎన్నెన్ని అనుభవాలు!

ఈ లక్ష్మి!... ఇప్పుడు తనకి ప్రాణంతో సమానంగా మారింది.

చిన్నప్పుడు అల్లరి చిల్లరగా తిరిగినా పెద్ద య్యాక బుద్ధిమంతుడై తనవల్లే జీవితం గా డిలో పడిందనుకుంటూ ఎంతో ప్రేమ, అభి మానం, గౌరవం ప్రదర్శించే శిష్యుడు కిశోర్ తననంటిపెట్టుకునే ఉన్నాడు. అతడి కార ణంగానే తన దరికి చేరిన ఉష కూడ తనం టే మనసునిండా అంతే అభిమానాన్ని నింపుకుని ఆదరంగా ఉంటోంది.

ఇన్నేళ్లుగా తన ఇంటినే అంటిపెట్టుకున్న యాదమ్మది ఎంత స్వామిభక్తి.

వీళ్లందరూ ఎవరు? వీళ్లంతా తన చుట్టూనే ఉన్నా తనకేమవుతారు? వీళ్లకి త నేమవుతాడు? తమ మధ్య చుట్టరికాల అను బంధం లేదు, రక్తసంబంధం అంతకంటే లేదు...!

మరీ ఏ అనుబంధం ఉందీ అని ప్రశ్నిం చుకుంటూ మానవుడికీ, మానవుడికీ మధ్య ఉన్న అనుబంధం! మానవతా బంధం!

మంచితనమో, సంస్కారమో, మానవ త్వమో! అవి తనవి మాత్రమే కాదు.

ఆ గుణాలన్నీ యాదమ్మ, కిశోర్, ఉష, లక్ష్మి... వీళ్లందరిలోనూ ఉన్నాయి. వాళ్లలో ఉన్న మంచితనం, సంస్కారమే తమ అనుబంధాన్ని నిలుపుతోంది!

ఆయన ఈ అనుబంధం ఎందుకు? అనే ప్రశ్నకు వేదాంత ధోరణిలో 'విధి ప్రేరితం' అనుకుని జవాబు చెప్పుకోవాలి.

ఆనాడు భుజ్‌కి జరిగిన ఆ భూకంపం చూడటానికి వెళ్లకుండా ఉండి ఉంటే ఈ సంగమం జరిగి ఉండేది కాదేమో! ఒక

ప్రకృతి వైపరీత్యం తమ మధ్య బంధాన్ని పెంచడం వింత కాకపోతే మరేమిటి... నా జీవితం సంధ్యమలుపు తిరిగింది. జీవితం చివరి కొసకు చేరుకుంటున్నాను. ఈ భూమ్మీద పడినప్పటి నుంచీ ఎన్ని ఉషస్సులూ ఎన్ని సంధ్యలు చూశానో! ఇంకెన్ని భాస్కరుడి ప్రయాణాలు చూడాలో...!

ఇప్పుడు ఈ 'సునామీ'లో ఎన్ని ఘోరాలు జరుగుతున్నాయో! దైవ ఘటనలకి అంతూ, దరీ ఉండదు. అర్థమూ తెలియదు. మానవుడు ఎంత శక్తిమంతుడైనా దైవశక్తికి శిరస్సు వంచటమే'

ఎడతెగని స్మృతులు, ఆలోచనలు నడుస్తున్న ఆయనలో. అప్పుడే ఉదయిస్తున్న బాలభానుడి కిరణాలు లోకంమీద పరుచుకుని ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి.

లక్ష్మి చుట్టుపక్కల పరిసరాల్ని ఆశ్చర్యంగా ఆనందగా చూస్తూ కేరింతలు కొడుతూ గెంతుతూ మధ్య మధ్యలో తాతయ్యా అని పిలుస్తూ శంకరంగారిని ఏవో ప్రశ్నలడుగుతూ ఆయన్ని అనుసరిస్తోంది.

వాకింగ్ ముగించుకుని ఇంటి ముఖం పట్టారు తాతా మనవరాళ్లు.

ఈ రోజు గడవటం మొదలయ్యింది. మళ్లీ రేపు రోజు కొత్త ఆశలతో మరో శుభోదయం రావాలి. రేపటి కోసం ఈ క్షణం నుంచీ మళ్లీ ఆశతో ఎదురుచూస్తూ... ఇదీ జీవితం... ఇదే జీవితం!' నవ్వుకున్నారు వేదాంతిలా!

రోడ్డు మీద పున్నాగ చెట్టుకి విరగబూసిన తెల్లటి పున్నాగపూలు శంకరంగారి నవ్వుని చూసి విచ్చుకున్నాయి - మరింత అందంగా...!



# చతుర కథలు

సోమంచి రామం

ఏ మాట కామాటే చెప్పుకోవాలి! మా అత్తయ్య మహా పొదుపరి! మా మామయ్య కొద్దిపాటి పిసినారి అని జనం అంతా అనుకుంటారు. అది ఎంతవరకు నిజమో చెప్పలేను. నిజం నిలకడ మీద కాని తేలదంటారుగా! మరి ఈ నిజం, కథ చదివితే గాని బయటకు రాదు.

దాదాపు నలభై ఏళ్ళపాటు అద్దె కొంపల్లో నానా అగచాట్లు పడింది ఆవిడ! అలాంటే ఆయనేం ఇబ్బంది పడలేదాని మీరడగొచ్చు. నిజం చెప్పొద్దూ! మగాడి కష్టం మైక్రో సిస్టంలా పైకి కనపడదు. కాని ఆడదాని అవస్థలు- 70 ఎమ్. ఎమ్ స్క్రీన్ ఎక్స్పోజరులా కనిపిస్తాయి.



# దమ్మిడీ... ఏగాణీ క్షవరం!

అందుకే- 'పాపం ఆడ కూతురు'- అంటారు కాని, పాపం మగ కొడుకని అనరుగా!

ఇంతకూ ఆవిడ పడిన బాధేమిటయ్యా అని అంటారా! అదే చెప్తున్నా. అద్దెలెక్కువ, సౌకర్యాలు తక్కువ, రెండేసి వాటాలకు కామన్ లెట్రిన్, బాత్‌రూము. సంపులో నీళ్ళు పావుగంట కన్నా మించి పట్టకూడదు. ప్రతి దానికి ఓనరుతో పేచీ. పక్క వాటాల వాళ్లతో పోరు!

వీటికి తోడు, అందరి ఆడవాళ్లలానే- నీళ్లోసుకోవడం- (అంటే నెల తప్పడం అన్న మాట. ఈ మాట చెప్పకపోతే- పాపం- ఈ కాలం పిల్లలకు అర్థం కాక- అదేదో బాత్‌రూంలో షాంపూతో స్నానం చేయడమనుకునే ప్రమాదముంది)- తొమ్మిదో నెలలో పుట్టింటి కెళ్ళి, నీళ్లాడి, పండంటి బిడ్డల్ని కనడం, వాళ్లని పెంచడం, వంట పని, యింటి పని, ఒకటేమిటి అన్ని పన్లు చేసేది. అఫ్ కోర్స్! ఇవన్నీ అందరూ చేసేవే అనుకోండి. అయినా అందులో ఎంత కష్టముందో చెప్పడానికే- "ఈ పన్లన్నిటికి, ఒక్కొక్కదానికి నెలకెంత జీతం అవుతుందో లెక్కేయండి. అప్పుడు నా వాల్యూ ఏమిటో తెలుస్తుంది!" అంటూ ఈ నలభై యేళ్ళలోనూ మా మామయ్యను సతాయించేసేదనుకోండి!

అలా పిల్లల బాధ్యతలన్నీ తీరిపోయాక, కూడబెట్టిన సొమ్ముతో శ్రమపడి, చెమటోడ్చి, మా మావయ్య యిల్లు కడితే అదంతా తన ప్రయోజకత్వమే అంటుంది మా అత్తయ్య. కింద పడ్డా తానే గెలిచాననే తంతు ఆవిడది!

ఇప్పుడింతకూ చెప్పొచ్చేదేమిటంటే అదిగో అలా చూడండి! మీకే అర్థమౌతుంది.

"ఇదేమిటే? దొడ్డంతా యిలా గోతులు తవ్వేస్తున్నావ్? "

"అబ్బబ్బ!... మీరు కాస్సేపు నోరు మూసుక్కూర్చుంటారా? నా తిప్పలేవో నేను పడుతున్నాగా! మీకెందుకు? మీకేం తెలుసు? మార్కెట్లో కూరగాయల ధరలెలా మండిపోతున్నాయో? "

(మా అత్తయ్య టీ.వీ. సీరియళ్ళ వీరాభిమాని)

"మార్కెట్లో కూరలు మండిపోవడానికి ఈ గోతులకి సంబంధమేమిటే? "

"అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు అన్నీ చెప్పాలి. అయ్యో రామా! ఇన్నేళ్ళు ఆ మేష్టరీ గిరీ ఎలా వెలగబెట్టారో! ముందు మీరిక్కడ్నించి వెళ్ళండి! ఊ... వెళ్ళండి!" అంటూ హుకుం జారీ చేసింది అత్తయ్య!

* * *

ఓ నాలుగు రోజులు గడిచాక, "ఇదిగో... మిమ్మల్నే! చూశారా? చిన్ని ముండలు ఎంత ముద్దొస్తున్నాయో!" అంటూ ఉత్తర దిక్కున ఓ పాతిక సొర, బీర మొక్కల్ని, దక్షిణ దిక్కున చిగురేస్తున్న దొండ తీగెను, ఓ పది కాకర మొక్కలను చూపించి, తన ప్రయోజకత్వానికి తానే మురిసిపోతూ, గర్వంగా చూసింది మామయ్యకేసి..

ఆ మర్నాడు ఓ పందికొక్కొచ్చి అందులో కొన్ని మొక్కల్ని పుల్లగించేసింది. ఆ రోజే మామయ్య ఊరెళ్ళాడు! అప్పుడు, ఆ ఉన్న మొక్కలన్నింటి మీద, ఇంట్లో ఉన్న అయిదారు ప్లాస్టిక్ బకెట్లని బోర్లించేసింది అత్తయ్య!

పది రోజులకి మామయ్య తిరిగొచ్చాడు!

"అయ్యయ్యో!... ఇదేంటే? ... ఈ బకెట్లేంటి... 'వాటికా కంతలేంటి? " అంటూ నెత్తీ నోరు కొట్టుకున్నాడు. "పంది కొక్కొచ్చి మొక్కలు పీకకుండా ఉండాలని బకెట్లు బోర్లిస్తే, ఊపిరాడక అవి మాడిపోతున్నాయి. అందుకని అలా కంతలు చేశా. ఇదిగో ఇప్పుడు చూడండి. మొక్కలు ఎంత పైకొచ్చాయో!" గర్వంగా చెప్పింది.

మొక్కలు పెరిగాక, పాదులుగా పైకెక్కించేందుకు, డాబా పిట్ట గోడకు మేకు కొట్టబోతే, అది మొరాయించింది. ఆ సందట్లో, ఆ సుత్తి దెబ్బ దారి తప్పడంతో, మామయ్య కుడి చేతి బొటనవేలు పచ్చడి పచ్చడైపో

యింది. కుయ్యిమంటూ గోల పెట్టేసరికి అత్తయ్యొచ్చి "చాల్లెండి నిర్వాకం! ఒక్క పని కూడా సరిగా చేయడం చేతకాదు" అంటూ కసురుకుంది!

ఆ రాత్రికి మాత్రం, అన్నం కలిపి నోట్లో పెట్టింది మామయ్యకు!

* * *

పాదులన్నీ డాబా అంతా పాకిపోయాక, ఓ రోజు పిందెలపైన బూడిద రంగు తెగులు కన్పించేసరికి, అత్తయ్య ప్రాణం గిల గిలా కొట్టుకుపోయింది. వెంటనే కిలో గమాక్సిన్, కిలో సెవెన్ పౌడరు తెప్పించి, పాదులన్నిటిమీద ఎడాపెడా చల్లేసింది.

ఆ మర్నాడు చిన్న బకెటు నీళ్లలో, నువక్రాన్, డువక్రాన్ లాంటి మందుల్ని తెచ్చి కలిపి, వేప మండతో పాదులన్నింటిమీద జల్లింది. పాదులకుదుళ్లలో తలో పావుకిలో యూరియా కొట్టింది.

ఆ మందుల ఘాటుకో యేమో, దగ్గు తెరలొచ్చి అత్తయ్య ఉక్కిరిబిక్కిరయింది. వారం గడిచినా దగ్గు తగ్గలేదు. హాస్పటలు కెడితే, యూరిన్ టెస్టు, షుగరు టెస్టు, బ్లడ్ టెస్టు, బి.పి. టెస్టు, ఛెస్టు స్కానింగులన్నీ చేసి, ఏవో మందులు రాసిచ్చి, నాలుగు వేలు బిల్లు చేశారు.

మరో వారం గడిచింది. పిందెలు కొంచెం పెద్దవయ్యాయి. ఆ ఆనందం పట్టలేకో, లేక తెరలు తెరలుగా దగ్గొచ్చో' అత్తయ్య మాత్రం ఉక్కిరి బిక్కిరై పోతోంది. అయినా ఆవిడ ముఖంలో గర్వం తొణికిసలాడు తోంది. అలా దగ్గుతూనే డాబా యెక్కి పిందెల్ని చూడబోతే, దొంగ పందికొక్కు మెట్లెక్కి పిందెల్ని తినేసిన దృశ్యం అత్తయ్య కళ్లబడింది. దుఃఖం పొంగుకొచ్చినా, అలాంటప్పుడు తల పట్టుకొని దిగాలుగా కూర్చోడానికి, మా అత్తయ్యేం ఆషామాషీ మహిళనుకున్నారా? ... నెవ్వర్... ఆవిడ గొప్ప మేధావి! విక్రమార్కుడి బాపతు!

అందుకే, క్షణాల్లో కార్పెంటర్ రావడం, మెట్ల దిగువన చెక్క గేటు బిగించేయడం, అయిదొందలు పుచ్చుకోవడం చకచకా జరిగి పోయాయి.

అప్పుడు అత్తయ్య మొహంలో ఆనందం తాండవిస్తుంటే, మావయ్య ముఖంలో విషాదం గూడు కట్టుకుంది! మరో పది రోజులకు, కోత కొచ్చిన కాయల్ని కోసి, చుట్టు పక్కల వాళ్లకి, దేముడి ప్రసాదంలా, ముక్కలు చేసి తలో కాసిని పంచి పెట్టింది.

ప్రేమైక జీవుల్లా, పాదులన్నీ డాబాపైనే ఒకదానితో ఒకటి పెన వేసుకు పోయా యేమో, కాకర చేదు- దొండకు, బీరకు పట్టే సింది. అందుకే కాబోలు యిరుగు పొరుగు వాళ్ళు ఆ రోజునుంచీ అత్తయ్యని పలకరిం చడం మానేశారు! అత్తయ్య ప్రాణం చివుక్కుమంది.

మరో పది రోజులయ్యేసరికి, అత్తయ్య కొట్టిన మందుల మహిమో ఏమో మొత్తం పాదులన్నీ మాడిపోయాయి.

దీనికి తోడు ఆవిడకు దగ్గు యింకా తగ్గ లేదు. ఇంగ్లీషు మందులు లాభం లేదని, ఆయుర్వేదం లోకి దిగింది. ఆ డాక్టరు, అరకు, లేహ్యం, గుళికలు- మూడు రోజుల కిచ్చి, మూడొందలు బిల్లు చేశాడు. పైగా అలా ఆర్నెల్లు వాడాలని చెప్పాడు. దాంతో మామయ్యకు బి.పి. పెరగడం ప్రారంభ మైంది!

అదండీ సంగతి! కూరల ఖర్చు ఆదా చేద్దామని మా అత్తయ్య చేసిన ప్రయోగాని కైన ఖర్చు తడిసి మోపెడై, ఆరు వేలపైనే అయింది. నెలకు వంద చొప్పున కూరలకి ఖర్చు చేసినా, ఆ ఆరు వేలతో కనీసం అయిదారేళ్ళు లాగించేయచ్చు! అలా చేస్తే మా అత్తయ్య స్పెషాలిటీ ఏముంటుంది?

ఏమాట కామాట చెప్పుకోవాలి! మా అత్తయ్య మహా పొదుపరి! ✦

అప్పనంగా ఏదొచ్చినా అప్పారావుకి ఎంతో ఆనందం. ఎవరో అన్నట్లు ఫ్రీగా వస్తే ఫినాయిల్ కూడా తాగేస్తాడు. దానికి తగ్గట్లే ఒక పెద్ద కంపెనీలో పెద్ద పోస్టే దొరికింది. అన్నీ ఫ్రీయే అక్కడ. కాఫీ, టీలు, మెడిసిన్, ట్రీట్‌మెంట్ అలా ఎన్నో ఉచిత సదుపాయాలున్నాయి. ఇక అడగాలా అప్పారావు సంగతి. తంతే బూర్ల బుట్టలో కాదు, పూర్ణం అండాలోనే పడినట్లు అయ్యింది.

# టెస్ట్



## ఆకెళ్ళ వెంకట సుబ్బలక్ష్మి

ఆఫీసు ఆస్తిని స్వంత ఆస్తిలా వాడుకునేవాడు. వైద్యం మాత్రం అతని కొక్కడికే ఫ్రీ. తనమీద ఆధారపడినవారు ఎవరూ లేకపోయినా నలుగురి పెట్టు తనొక్కడే అన్ని టెస్టులు అవసరమున్నా లేకున్నా తరచుగా చేయించుకునేవాడు, బిల్లులు పెట్టేవాడు.

అప్పారావు లాంటివాళ్ళూ ఎక్కువై మెడికల్ బిల్స్, సాలరీని దాటిపోతూ ఉండటం వల్ల కంపెనీయే కొన్ని హాస్పిటల్స్ ఎంపిక చేసి వైద్యం కానీ, పరీక్షలు కానీ వాటిలోనే చేయించుకోవాలని ఆదేశించింది.

ఒకనాడు అప్పారావు చెల్లెలు, బావగారు దిగారు. చెల్లెలికి అనారోగ్యమట. పరీక్షలు చేయించాలట. అందుకే తీసుకొచ్చాడు బావగారు. అప్పారావు గుండె గుభేలుమంది. తనకంటే ఫ్రీ కాబట్టి అవసరమున్నా లేకున్నా ఏవో పరీక్షలు చేయించుకుంటాడు. ఇప్పుడెలా? ఎంతవుతుందో ఏమో అని భయపడ్డాడు.

ఎందుకంటే అప్పారావుది ఒక తీరయితే బావ వెంకట్రావుది మరో తీరు. అప్పారావు ఏదొచ్చినా ఆఫీసు మీద పడిపోతే, వెంకట్రావు అత్తారిమీద పడిపోతాడు. తండ్రి రిటైర్ అయిపోయాడు. కాబట్టి బాధ్యతలన్నీ తనవే. అందుకే బెంబేలు పడుతున్నాడు. ఇప్పుడేం చేయాలి అని ఆలోచించి, ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

బ్లడ్, యూరిన్ లాంటివి ఎవరివో ఎలా తెలుస్తాయి. అందులోని ఫలితాలే కదా రిపోర్టులో వచ్చేది అనుకుని చెల్లెలి బ్లడ్, యూరిన్ తన పేరుతో టెస్ట్‌కి ఇచ్చేశాడు అప్పారావు. మిగతా టెస్ట్‌లు ఏమైనా కొంతయినా కలిసి వస్తుందికదా అనుకున్నాడు.

మర్నాడు ఎం.డి. పిలిచాడు.

"కంగ్రాచ్యులేషన్స్. మీరు తల్లి కాబోతున్నారు. మీ యూరిన్ టెస్ట్ పాజిటివ్ వచ్చింది" అన్నాడు వ్యంగ్యంగా. డాక్టర్ రిపోర్ట్ ముందుకు తోస్తూ డాక్టర్ కూడా అక్కడే ఉన్నాడు. అతను ఎం.డి. ఫ్రెండ్.

"ఆ" అన్నాడు నోరు తెరుస్తూ అప్పారావు. పెళ్లయిన ఆడపిల్ల నలతకి ఆ కారణం ఉండవచ్చని తట్టని తన బుద్ధి తక్కువకి తల బాదుకున్నాడు.

నీకు మా కంపెనీ నుంచి శాశ్వతంగా మెటర్నిటీ లీవ్ శాంక్షన్ చేస్తున్నా. ఇక నువ్వెళ్లొచ్చు అన్నాడు కోపంగా ఎం.డి. హతాశుడైన అప్పారావు తనని తను తిట్టుకుంటూ ముఖం వేలాడేసుకుని బయటకు నడిచాడు. ✦

# చిద్వి 'లాస్'



## ఆనంద రావ్ పట్నాయక్

ట్రెయిను స్టేషను విడిచిపెట్టడానికి సిద్ధంగా ఉంది. చిద్విలాస్ హడావిడిగా వచ్చి ట్రెయిను ఎక్కాడు. కూతవేస్తూ ట్రెయిను ప్లాట్‌ఫామ్ వదిలి పెట్టింది. చిద్విలాస్ ఒక సీటులో కూలబడి కాస్త ఊపిరి పీల్చుకొన్నాడు. కంపార్టుమెంటంతా కలియచూశాడు. జనం అంత పెద్దగా లేరు. అంతలో టి.సి. వచ్చాడు. బెర్తు కావాల న్నాడు. టికెట్ తీసుకొన్నారా అన్నాడు టి.సి. అవును అని టికెట్ చూపించాడు. టి.సి. కాస్త ఇబ్బందిగా మొహం పెట్టి 'ముప్ఫయి ఎక్స్ట్రా' అవుతుందన్నాడు. చిద్వి లాస్ డబ్బు లెక్కపెట్టి ఇచ్చాడు.

"నాకు ఏ బెర్తు ఇచ్చారు" అడిగాడు చిద్వి లాస్.

"మీ ఇష్టం ఎక్కడయినా పడుకోండి. వింటర్ స్పెషల్ ట్రెయిను" అని టి.సి ముందుకు కదిలాడు. ఈలేసుకొని పై బెర్తు ఎక్కి పడుకొన్నాడు గురుడు. వాసన.... వాసన..... అవును. అది సిగరెట్ పొగ కిందికి వంగి చూశాడు. గిరీశం తన్మ యంగా సిగరెట్ కాల్చడంలో నిమగ్నమైవు

న్నాడు. చిద్విలాస్‌కి పొగంటే ఎలర్జీ. రుమాలుతో మొహం ముక్కు మూసుకొన్నాడు. దగ్గి, సకిలించాడు. కాని గిరీశం మరో లోకంలో ఉన్నాడు. అతగాడు తనవైపు చూస్తే ధూమపానం ఎంత హానికరమో చెప్దామని రిహార్సల్స్ చేసుకొంటున్నాడు.

"ఎక్స్‌క్యూజ్ మీ" చిద్విలాస్ గొంతు సవరించుకొని సణిగాడు.

"ఎస్" అన్నాడు గిరీశం.

"సిగరెట్ పొగ నాకు పడదు. కాస్త డోరు వైపు వెళ్లి తాగుతారా' అన్నాడు. "ఇది నో స్మోక్ జోక్ కాదు. అంతగా మీకు పడనిచో తమరే దయచేయుడు" అని డ్రామా డైలాగు చెప్పి సిగరెట్ పొగని అస్వాదించడంలో మునిగిపోయాడు గిరీశం. వీడి తస్సా చెక్కా. ఇక లాభం లేదని చిద్విలాస్ మరో రెండు సెక్షన్‌లు దాటుకొని కింద బెర్తులో పడుకున్నాడు. నిద్రపట్టక అటూ ఇటూ దొర్లుతున్నాడు. బుగ్గమీద చుక్కపడింది. వేలితో రాశాడు. మరో చుక్క కంటి మీద, తర్వాత ముక్కు మీద మరొటి పడ్డాయి. పైనున్న లగేజీ నుండి ఏదో పగిలి కారుతోంది. లీకేజీ...లేకేజీ....ఎవ్విరి వేర్ లీకేజీ... అక్కడ పడుకోవడం అసంభవం. లేచి మరో బెర్తుకి మారాడు. నిద్ర రావడానికి చిట్కాలు గుర్తు చేసుకొన్నాడు. అంకెలు వెనక్కు లెక్కపెట్టి, తప్పయిపోవడంతో హోమ్‌వర్క్ మానేశాడు. మరో చిట్కా అరంభించేలోగా చప్పుళ్లు విన్పించాయి. కంపార్టుమెంటులో పందికొక్కులు ఎలా వచ్చేశాయి చెప్మా అని ఆలోచించసాగాడు చిద్విలాస్. ఈసారి మరికాస్త ఎక్కువయి ఆగిపోయాయి. పక్కబెర్తులోని వ్యక్తి సైడుకి వత్తి గిల్లాడు.

చిద్విలాస్ దేన్నైనా భరిస్తాడు కాని గురకని భరించలేడు. కంపార్టుమెంటు చిట్టచివరనున్న సెక్షన్‌లోకి వెళ్లాడు. అది ఆరు బెర్తులున్న కూపె. కింద బెర్తుల్లో దంపతులిద్దరున్నారు. మధ్య బెర్తులో పడుకొన్నాడు చిద్విలాస్. ఒత్తిగిలి చూశాడు. అంతవరకు తనని రెప్పార్పకుండా చూస్తున్న ఆవిడ చటుక్కున కళ్లు మూసుకొంది. కళ్లు మూసుకొని నిద్రపోవాలని డిసైడయిపోయాడు చిద్విలాస్. సిక్త్‌సెన్స్ ఏదో చెప్తోంది. కళ్లు విప్పి చూశాడు. ఆవిడ మళ్లీ తదేకంగా చూస్తోంది. చిద్విలాస్‌ని చూడగానే కళ్లు మూసుకొంది. అలా కొంతసేపు దాగుడుమూతలయ్యాయి. భర్తను పిలిచి ఆమె ఏదో చెప్పింది. భర్తగారు లేచి,

"ఆప్‌కా బెర్తు నంబరు కిత్నా? " గద్దించి అడిగాడు. చిద్విలాస్‌కి హిందీ వచ్చు కాని ఆరున్నర అడుగుల పొడవైన సర్దార్జీని చూడగానే నోరెండిపోయింది. మాట పెగలలేదు. ఈసారి సింగుగారు సింహమైపోయాడు.

"వాట్ యీజ్ యువర్ బెర్తు నంబరు? "

చిద్విలాస్ నోట్లో లాలాజలం కలక్టు చేసుకొని నంగిగా సమాధానం చెప్పాడు. "నో యూ కాంట్ స్లీప్ హియర్ గో ఎవే"

పంజాబాయన హుకుం పాస్ చేశాడు. సర్దారిణి సంబరంగా చూస్తోంది మొగుణ్ణి. బహుగా ఇంగ్లీషు గలగలా మాట్లాడుతున్నాడని కాబోలు. చిద్విలాస్‌కి తల తీసేసినట్లనిపించింది. బెర్త్ ఇవ్వకపోవడమే మంచిదయింది. సర్దుకుంటూ జనరల్ కంపార్టుమెంటుకి మారాడు. జనం కిక్కిరిసి ఉన్నారు. కొంతసేపు నిలబడి, కొంతసేపు గోడకుర్చీ వేసి ఆఖరికి ఒకమూల కూచునేందుకు కాస్త జాగా దొరికితే చతికిలబడ్డాడు. తెల్లగా తెల్లారడంతో తెలివొచ్చింది చిద్విలాస్‌కి. అహా! ఏమి నిదరోయాను అని సరదా పడ్డాడు. టైం ఎంతయింది అని చూసుకొనేసరికి వాచీలేదు. టాయ్‌లెట్‌కి వెళదామంటే చెప్పులు లేవు.

దేన్నయినా ఒకదాన్ని పొందాలంటే దేన్నో ఒకదాన్ని వదులుకోవాలి.... బికాస్ కేర్ ఒన్ బిగిన్స్ ద అదర్ ఎండ్స్... అన్నారు వెనుకటికి మహానుభావులు. ✦

# దూర శ్రవణానందం

– కోటమర్తి రాధా హిమబిందు



ఆ టెలిఫోన్ బిల్ చూసేసరికి ముత్యాలరావు 'లబ్‌డబ్' క్షణకాలం ఆగిపోయినట్లయింది.. రెండు వేల రెండొందలు అనే అంకెలు మసకగా కన్పించాయి. నెలనెలా పాపం పెరిగినట్లుగా పెరిగిపోయి రెండునెల్లకో సారి వచ్చే 'బిల్' గుండెను 'ఢాం' అన్పించింది. అలవాటే అయినా ఈ సారి కొన్ని వందల ఢాంఢాంలు గుండెలో పేలాయి. ఎనిమిది వందలు, వెయ్యి, పదమూడు వందలు అలా అలా రెండు వేల రెండొందలు దాకా వచ్చింది.

'వేయాలి... ఈ ప్రవాహానికి ఆనకట్ట వేయాలి. లేదంటే ఈ వేగానికి తానే కొట్టుకుపోగలడు ఏం చేయాలి? ఎలా ఈ ఫోన్ ప్రవాహానికి తెరదించాలి? బిల్‌ను తగ్గించే మార్గం ఏమిటి? అతని బుర్ర వేగంగా పని చేయసాగింది.

ఆ రాత్రి వరహాలుతో అన్నాడు.

"వరహాలూ"

"ఫోన్ బిల్లు గురించేనా? మా అమ్మా నాన్నలకు చేసే ఫోన్లకు లెక్కగడతారా. వాళ్ళు ఇచ్చిన పదెకరాల పొలం మీ పేరున రాశారు కూడా. అవసరం అనుకుంటే దాన్ని అమ్మండి. అంతేగాని ఫోన్లు చేయొద్దని, బిల్లు అంతొస్తోంది, ఇంతొస్తోందని మాత్రం నా మీద ఏడ్వకండి"

'నీ మీద ఏవరు ఏడ్చారే... బిల్లు కట్టలేక నేను ఏడుస్తుంటే. ఇచ్చారులే మా పెద్ద పొలం ఎకరం ఐదువేల చొప్పున ఏభైవేలు ఖరీదు చేసే పొలం... ఈ రకంగా బిల్లులొస్తుంటే అది ఓ రెండేళ్లకు కూడా చాలదు." పైకి అని బతకటమే... అందుకే మనసులో అనుకున్నాడు.

"వరం.. ఈ నెల నుండి నెలకు వెయ్యి రూపాయలు యిస్తున్నాను నీకు. రెండు నెలలకు రెండువేలు. అందులో ఫోనుబిల్లుకు పోగా మిగతాది నువ్వే వుంచుకో"

"ఏంటీ" కెవ్వుమంది వరహాలు. సంతోషంతో నోట మాట రాలేదు.

"ఆ డబ్బు పూర్తిగా నీది. అందులో నుంచి రూపాయి కూడా నేను అడగను. నువ్వు నాకివ్వద్దు"

వరహాలు కళ్లు మెరిశాయి.

* * *

ముత్యాలరావు ఊహించినట్లుగానే బిల్ రెండు వందల నలభై మాత్రమే వచ్చింది. ఫ్రీకాల్స్ తను చేసుకున్నాడు మురిగిపోతాయని. ఒక్క టెలిఫోను రెంట్ మాత్రమే వచ్చింది.

బిల్ చూసి వరహాలు గునిసింది. ఇంకా తగ్గించేద్దామని నెలలు గడిచి సంవత్సరాలయ్యాయి. వరహాలు రెండు పేటల చంద్రహారం చేయించుకుంది. బయట వాళ్ళకు అలా చెబితే బాగుండదని ఈ రహస్యాన్ని బయట పెడితే అంతా దాన్ని పాటిస్తే తనకు వచ్చే ఫోను కాల్స్ ఆగిపోతాయోమో అని అందరికీ మావారు చేయించారని చెప్పింది.

భార్యకు చంద్రహారం చేయించాలని ఎప్పట్నించో అనుకుంటున్న ముత్యాలరావు ఆ అవసరం లేకపోవడంతో హమ్మయ్య అనుకున్నాడు. ఇంటికి వచ్చే ఫోన్లు వస్తూనే వున్నాయి. వరహాలు మాత్రం మరో నగ కోసం ప్లాను వేసుకుంటోంది. ✦

ప్రేమగ్రాన్స్

# ప్రేమ విలాసం



ఇందిర కాలమ్

బ్రూస్‌లీ ఉదయాన్నే పచ్చిక బయల్లో నడుస్తున్నాడు. అక్కడ కొంత దూరంలో పదేళ్ళ కుర్రాడు కరాటే సాధన చేస్తున్నాడు.

బ్రూస్‌లీ ఆ కుర్రాడినే గమనిస్తున్నాడు. ఆ కుర్రాడి పంచ్ (Punch)లో స్థిరత్వం లేదు. అతడు ఒకేసారి ఒకేలా, ఒకే దిశలో ఒకే వేగంతో, ఒకే ఉద్దేశ్యంతో అతడి కదలికలపై అతడే అనుమానంగా ఉన్నాడు.

బ్రూస్‌లీ దగ్గరకు వెళ్ళి ఎదురుగా నిలబడి "ఇప్పుడు కొట్టు" అన్నాడు.

ఆ కుర్రాడు అలాగే సంశయంగా కొట్టాడు.

"బ్రూస్‌లీ ఆలోచించకు అనుభూతి చెందు (Dont think, feel it)"అని వెళ్ళిపోయాడు.

అనుభూతి సాంద్రత, ఆలోచన సాంద్రత కంటే బలమైంది, స్థిరమైంది, నమ్మదగినదిగా శాస్త్రీయంగా నిరూపితమైంది. అందుకే ఈ మధ్య నిశీ అనే కొత్త మాట వాడుకలోకి వచ్చింది. అంటే ఉద్వేగాల సాంద్రత, సామర్థ్యం ఇదివరకు మనిషి తెలివి సాంద్రత, సామర్థ్యమే (IQ) అతని విజయానికి కారణం అనుకున్నారు. అయితే ఎంత IQ ఉన్నా, అధిక నిశీ ఉన్నవాడే విజయుడవుతాడని శాస్త్ర పరిజ్ఞానం తేల్చి చెప్పింది.

మనిషిలో అనుభూతి కేంద్రం ఆలోచనా కేంద్రం కన్నా లోతయినది, సాంద్రమైంది, శక్తివంతమైంది. మానవ ఉద్వేగాలన్నీ అనుభూతి కేంద్రంతో అనుసంధానమై ఉంటాయి. ఒక ఆలోచన ద్వారా స్ఫూర్తి పొందిన వారి కంటే, ఒక ఉద్వేగంతో ఉత్తేజితమైన వ్యక్తి ఎక్కువ శక్తిని సమర్థవంతంగా వినియోగిస్తాడు.

బలహీనమైన స్త్రీ ప్రమాదంలో వున్న బిడ్డను రక్షించడానికి అసాధారణమైన శక్తి సామర్థ్యాలను ప్రదర్శిస్తుంది. అలాగే ఏ ఉత్సాహం లేని సైనికుడు, మాతృదేశాన్ని కాపాడే పరీక్షా సమయంలో పూర్తి శక్తితో యుద్ధం చేస్తాడు. తను ప్రేమించిన స్త్రీ కోసం, ఆమె మెప్పు పొందడం కోసం ప్రేమికుడు ఊహించలేని సాహసాలను చేస్తాడు. అందుకే చాలాసార్లు ప్రతి విషయంలో వెనకబడిన వ్యక్తి, అకస్మాత్తుగా విజయుడవడం చూసి ఆశ్చర్యపోతుంటాం. నిజానికి అతడు ఒకానొక ఉద్వేగంతో ఉత్తేజితుడయ్యాడు.

'వేగంగా పరిగెత్తాలి' అని ఒక వ్యక్తికి చెప్తే, ఆ ఆలోచననుసరించి అతడు వేగంగా పరిగెత్తలేడు. అయితే అదే వ్యక్తి భయం వల్లో పౌరుషంతోనో, ద్వేషంతోనో పరిగెడితే అప్పుడతడి వేగాన్ని అతడే నమ్మలేడు. తనలో అంత శక్తి ఉందా?! అని తనే ఆశ్చర్యపో

తాడు.

గమనిస్తే ఇలాంటి సందర్భాలు జీవితంలో చాలా కనిపిస్తాయి.

ఆలోచనలకంటే లోతయినవి ఉద్వేగాలు. అయితే ఉద్వేగ కేంద్రాన్ని దాటి మరింత లోతుగా ఉంటుంది ప్రేమ. ఉద్వేగాలలో ఉండే అలజడి, వత్తిడి, వేగం లేకుండా ప్రశాంత ఆనంద చిత్తంగా ఉంటుంది ప్రేమ. ఉద్వేగం కొండచరియ నుండి దూకే జలపాతం అయితే ప్రేమ మైదానంలో హాయిగా సాగిపోయే నిర్మల ప్రవాహం లాంటిది.

ప్రేమ ఉద్వేగాలను తాకుతుంది. ఉద్వేగాల గుండా, ఉద్వేగాలతో కలిసి ప్రయాణం చేస్తుంది. అందుకే ప్రేమికులు అనేక రకాల ఉద్వేగాలకు లోనవుతూ ఉంటారు. తార్కికుడు, మేధావి, వ్యూహకర్త మొదలైనవారు వారి ఉద్వేగ ప్రపంచాన్ని చాలా అరుదుగా తాకుతుంటారు. వారు ప్రేమికులయితే తప్ప కవులు, కళాకారులు ఉద్వేగ కేంద్రంనుండే పనిచేస్తారు. వారు విధిగా ప్రేమను తాకుతుంటారు. అయితే ప్రేమికులు ఉద్వేగ ప్రపంచంతో పెనవేసుకుని ఉంటారు. వారు అనివార్యంగా ఉద్వేగాలకు లోనవుతుంటారు.

ప్రేమ ముప్పిరిగొన్న ఆ క్షణాలలో, ఒకానొక అనిర్వచనీయమైన అనుభూతిని అనుభవిస్తారు. అయితే ఆ ప్రేమా అనుభూతి అకస్మాత్తుగా వస్తూ, మాయమవుతూ ప్రేమికులను ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. ప్రేమికులు తరచూ ఆ అనుభూతి కోసం వెంపర్లాడుతూ ఉంటారు. దాన్ని మళ్లీ మళ్లీ సృష్టి చేయాలనుకుంటారు. ప్రేమ ఏయే సందర్భాలలో తమను ఆవరించిందో ఆయా సందర్భాలు తిరిగి వచ్చేలా, అవే పనులను అవే పరిసరాలను, ఆ మనుషులనే పదేపదే కలుస్తూ ఉంటారు. అలా ప్రయత్నిస్తూ ప్రయత్నిస్తూ, అసలు ఏం చేసినా ప్రేమానుభూతి కలగని ఒకానొక పరిస్థితిలో ఆ ప్రయత్నాన్ని మానుకుంటారు. మళ్లీ ఎప్పుడో ఒకరోజు అకస్మాత్తుగా, ఏదో అనుకోని సందర్భంలో, ఊహించని విధంగా, ప్రేమతో హృదయం తడిసినప్పుడు,ఆ సందర్భానికి మళ్లీ అతుక్కుపోయి, ఆ అనుభవాన్ని శాశ్వతం చేయాలని ప్రయత్నిస్తారు. అందుకు కారణమైన వ్యక్తిని సొంతం చేసుకోవాలనుకుంటారు. అయితే ఏం చేసినా 'ప్రేమ' అనుకోని అతిథిగా వచ్చి మురిపించి మురిపించి మాయమైపోతూ ఉంటుంది.

ప్రేమ రాకపోకలు, అది ఎటునుంచి వచ్చి ఎటు పోతుందో ప్రేమికులకు తెలీదు. అయినా ప్రేమ కోసం, ఆ అనుభూతి కోసం, ఆనందం కోసం ఏమయినా చేయగల సాహసం, ఓపికతో ఎదురు చూడాలనే ఓర్పు ప్రేమికుడికి ఉంటాయి. అంత చేసినా ప్రేమకు గ్యారంటీ లేదు. ప్రేమ కోసం వెతకడం అంటే కటిక చీకటిలో దారి కోసం తచ్చాడడం లాంటిదే. అందుకే ప్రేమికులు తాము ప్రేమను పొందగలరన్న నమ్మకాన్ని తరచూ చాలా తొందరగా కోల్పోతూ ఉంటారు. అలా నమ్మకాన్ని పోగొట్టుకున్నవారే ప్రేమకు వ్యతిరేకంగా మాట్లాడుతుంటారు.

'ప్రేమను' నిర్ద్వంద్వంగా ఎన్నుకున్న వారే ఆ ప్రేమ రసాయనిక చర్య మర్మాన్ని కనిపెడతారు.

యవ్వన తొలి దశలో ప్రేమ వైపు ఆకర్షితులు కానివారుండరు. మధ్య వయస్సు వచ్చాక కూడా ప్రేమమీద నమ్మకం ఉన్న వారు చాలా అరుదుగా ఉంటారు. యవ్వన తొలి దశలో ప్రేమే జీవితం- ప్రతి ఒక్కరికీ. అయితే ప్రేమ రాకపోకల పట్టు దొరకక, ప్రేమకన్నా చేయవలసిన పనులు చేయాల్సి రావడం వల్ల ప్రేమ పట్ల ఆసక్తి అనవసరం అనుకుని, ఒక శాశ్వత బంధాన్ని, అన్ని అవసరాలకూ పనికి వచ్చేలా ఏర్పాటు చేసుకుంటారు. అలా అన్ని విషయాలను ఆలోచించి డబ్బు, హోదా, కుటుంబ గౌరవం, భవిష్య ప్రణాళికల నన్నింటినీ పరిగణనలోకి తీసుకుని భాగస్వామిని ఎన్నుకోవడమే సరి అయిన పద్ధతిగా యవ్వన తొలి దశలో కలి

**ఆయుర్ వస్త్ర** 'ఈ మందుతో ఈ రోగం తగ్గింది' అనే రోజులు పోయి, 'ఈ వస్త్రంతో ఈ రోగం నయమవుతుంది' అనే రోజులు వచ్చేశాయండోయ్.

ఆశ్చర్యపోతున్నారా! దుస్తులు ఆచ్ఛాదన కోసమే కాదు; అస్వస్థత నివారణ కోసం కూడానట. ఏ మందులకూ లొంగని దీర్ఘవ్యాధులు తమ వస్త్రాలు ధరిస్తే నయమైపోతాయంటున్నారు కేరళ వాళ్లు. తిరువనంతపురం వీవర్స్ సొసైటీ వాళ్ళు ఆయుర్వేద శాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసి కొత్తరకం దుస్తుల్ని తయారు చేశారు. వాటికి 'ఆయుర్ వస్త్రాలు' అని నామకరణం చేశారు. ఈ దుస్తులు ప్రపంచ మార్కెట్లోకి రాబోతున్నాయట. ప్రకృతి సిద్ధమైన మూలికావృక్షాల నుండి తయార్ చేసిన డైె ఉపయోగించి ఈ వస్త్రాల్ని తయారు చేస్తున్నారట.

ఈ వస్త్రాల్లో వ్యాధిని బట్టి డైె చేసిన మిశ్రమంతో కూడిన నూలు ఉంటుంది. నూలు మిశ్రమపు పాళ్ళుంటాయి. కీళ్ళనొప్పులు, బ్లడ్‌ప్రెషర్, చర్మవ్యాధులు, డయాబిటిస్ వంటి వ్యాధులున్న వాళ్ళు ఈ వస్త్రాల్ని ధరిస్తే ఎంతో ఉపశమనం కలుగుతుందని తయారీదారులు హామీ ఇస్తున్నారు. వీటి ధర సరసమేనట! కేవలం 500 రూ॥ల నుండి 800 రూ॥ మాత్రమేనట. ఇంకేం ప్రయత్నం చేస్తే పోలా!

గిన ప్రేమ కేవలం యిన్ ఫాచ్యుయేషన్, ఆకర్షణ అని ఈమధ్య అన్ని పత్రికలలో కౌన్సిలింగ్ చేస్తున్న సైకాలజిస్టుల ఉద్దేశం.

అయితే ప్రేమను నమ్మినవారు, ప్రేమలో ఆ అనుభూతిలో జీవించాలని నిర్ణయించుకున్నవారు ప్రేమ అనుపానులను తెలుసుకుంటారు. వీరికి ప్రేమ అనుకోని అతిథి కాదు. శాశ్వత అతిథి. ఒక విధంగా వారిని ప్రేమ పూర్తిగా ఆక్రమిస్తుంది. వారే ప్రేమ అవుతారు.

ప్రేమ పట్ల ఆకర్షణ ఉండడం వేరు, ప్రేమపై పట్టు సాధించడం వేరు. అందుకు ప్రేమను ఎన్నుకోవాల్సి ఉంటుంది. అప్పుడే ప్రేమ శాస్త్రాన్ని అధ్యయనం చేయడం, ప్రేమకు శాశ్వత విడిదిగా మనల్ని మనం తీర్చిదిద్దుకోవడం సాధ్యమవుతుంది. మనిషి ఏది .కోరుకుంటాడో దాన్నే పొందుతాడు. ఈ విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. ప్రేమను కోరకుండా, అది లేదని బాధపడడం, తీసి పారేయడంలో ఔచిత్యం ఏమీ లేదు.

యువతీ యువకులు, ప్రేమ కావాలని అనుకునేవారు ప్రేమ శాస్త్రాన్ని, ప్రేమ విలాసాన్ని విధిగా అధ్యయనం చేయాలి. అప్పుడే జీవితంలో ప్రేమ, ఆనందం వెల్లివిరుస్తుంది.

ఎందుకంటే ప్రేమ అనేది ఉద్వేగాలకన్నా శక్తివంతమైంది. సమగ్రమైంది. చల్లనిది, నిర్దిష్టమైంది. ఆనందాన్నిచ్చేది. ప్రేమ పునాదిగా, ప్రేమతో ఉత్తేజితమై చేసే ఏ పనయినా మంత్ర ముగ్ధులను చేస్తుంది. ఆ పనిలో స్పష్టత, అద్భుతమైన సృజన ఉంటుంది. శాంతి ఉంటుంది. బహుశ సమీప భవిష్యత్తులో విజ్ఞాన శాస్త్రం ఉద్వేగ సాంద్రత (EQ)కు బదులుగా ప్రేమ సాంద్రత (LQ) సామర్థ్యాన్ని పరిగణనలోకి తీసుకునే అవకాశం ఉంది.

మానవ చైతన్య పరిణామంలో ప్రేమను మనిషి అత్యున్నత చైతన్య వికాసంగా గుర్తించారు. కనీస భౌతిక అవసరాలన్నీ తీరిన వ్యక్తి, హృదయపు ఆకలిని తీర్చుకోవాలనుకుంటాడు. ప్రేమ అతని అవసరంగా ఉంటుంది. భౌతిక ప్రపంచంలో అన్ని రంగాలలో విజయాలు సాధించిన ఈ యుగంలో మానవుడు ఆంతరంగిక ఆకలి వైపు దృష్టి సారించడంలో ఆశ్చర్యం లేదు.

ప్రేమ అదొక విలాసం- మనిషి పొందగలిగిన అత్యున్నతమైన వైభవం. ✦

నాటి చతుర



నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# పునరంకితం

జి.సత్యమూర్తి

నవంబరు 1978: సంపుటి: 1 సంచిక: 10

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. గతంలో ఏ నెలలో ప్రచురించిన నవలను అదే నెలలో పరిచయం చేయడం జరుగుతుంది. చతుర ప్రచురణ ప్రారంభమైన 1978వ సంవత్సరం నవంబరు నెలలో ప్రచురించిన **'పునరంకితం'** నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

నూరేళ్ళు కలిసి బతుకు పండించుకోవాల్సిన భార్యా భర్తలలో ఏ ఒక్కరు వ్యామోహాలకు లోనై బాధ్యత మరిచినా ఆ సంసారం కుక్కలు చింపిన విస్తరే అవుతుంది. ఒకరు తప్పు చేస్తే మరొకరికి పెద్ద శిక్షే పడుతుంది. అలా శిక్షపడిన ఒక యువతి, మరో యువకుడూ పరస్పరం ఒకరినొకరు అర్థం చేసుకుని సదవగాహనతో ఒక్కటైపోయి ఓ ఇంటివారైన కథే ఈ 'పునరంకితం' నవల

**సంక్షిప్తంగా ఇతివృత్తం:**

ఒక పెద్ద ఆటోమొబైల్స్ కంపెనీకి జనరల్ మేనేజర్ అయిన కమాలాకరం ఆఫీసుకు జయంతి రావటంతో నవల ప్రారంభమవుతుంది. ఆమె మాట్లాడడానికి కేవలం ఐదు నిమిషాలు మాత్రమే టైం కేటాయిస్తానంటాడు కమలాకరం. ఈలోగా బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌లో ఒకరైన తాతారావు కమలాకరం దగ్గరకొచ్చి తన కూతుర్ని ఎవడో ముక్కూమొహం తెలీని వాడికిచ్చి లాటరీ వేసేకంటే కమాలాకరానికే ఇచ్చి పెళ్ళిచేస్తానంటాడు. కమలాకరం ఒప్పుకోడు. దాంతో వ్యక్తిగత విషయాల ప్రస్తావన వచ్చి ఇద్దరి మధ్య ఘర్షణ జరుగుతుంది. కమలాకర్‌తో మాటాడడానికి వచ్చిన జయంతి అతడిచ్చిన ఐదు నిమిషాల సమయం తను చెప్పబోయే విషయానికి సరిపోదనీ, తను లేచిపోయిన అతడి భార్య రాజ్యలక్ష్మి దగ్గర నుండి వచ్చాననీ అంటుంది. ఆమెను కారులో ఇంటికి పంపించి తను రాత్రి ఎనిమిదింటికి వస్తానని అప్పుడు మాట్లాడదామని చెబుతాడు కమలాకరం.

జయంతి కమలాకరం ఇంటికి వెళుతుంది కానీ, తన పరిస్థితి తనకే విచిత్రంగా అనిపిస్తుంది. పత్రికలు తిరగేస్తుండగా 'మమ్మీ' అన్న పిలుపు వినిపించి వెనక్కి చూస్తుంది జయంతి. పదేళ్ళ కుర్రాడు కమలాకరం

కొడుకు సాగర్ ఆమెను తల్లి అనుకుని సంభ్రమంగా పిలిస్తాడు. అంతలోనే ఆమె తన తల్లి కాదని తెలుసుకుంటాడు. అరగంటలోపే జయంతితో చనువుగా మాట్లాడటం మొదలు పెడతాడు. తన పుస్తకాలు, బొమ్మలు చూపిస్తాడు. తండ్రి చూస్తే చింపేస్తాడని తను జాగ్రత్తగా దాచుకున్న తల్లి ఫోటో చూపిస్తాడు. కమలాకర్ విజ్ఞప్తి మేరకు అక్కడే భోజనం చేసిన జయంతి, ఆ తర్వాత అతడికి తన కథ చెబుతుంది మూడు సంవత్సరాల క్రితం తనను పెళ్ళి చేసుకున్న రాజారావుకు ఎనిమిది నెలల క్రితం కాకినాడ నుండి వైజాగ్‌కు బదిలీ అవుతుంది. వైజాగ్‌కు వెళ్ళాక నాలుగు నెలల వరకు ఇల్లు దొరకలేదని ఉత్తరాలు రాశాడు. ఆ తరువాత తను ఉద్యోగం మానేసి రాజ్యలక్ష్మితో కలిసి ఏలూరులో కాపురం పెట్టానని రాశాడు. జయంతి ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబు రాసేవాడు కాదు. ఎదురుచూసి చూసి జయంతి నాలుగు రోజుల క్రితం ఏలూరుకు వెళ్ళింది. తలుపు తీసిన రాజ్యలక్ష్మికి తానెవరో పరిచయం చేసుకుంటుంది. ఎందుకొచ్చావని రాజ్యలక్ష్మి నిలదీయగా, "మీరు లేవదీసుకొచ్చిన రాజారావును మళ్ళీ లేవ దీసుకుపోదామని" అని జవాబిస్తుంది. అంతే కాదు "సిగ్గు లేని దానివి బరి తెగించావు. నీకు నీతి లేదు. నా బతుకు నాశనం చేసిన రాక్షసివి"అని తిడుతుంది. ఇద్దరూ పెనుగులాడ తారు. రాజ్యలక్ష్మి తన గతం జయంతితో చెబుతుంది. తనకు పెళ్ళై పదేళ్ళయినా పది క్షణాలూ కూడా కమలాకరంతో ఆనందించలేకపోయానంటుంది. దానికి బాధ్యుడు అతడే కనుక అతడినే వెళ్ళి అడుగు అని భర్త చిరునామా చెబుతుంది. జయంతి బయల్దేరబోతుండగా రాజారావు దగ్గు వినిపిస్తుంది. అంటే అతడు లోపల ఉండే బయటకు రావటం లేదని జయంతికి అర్థమౌతుంది. రాజ్యలక్ష్మి జయంతిని బయటికి వెళ్ళగొడుతుంది.

ఇదంతా కమలాకరానికి చెప్పి వెక్కి వెక్కి ఏడుస్తుంది జయంతి. "ఆత్మహత్య చేసుకోలేక వచ్చాను. వాళ్ళ గురించి నేనెందుకు నా జీవితాన్ని నాశనం చేసుకోవాలనీ, నా జీవితానికి మీరో దారి చూపిస్తారనీ వచ్చాన"ంటుంది. "దీనికంతటికీ మీరే కారణం. ఇందులో మీ బాధ్యత లేదని ఒక్క మాటంటే వెళ్ళిపోతాను' ' అంటుంది చివరికి. తను ఎస్సెల్సీ పాసయ్యాననీ, టైపు తెలుసుననీ, అతని కంపెనీలో ఏదైనా ఉద్యోగం ఇప్పించమని అడుగుతుంది. తన కొడుకు సాగర్‌కు చదువు చెప్పమనీ, వంట మనిషిని సూపర్‌వైజ్ చేయమని, ఈ ఇంట్లోనే తమతోపాటే ఉండమనీ, కోరినంత జీతం ఇస్తాననీ కమలాకరం చెబుతాడు. జయంతి అంగీకరిస్తుంది.

రాజ్యలక్ష్మికి తనేం లోటు చేయలేదు. మనస్ఫూర్తిగా ప్రేమించి సుఖపెట్టాడు. కానీ ఆమె తన పరువు ప్రతిష్ఠల్ని మంటగలిపి నిర్దాక్షిణ్యంగా తనను, సాగర్‌ను వదిలి వెళ్లింది. కన్న కొడుకును సైతం వదులుకునేంతగా తనమీద ఆమె ద్వేషం పెంచుకుని జయంతిని ఉసిగొలిపింది. ఆమె పొరపాట్లు తను సహించాడు. సాగర్ పుట్టగానే తనకు చెప్పకుండా ట్యూబెక్టమీ చేయించుకున్నా క్షమించాడు. అయినా ఆమె వెళ్ళి పోయిందని బాధ పడతాడు.

సాగర్‌ను పొద్దుటే కాన్వెంటుకు పంపటం, తరువాత పుస్తకాలు చదువుకోవటం, వచ్చాక పాఠాలు చెబుతూ రోజులు గడుపుతోంది జయంతి. కమలాకరం ఉద్యోగ బాధ్యతలను ప్రాణం కంటే ఎక్కువగా గౌరవిస్తాడని తెలుసుకుంటుంది. ఈ రెండు నెలల జీతంగా డబ్బు బ్యాంక్‌లో వేసి పాస్ బుక్ ఆమె కందిస్తాడు కమలాకరం. రోజూ అర్ధరాత్రి వరకు పని చేస్తున్న కమలాకరంను వాటి వివరాల డగ్గా తన పని ప్రాముఖ్యతను వివరిస్తాడు. నెమ్మది నెమ్మదిగా అతడి ఆఫీసు పనుల లోనూ సహాయపడి ఎంతో ఊరటను కల్గిస్తుంది. కమలాకరం తన పని బరువు తగ్గినందుకు ఆనందిస్తాడు.

ఒక రోజు ఆ ఇంట్లో రాజారావు అద్దెకున్న గది తాళం చెవులు తీసుకుని గది తలుపులు తెరిచి లోపలికి వెళ్తుంది. అతని సామానంతా అక్కడే ఉంటుంది. అతని డైరీ తెరిచి చదువుతుంది. మర్నాడు కమలాకరంతో ఇన్నాళ్లూ రాజారావు అమాయకుడు, మంచి వాడని నమ్మాను. రాజ్యలక్ష్మితో వెళ్ళిపోవటంలో అతని తప్పు లేదనుకున్నాను. ఆ నమ్మకంతోనే ఇక్కడికి వచ్చాను. కానీ అతడు నీచుడు, దుర్మార్గుడని తెలిసింది. ఇక్కడ నేనుండటం అన్యాయం వెళ్ళిపోతాను అంటుంది. ఆమె తనకు సహాయపడుతున్నందు వల్ల ఆఫీసు పనిలో కాస్త విశ్రాంతి దొరుకుతోంది. కనుక వెళ్లొద్దని కమలాకరం అభ్య




ర్థించగా ఉండడానికి అంగీకరిస్తుంది.

ఒకసారి సాగర్‌ను తీసుకుని బీచ్‌కు వెళ్తుంది. వచ్చేటప్పుడు దార్లో రెండు గ్రూపుల మధ్య జరిగిన గొడవల ఫలితంగా ఎవరో విసిరిన సోడాబుడ్డి పెంకులు చేతికి గుచ్చుకోగా గాయపడి ఆస్పత్రికి వెళ్తుంది జయంతి. సాగర్ ఆమె గాయపడడానికి తనే కారణం అనుకుంటాడు. ఆమెకు బాండేజ్ వేసి రక్తం ఎక్కిస్తారు. మగతగా పడుకున్న జయంతికి రాజారావు గుర్తొస్తాడు. తనకు కావాలనే అతను పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించాడని డైరీ చదివాకే తెలిసి, తనకు మాతృత్వాన్ని దూరం చేసిన అతనిపై విపరీతమైన అసహ్యం కలుగుతుంది.

ఉదయం కమలాకరం ఆస్పత్రికి వచ్చి దెబ్బ తగిలినందుకు విచారిస్తాడు. రామాయమ్మతో భోజనం పంపించటమే కాక రెండు పూటలు వచ్చి వెళ్తుంటాడు. తరువాత డిశ్చార్జి అయి ఇంటికి వెళ్తుంది జయంతి. తన పట్ల కమలాకరం చూపిన శ్రద్ధకు ఆమె ఆశ్చర్యపోతుంది.

కమలాకరం ఆఫీసుకు వెళ్లాక తాతారావు వచ్చి జయంతితో వాగ్వివాదానికి దిగుతాడు. "ప్రైవేట్ టీచర్ ఇంట్లోనే ఉంటుందా? అలా చెబితే ఎవరూ నమ్మరు. నీకూ కమలాకరానికీ ఏ సంబంధం ఉందో చెప్పు. అతని శ్రేయోభిలాషిని. అతని నైతిక పతనాన్ని సహించను" అంటాడు. "ఆయన్నే అవన్నీ

అడగండి" అని గదిలోకి వెళ్లిపోయి బాగా ఏడుస్తుంది జయంతి. తన ఈ దుస్థితికి కారణమైన రాజారావు మాత్రం హాయిగా బతుకుతూ తనను నట్టేట్లో ముంచాడని బాధపడుతుంది.

విషయం విన్న కమలాకరం తాతారావు తరపున జయంతికి క్షమాపణ చెబుతాడు.

కమలాకరం కోరిక మేరకు సాగర్‌ను తీసుకుని సింహాచలం వెళ్తుంది జయంతి. అక్కడ రాజ్యలక్ష్మి కనిపించేసరికి సాగర్ తల్లి దగ్గరికి వెళ్లబోగా జయంతి ఆపుతుంది. ఆనాటి రాత్రి రాజ్యలక్ష్మి సాగర్-జయంతి బస చేసిన కాటేజీకి సాగర్‌ను చూడడానికి వస్తుంది. జయంతి - రాజ్యలక్ష్మిల మధ్య ఘర్షణ జరుగుతుంది.

"వాడిని నా దగ్గరకు ఎందుకు రానివ్వలేద'ని రాజ్యలక్ష్మి నిలదీస్తుంది.

"సాగర్‌కేం జరిగినా కమలాకరంగారికి సమాధానం చెపాల్సింది నేను. సాగర్ మళ్లీ రానంటే ఎలా? కమలాకరం నీ భర్త కానప్పుడు సాగర్ నీ కొడుకెలా అవుతాడు" అంటుంది జయంతి హేళనగా. అప్పటికి రాజ్యలక్ష్మి వెళ్ళిపోతుంది.

మర్నాడు సాగర్ - జయంతి తిరుగు ప్రయాణమవుతారు. బస్టాండులో రాజ్యలక్ష్మి కనిపించగానే సాగర్ తల్లి దగ్గరికి పరుగెత్తుకు వెళ్ళి "మమ్మీ! ఇంటికి పోదాం వచ్చెయ్" అని పేచీ పెడతాడు. రాజ్యలక్ష్మి కోపంతో పిల్లవాడి చెంప ఛెళ్ళుమనిపించి రాజారావుతో కలిసి వెళ్లిపోతుంది. ఇన్నాళ్లూ ఎంతో అపురూపంగా దాచుకొన్న తల్లి ఫోటోపై పెన్నుతో పిచ్చి గీతలు గీస్తాడు సాగర్. అవి అతడి హృదయంపై పడిన గాయాలుగా అన్పిస్తాయి జయంతికి.

అంతకు ముందే కమలాకరం రాజ్యలక్ష్మిలకు విడాకులై పోవటం జయంతికి తెలుసు. "సింహాచలం నుండి వచ్చాక డల్‌గా ఉంటున్నారేం? రాజ్యలక్ష్మి కన్పించిందా? " అని అడుగుతున్న కమలాకరం చేతికి కొన్ని కాగితాలిచ్చి "మీ లాయర్‌కు చెప్పి నాకు రాజారావు నుండి విడాకులిప్పించండ"ని కోరుతుంది. జయంతి.

కోర్టుకు వెళ్ళనవసరం లేకుండానే విడాకులు పొందుతుంది జయంతి. ఇన్నాళ్ళూ తనకు ఎక్కడో, ఎవరో ఉన్నారన్న భావన ఉండేది. ఇప్పుడదీ పోయింది. తన భవిష్యత్తు ఏమిటన్నదే ఓ ప్రశ్నగా మిగిలింది.

పనిమనిషి రామాయమ్మ కాళ్ళు మెట్టెలతో మెరిసి పోవటం ఆశ్చర్యంగా చూస్తుంది జయంతి. "నాకు పదేళ్లప్పుడు ఓ ఇరవై ఏళ్ళ వ్యక్తితో పెళ్లయింది. అతడెక్కడికో పారిపోయాడు. గత ఇరవైమూడు సంవత్సరాల నుండీ అతడొస్తాడని ఎదురు చూశాను. రాలేదు. మొన్న ఊరి కెళ్ళినప్పుడు మరో వ్యక్తిని పెళ్ళి చేసుకొన్నాను. ఇన్నేళ్ళనుండి నేనేమయ్యానా అన్న ధ్యాస లేనివాడి కోసం నా బతుకు ఎందుకు అన్యాయం చేసుకోవాలి' ' అని ప్రశ్నిస్తుంది రామాయమ్మ. "అంతే కాదు మీరు రాజారావుగారి భార్య కదా! మీరు కమలాకరం గారిని చేసుకుంటే తప్పేమిటి? ఎవరో ఏదో అనుకుంటారనుకోవటం వెర్రితనం" అని సలహా కూడా ఇస్తుంది. ఫలితంగా జయంతి ఆలోచనల్లో మార్పొస్తుంది. డైరెక్టర్స్ మీటింగులో తాతారావు గారికి తనను క్షమాపణ చెప్పమంటారనీ, జయంతి తనకేం అవుతుందో చెబితే ఆ అవసరం ఉండదనీ కమలాకరం అంటాడు. "మీరు నా కాబోయే భార్య అని చెప్పనా" అని అతడు ఫోనులో ప్రశ్నించేసరికి జయంతి అంగీకరిస్తుంది.

ఇద్దరూ పెళ్ళి చేసుకొని స్థిరపడతారు. ప్రేమ, నమ్మకం పునాది కావాల్సిన దాంపత్యంలో ఒకరు తప్పు చేసి, వక్ర మార్గం పట్టి, తమ దోవ తాము చూసుకుంటే, మరొకరు నిట్టూరుస్తూ, నిరాశలో బతకటం వృథా అనీ, తామూ మరొక అనుకూలమైన మార్గం చూసుకోవచ్చనే సందేశం ఈ నవల ద్వారా రచయిత అందించారు.





సెప్టెంబరు 2005 'చతుర'లో ప్రచురితమైన కస్తూరి మురళీకృష్ణ నవల

# ఒంటరిమేఘం

పై సమీక్షలు



## జీవన సౌందర్యం

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

మానవ జీవితాలనూ, గమనాలనూ అణువణువునా పెనవేసుకున్న ప్రకృతి సౌందర్యాలను, మాధుర్యాలనూ రంగరించి ఆద్యంతమూ అద్భుతంగా ఆవిష్కరించినది'ఒంటరి మేఘం' నవల. దంచిన పిండినే దంచినట్లుగా యిప్పుడు వస్తున్న అనేక రొటీన్ కథలూ, నవలలూ - వీటితో పోలిస్తే - యీ నవల చాలా కొత్తగా, ఆలోచనాత్మకంగా, అంతరంగాలను స్పృశిస్తూ- మనం తెలిసీ, తెలియకా పోగొట్టుకుంటున్న ఎన్నో అందమైన దృశ్యాలనూ, విశాల తత్వాన్నీ, జీవన సౌందర్యాన్నీ సజీవంగా, సందర్భోచితమైన సామ్యాలతో, నుడికారాలతో, ఉపమానాలతో ఆవిష్కరిస్తూ ఎంతో చక్కగా సాగింది. రచయిత దీనిని నడిపించిన తీరు అమోఘం. ప్రజ్ఞావంతం.

నిత్యజీవిత సమూహాలలో కనిపించే అనేక రకాల మనస్తత్వాలూ, అభిప్రాయాలూ, ఆలోచనలూ, విచిత్రం అనిపించే ధోరణులూ- ఆయా పాత్రల ద్వారా యీ నవలలో ప్రస్ఫుటంగా కనబరచబడినవి. కథానాయకుని పాత్ర కూడా చాలా హుందాగా, పరిణతితో, భావతరంగాల సమాలోచనతో సాగింది. ఆణిముత్యాల వంటి కొటేషన్లూ, అన్వయాలూ చక్కగా ఉన్నాయి. మానవ ప్రవృత్తిని సరిచేసుకోవడమనేది సదా సమ్మోహనమైన ప్రకృతి సౌందర్యాలను అనుభవించి,ఆస్వాదించడంపై కూడా చాలా వరకు ఆధారపడి ఉంటుంది. గొప్ప మనోవికాసానికి ప్రోద్బలం ఇచ్చేదిగా వుంది నవల. ఒంటరి మేఘమే అయినా అది మనకూ ప్రకృతికీ ఒక అందమైన వారధిగా, ఆచ్ఛాదనగా మిగిలిపోతుంది.

వి. కామేశ్వరరావు, హైదరాబాద్

---

## ఆనందరాగం

(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

"ఒంటరి మేఘం" నవలను భావుకతతో పాటు తత్త్వచింతననూ రంగరించి, అసాధారణ విషయాన్ని అతిసరళమైన భాషలో, అతి సహజమైన శైలిలో మలిచారు రచయిత. అతి భావుకుడైన కిరణ్ ట్రెక్కింగ్‌లో దేశ విదేశీయులతో కూడిన బాహ్య ప్రపంచాన్ని, ఆ ప్రకృతి సౌందర్యాన్ని, తన సహజ పరిశీలనా పటిమతోను, ఆంతరిక దృష్టితోనూ చూడగల్గుతాడు. సర్వమానవ సౌభ్రాతృత్వమూ, అనేకతలో ఏకతనూ దర్శించ కల్గుతాడు. సహ 'బాటసారులు'లోని బలహీనతలను కూడ సహేతుకంగాను, సానుభూతితోనూ అర్థం చేసుకోగల్గిన 'మనీషి' కిరణ్. ప్రకృతి అందించిన అందాలను ఆస్వాదించటమే కాక ఆ అనంత తత్వంలోని అర్థాలనూ నేర్చుకోగల్గిన తత్త్వజ్ఞాని. "ట్రెక్కింగ్" కిరణ్‌కో విశిష్ట జీవిత పథాన్ని చూపుతుంది. అతని అసామాన్య భావుకత అతనికి సృష్టి రహస్యాన్నే వివరిస్తుంది, జీవిత పరమార్థాన్నీ తెలియజేస్తుంది. కలిగిన ఆ ఆత్మజ్ఞానం వలన, తనలో "సృజనాత్మక తునక" ఉన్నదనే ఆశాకిరణం ఉదయిస్తుంది కిరణ్‌లో. తను "ఒంటరి"

కాడని ఏకత్వంలో బహుత్వాన్ని చూడగల్గు తాడు. వర్షించని మేఘం అంతకన్నా కాడు. తన సృజనాత్మక దృష్టితో వర్షించే మేఘంగా మారుతాడు. భార్య వీణ వియోగంలోని విషాదం ఆ విధంగా కిరణ్‌లో ఆత్మజ్ఞానమనే వీణ మీద ఆనంద రాగాన్ని మీటుతుంది. ఎంతో అరుదైన చక్కని నవల!

–వేం ప్రఫుల్ల, ఉడుమాల్‌పేట

## అది కాదు తీసుకోవలిసింది...

(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

'జీవితం- ఏ సంఘటన వల్ల ఆగిపోకూడదు. అప్పటి వరకు ఉన్న అనుభవాలు మరో కొత్త జీవితానికి పనికి రావాలి... అంటూ- ట్రెక్కింగ్ ఇతివృత్తంగా సాగిన ఈ నెల చతుర ఒంటరిమేఘం, వైవిధ్య కథాంశంగా మిగులుతుంది. కిరణ్ ఒంటరిగా గడిపే సన్నివేశాలు- అపుడు మనసులోనే అనుకునే కొన్ని మాటలు జీవిత పరమార్థం చెప్పేవిగా ఉన్నాయి. "కాంప్ ఫైర్"లో అందరూ తమ ప్రాంతీయత చాటుకునేందుకు ముందుకొస్తున్నపుడు మన తెలుగు వాళ్లు కూడా పాల్గొంటే బావుండు. కానీ పాత్రల చేత చేతకానితనాన్ని ప్రదర్శింపచేయడం నచ్చలేదు. కిరణ్ - తాననుభవిస్తున్నదే నిజమైన ఆనందమని, ట్రెక్కింగ్‌లోని వారంతా వ్యామోహంలో కొట్టుకుపోతున్నారని, ప్రకృతిని వారు పట్టించుకోవడం లేదని బాధపడటం,తన మాదిరిగానే మల్లే అందరూ ఉండాలనుకోవడం అమాయకత్వం. అపరిపక్వమైన 'ఆశ'కు ప్రేమ, అని పేరు పెట్టుకుంటూ ఆకర్షణలో కొట్టుకుపోతున్న వారికీ నవల కాస్తైనా 'తెలివి' తెప్పించగలదేమో? !

ఇక 'ప్రీతి' కిరణ్ ముందు బీచ్‌లో ప్రవర్తించిన తీరు వెనుక ఏ ప్రత్యేకత కూడా లేదు. ఎందుకలా ప్రవర్తించిందో తర్వాత వివరణ లేదు. నగ్నత్వాన్ని ప్రకృతితో సమానంగా పోల్చడం బాగుంది. కానీ పాశ్చాత్యుల గురించి కాస్త పొగుడుతూ రాశారు. వారి విచ్చలవిడి, వారి విశృంఖలత్వం కాదు మనం ఆదర్శంగా తీసుకోవలసింది. మనం భారతీయులుగా పుట్టి పాశ్చాత్యులుగా బతుకుతున్నాం - ఇది చాలదా? ! ఇందులో చెప్పుకోదగిన సాహసాలు, ఒళ్లు గగుర్పొడిచే సంఘటనలు లేకపోవడం కాస్త నిరాశ కలిగించింది.

– సుగంధ శ్రీనివాస్, ఎరడవల్లి

## స్త్రీ పట్ల చులకన

(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

ట్రెక్కింగ్ అనుభవాలను కళ్లకు కట్టినట్లు ఎంతో హృద్యంగా రచించిన మురళీకృష్ణగార్కి అభినందనలు. ఈ నవల చదువుతుంటే మేము కూడా భిన్నజాతులు, మతాలు, వివిధ భాషల వారితో ఒకే ట్రూపుగా ట్రెక్కింగ్‌లో పాల్గొన్న అనుభూతి కలిగింది.

ఒక వయసు దాటిన తరువాత స్త్రీ దృష్టిలో ఎటువంటి కామనా ఉండదు. కానీ, పురుషుడందుకు భిన్నం అని రచయిత పురుషుడే అయినా నిజాన్ని నిర్ద్వంద్వంగా చెప్పారు. "ఒక వ్యక్తిని ప్రేమించడమంటే ఆ వ్యక్తి లేకపోతే మరణించడం కాదు" అన్న మురుమ్కర్ మాటలు ఎంతో అర్థవంతంగా ఉన్నాయి. మనకు శత్రువుల్లా కనిపించే వారే ఆపత్సమయాల్లో ఆదుకుంటారనే విషయం ట్రూపులోని హర్యానా వారివల్ల నిరూపితమవుతోంది.

ఒంటరి మేఘం అని ఈ నవలకు పేరు

పెట్టడంలో రచయితగారి ఆంతర్యమేమిటో! కిరణ్ భార్యను పోగొట్టుకున్న దురదృష్టవం తుడు మాత్రమే గాని సర్వస్వం పోగొట్టుకు న్నవాడు కాదు. వారం రోజుల ట్రెక్కింగ్‌లో ఆడా మగా కలిసి ప్రయాణించినంతమాత్రాన ఒకరినొకరు ప్రేమించేసుకున్నాం అనుకో వడం, ఈ అమ్మాయి నాకు, ఆ అమ్మాయి నీకు అని ఎంచుకోవడంలో స్త్రీ పట్ల చులకన వ్యక్తమవుతోంది. చూడగానే కలిగేది ప్రేమ కాదు. ఆకర్షణ మాత్రమేనన్నది సువిదితమే.

బీచ్‌లో కిరణ్ సమక్షంలో ప్రీతి ప్రవర్తిం చిన తీరు నవలంతటిలో చేదు సంఘటన. ఇలాంటి సంఘటనలు జరిగే అవకాశాలు న్నాయని తెలిస్తే ఏ తల్లిదండ్రులైనా తమ పిల్లలను ఇలాంటి సాహసయాత్రలకు పంపే సాహసం చేస్తారా? ఏ ప్రయాణం లోనైనా సభ్యులందరూ ఒకే కుటుంబం లోని వారుగా మంచి మిత్రులుగా చివరి వరకూ కొనసాగితే ఆ స్నేహ మాధుర్యం, ఆ ప్రయాణపు జ్ఞాపకాలు జీవితంలో తీపి గురుతులుగా మిగిలిపోతాయి.

–బి. విజయలక్ష్మి, విశాఖపట్టణం - 07

---

## కొత్త సబ్జెక్టు

### (ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

'ఒంటరి మేఘం' ఒక నవలలాగ అనిపించలేదు. ఒక మేఘం గోవా మీద సంచరిస్తూ అక్కడి ప్రకృతి అందాలను గూర్చి చెప్పినట్లుగానే వుంది. కానీ నవలకి కావలసిన సంఘటనలు, కథా కథనం మృగ్యం. సాధారణంగా రచయిత ఏదో పాత్రలో అక్కడక్కడ తొంగిచూడడం మామూలే. కాని యీ నవలలో రచయిత కిరణ్‌లో పరకాయ ప్రవేశం చేశాడు. ట్రెక్కింగ్ గురించి చాలామందికి తెలి యదు. కొత్త సబ్జక్టు మీద రాయడం మాత్రం చెప్పుకోతగ్గ విషయం. మురు మ్కర్ పాత్ర యీ నవలలో చెప్పుకో తగ్గదిగా వుంది. ట్రెక్కింగ్ జీవితంలో హాబీగా ఎదిగిన వృద్ధుడు మురుమ్కర్. అతని గత ట్రెక్కింగ్ అనుభవాలను ముఖ్యంగా హిమాలయాల మీద ట్రెక్కిం గ్‌ని గురించి ఆ హై ఆల్టిట్యూడ్‌లో ప్రాణ వాయువు తక్కువగా వుండడం తీసుకోవల సిన జాగ్రత్తలు, తీసుకోకపోవడం వల్ల జరిగే ప్రమాదాల గురించి విషయాలు సేకరించి సంఘటనాత్మకంగా పాత్ర చేత చెప్పిస్తే నవలకి ఇంకా బలం చేకూరేది.

ఎంతమంది తెలుగు పాఠకులు హిందీ సినిమా పాటలు అర్థం చేసుకుని ఆనంది స్తారో చెప్పలేం గాని పాత్రలన్నీ వివిధ రాష్ట్రాలకూ భాషలకూ ప్రతినిధులు గావడం చేత భిన్నత్వంలో ఏకత్వాన్ని భారతీయతని ఆ హిందీ పాటల ద్వారా అక్కడక్కడ వ్యక్తం చెయ్యడం రచయిత అభిరుచులకు కళాతృష్ణకి అద్దం పట్టింది.

–ఆర్. వివేక్‌వర్ధన్, విశాఖపట్నం. ✦

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 2 57 50 528, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 2 5 518181, 2 5 598787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 27 5444; Karimnagar: 22 5216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2 5 587 54; Srikakulam: 220901; Kurnool: 25281 5; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276 576; Ongole: 256777; New Delhi: 2 575 5440; Mumbai: 22819557; Chennai: 282 52 590; Bangalore: 2558 5804.

